S.V.U. University Oriental Series No. 28
సాధారణ సంపాదకుడు : డైరెక్టర్, యస్.వి.యు.ఓ.ఆర్.ఐ.

కృష్ణిపాటి వేంకటసుబ్బకవి విరచిత

# కేదారోపాఖ్యానము

(ప్రబంధము)

సంపాదకుడు
డా. ముదివేడు ప్రభాకరరావు
ఎం.ఏ. (తెలుగు, సంస్కృతం) పి.హెచ్.డి.,
సహాయాంధ్ర పరిశోధకుడు
ఓరియంటల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్
శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం



శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ
ప్రాచ్యపరిశోధన సంస్థ
తిరుపతి
2002

S.V.U. University Oriental Series No. 28
సాధారణ సంపాదకుడు : డైరెక్టర్, యస్.వి.యు.ఓ.ఆర్.ఐ.

కృష్ణిపాటి వేంకటసుబ్బకవి విరచిత

# కేదారోపాఖ్యానము

(ప్రబంధము)

సంపాదకుడు
డా. ముదివేడు ప్రభాకరరావు
ఎం.ఏ. (తెలుగు, సంస్కృతం) పి.హెచ్.డి.,
సహాయాంధ్ర పరిశోధకుడు
ఓరియంటల్ రీసెర్చ్ ఇన్స్టిట్యూట్
శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం



శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ
ప్రాచ్యపరిశోధన సంస్థ
తిరుపతి
2002

*KĒDĀRŌPĀKHYĀNAMU OF*

*KṚṢṬIPĀṬI VĒṄKAṬASUBBA KAVI*

Critically Editied with Introduction & notes

Dr. M. PRABHAKARA RAO

Research Assistant in Telugu

Oriental Research Institute

Sri Venkateswara University

TIRUPATI - 517 502



ప్రథమముద్రణ: ఫిబ్రవరి 2002

ప్రతులు : 400

ధర : రూ.

ప్రతులకు

లైబ్రేరియన్

శ్రీవేంకటేశ్వర యూనివర్సిటీ లైబ్రరీ

తిరుపతి - 517 502

లేజర్ టైప్ సెట్ :

ప్రాచ్యపరిశోధన సంస్థ,

శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం,

తిరుపతి - 517 502

ముద్రణ:

సాయిశ్రీ ఆఫ్ సెట్ ప్రింటర్స్, 136, ప్రకాశం రోడ్డు,

తిరుపతి - 517 501, *Ph.* 25841

ఆచార్య వేమూరు వేంకటరమణారెడ్డి
ఇన్ ఛార్జ్ డైరెక్టర్
శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ
ప్రాచ్యపరిశోధన సంస్థ

తిరుపతి
14.2.2002

# తొలిపలుకులు

ఆంధ్రదేశంలో శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధనా సంస్థకొక ప్రత్యేక స్థానమున్నది. ఈ సంస్థలో గతంలో పనిచేసిన కవి పండితుల ద్వారా, దీనికొక ప్రత్యేక గుర్తింపు లభించింది. గతంలో శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రి, శ్రీ రాళ్లపల్లి అనంత కృష్ణశర్మ, శ్రీమానవల్లి రామకృష్ణకవి వంటి ఉద్దండ పండితులు ఇక్కడ సాహిత్య పరిశోధన నిర్వహించి ఉండడం మాకు గర్వకారణం. మొట్టమొదటి సారిగా అముద్రిత అన్నమయ్య సంకీర్త నలను ముద్రించిన ఘనకీర్తి కూడ ఈ సంస్థకే దక్కుతుంది. వారి అడుగు జాడలలో నడుస్తూ సంస్థ యొక్క గౌరవాన్ని యినుమడింపజేస్తూ, తాళ్ల పత్ర ప్రతుల పరిష్కరణ, ప్రచురణ బాధ్యతలను మా సంస్థ పరిశోధక బృందం కొనసాగిస్తున్నది. అందులో భాగమే ఈ ప్రబంధ కుసుమం.

ఆంధ్ర సాహిత్య ప్రక్రియల్లో ప్రబంధానికొక ప్రత్యేక స్థానముంది. ఇది ఒక విశిష్టమైన చంపూ కావ్య ప్రక్రియ. కథా సందర్భానికి, పాఠకుల అభిరుచికి, అనుగుణంగా కవి ప్రయోగించిన వివిధ ఛందోరూపాల విందు భోజనమే ప్రబంధం! ప్రాచీన ప్రబంధాలలో ఎన్నో అముద్రితంగా ఉన్నాయి, అవి మాసంస్థలోనే చెప్పుకోదగ్గ సంఖ్యలో ఉన్నాయి. మా పరిశోధన సంస్థ కు డైరెక్టరుగా పనిచేసిన ఆచార్య జీరెడ్డి చెన్నారెడ్డిగారు, ముప్పిరాల సుబ్బ రాయకవి రచించిన ప్రద్యుమ్న చరిత్రమనే ప్రబంధాన్ని పరిష్కరించి 1974 లో (S.V.U.Oriental Series No. 2) ప్రకటించారు. దాని తరువాత రెండవది గా వెలువడుతున్న ప్రబంధమే క్రిష్టిపాటి వేంకట సుబ్బకవి విరచిత కేదారోపాఖ్యానము.

ఈ ప్రబంధ పరిష్కరణ మా సంస్థలోని ఏకైక కాగితపు ప్రతి (Stock No. 347) అధారంగా సిద్ధం చేయబడింది. ఏ ఇతర గ్రంథాలయాల్లోను దీనికి ప్రతులు లేకపోవడం విశేషం. పరిష్కర్త డా. ముదివేడు ప్రభాకరరావు దీనికి చక్కని పీఠికను రూపొందించారు. ఈ పీఠిక ద్వారా పరిష్కర్త సునిశిత పరిశీలనా శక్తి, వ్రాత పత్రుల పరిష్కరణ పట్ల ఆసక్తి స్పష్టమౌతున్నది. ఇంకా ఈ సంస్థలో అపరిష్కృతంగా ఉన్న అనేక అమూల్యమైన తెలుగు ప్రబంధాలు ఇదే వరుసలో వెలుగుచూడాలన్నదే నా కోరిక.

- వి. వేంకటరమణా రెడ్డి

# కృతజ్ఞతలు

కేదారోపాఖ్యానాన్ని 1989-90 ప్రాంతాలలోనే పరిష్కరించి 1991లో కంప్యూటర్ లో స్వయంగా ఫీడ్ చేయడం జరిగింది. అవాంతర కారణాంతరాలవల్ల వెలుగుచూడలేకపోయింది. పుష్కరకాలం తరువాత ఇప్పటికైనా పుస్తకరూపం ధరించినందులకు ఎంతో ఆనందిస్తున్నాను.

అముద్రిత గ్రంథ పరిష్కృత ముద్రణల విషయంలో అత్యంత శ్రద్ధ చూపిస్తున్న మాసంస్థ ఇన్-ఛార్జ్ డైరెక్టర్ ప్రొఫెసర్ వేమూరి వేంకట రమణారెడ్డిగారికి.

నేను క్రిష్టిపాటి వేంకటసుబ్బకవి గ్రంథాలను పరిష్కరిస్తున్న సంగతి విన్నవెంటనే, తాము పరిష్కరించి ప్రకటించిన సుబ్బకవి దత్తప్రభు శతకాన్ని, మద్దులపల్లి వారు పరిష్కరించిన దీబగుంట వీరభద్ర చరిత్ర పుస్తకం జిరాక్స్ కాపీని పంపిన సహృదయ మిత్రులు శ్రీవైద్యం వేంకటేశ్వరా చార్యులవారికి,

ఈ పరిష్కృతగ్రంథంలోని జ్యోతిషవిషయాలను విడమరచి చెప్పిన నాసహోద్యోగులు శ్రీ వి. రాఘవేంద్రరావుగారికి,

ఈ గ్రంథాన్ని ముద్రణకు నిర్దుష్టంగా సిద్ధంచేయడంలో కంప్యూటర్ మీద సహకరించిన పరమేశ్వరి, గంగా సువర్ణలకు,

ఈ పుస్తకాన్ని సర్వాంగ సుందరంగా సకాలంలో వెలువరించిన సాయిశ్రీ ఆఫ్ సెట్ ప్రింటర్స్ కు, వారి ప్రెస్ సిబ్బందికి,

కృతజ్ఞతా పూర్వక పారిజాతాలు

- ముదివేడు ప్రభాకరరావు

# పీఠిక

వందే శంభు ముమాపతిం సురగురుం వందే జగత్కారణం
వందే పన్నగభూషణం మృగధరం వందే పశూనాం పతిం।
వందే సూర్యశశాంకవహ్ని నయనం వందే ముకుంద ప్రియం
వందే భక్త జనాశ్రయం చ వరదం వందే శివం శంకరమ్॥

కేదారే చోదకం పీత్వా - కాశ్యాన్తు మరణాంగతిమ్।
శ్రీశైలశిఖరం దృష్ట్వా - పునర్జన్మ న విద్యతే॥[1]

అరయ కేదారమున జలమానునతఁడు
కాశికాక్షేత్రమున మృతిఁగాంచునతఁడు
శ్రీమహీధర శిఖర మీక్షించునతఁడు
మరల జన్మించ డిద్ధరామండలమున[2]

కేదారుఁడనగా శివుఁడు. కేదరము, కేదారమనగా వరిమడి, కొండ, పాదు, పుణ్యక్షేత్రమనే అర్థాలున్నాయి. హిమాలయ పర్వతప్రాంతాలలో కేదారనాథ్ అనే పుణ్యక్షేత్రమున్నది. అక్కడి జలం స్వచ్ఛస్ఫాటిక సదృశంగా ఉంటుంది. హిమాలయాల్లో పుట్టి, బహు మూలికల శక్తిని గర్భీకరించుకొన్న ఆ జలం కేదారనాథుని సన్నిధిలో పవిత్రతను సంపాదించుకోవడంలో ఆశ్చర్యంలేదు. అందుకే, ఆజలం సర్వరోగ నివారిణి, పుణ్యక్షేత్రంలోని తీర్థం అయింది.

---

1. ఈ శ్లోకం స్కాందపురాణాంతర్గత సనత్కుమార సంహితలోని శ్రీశైల ఖండములోనిది.
2. శ్రీశైల ఖండమును తెలుగు పద్యకావ్యంగా వ్రాసిన అత్తలూరి పాపయారాధ్యుని అనువాదమిది. (2-355) అముద్రితంగా ఉన్న ఈకావ్యం ప్రస్తుత పరిష్కర్తచే ప్రకటింపబడమన్నది.

"కేదారేశు భజించితిన్" అంటాడు నాల్గుదిక్కుల్లోని పర్వత ప్రదేశాలను చూచిన సిద్ధుడు ప్రవరునితో మనుచరిత్రలో (1-71). కేదారేశ్వరుని సేవించుకోవడానికి కేదారనాథ్ కే వెళ్లవలసిన అవసరం లేదు. ఆంధ్రదేశంలోని శ్రీశైలంలో కేదారేశ్వర లింగమున్నది. ఉత్తరప్రదేశ్ లోని కాశిలో కేదారేశ్వరుడన్నాడు. కేదారశంభులింగమహిమను గూర్చి స్కాందపురాణాంతర్గత కాశీఖండాన్ని అనువదించిన శ్రీనాథుడు ఆరుగద్య పద్యాలలో వర్ణించియున్నాడు. (ఆ 6-300 నుండి 305 వరకు). దీనికే కేదారలింగ మాహాత్మ్యమని పేరు. ఈ రెండు పుణ్యక్షేత్రాలకు కూడా పోవడానికి శక్తిలేనివారికి మన పూర్వులు కేదారేశ్వర వ్రతాన్ని నిర్దేశించారు. అందుకే, కేదారోపాఖ్యానాన్ని ప్రబంధంగా వ్రాసిన కృష్టిపాటి వేంకటసుబ్బ కవి ఇలా అంటాడు.

కం. ఏ దారిలేని వారికి
కేదారవ్రతము సేయఁ - గీర్తియు శుభముల్
మోదము భక్తియు ముక్తియు
నాదిగ సకలార్థఫలము - లందుదు రవనిన్ (1-59)

దిక్కులేనివారికి దేవుడే దిక్కు అన్నట్లుగా, ఈ కేదారోపాఖ్యానంలో గర్భ దరిద్రులైన యిద్దరు అక్కాచెల్లెళ్లు మనస్ఫూర్తిగా వ్రతంచేయాలని సంకల్పించడంతో శివపార్వతులే వారిచేత ఆ వ్రతం చేయించి ఆగర్భ శ్రీమంతులను చేస్తారు. ఇరవైయొక్క గ్రంథులు (ముడులు) గల తోరాన్ని చేతికి కట్టుకొనే ఈ వ్రతానుష్ఠానపరులు, ఆశ్వయుజ కృష్ణపక్ష అమావాస్య రోజు ఈ వ్రతాన్ని ప్రారంభించి కార్తీక శుక్లపక్ష పూర్ణిమతో అనగా పదహారు రోజు వ్రతం పూర్తిచేయాలి. ఇరవైయొక్క సంవత్సరాల మధ్యకాలంలో ఏకారణంచేతనైనా మానివేస్తే విపరీత ఫలితాలు ఎదుర్కోవలసి ఉంటుంది. ఎవరైనా ఆవ్రతం చేస్తుంటే అందులో పాల్గొని తోరాన్ని సంపాదించి,వ్రతాను

ష్ఠానాన్ని మరల కొనసాగించాలి. ఇక్కడ 21 సంవత్సరాలనే సంఖ్య సుదీర్ఘ కాలాన్ని సూచించడమేగాక, 'మానవ జీవితమే ఒక వ్రతం' అనే ఆధ్యాత్మిక రహస్యాన్ని మనకు పరోక్షంగా బోధిస్తూవుంది.[1] వ్రతానుష్ఠానపరురాలైన భాగ్యవతి అనే గృహిణి, కామవేది అనే కాంచీపుర ప్రభువుకు భార్యయైనా, ఆయన మూర్ఖత్వంచేత ఐశ్వర్యాన్ని పోగొట్టుకొని, చివరికి అక్కయైన పుణ్యవతి, తన చెల్లెలు భాగ్యవతి కుమారుడైన విజయదేవునిచే కేదారేశ్వర వ్రతం అనుష్ఠింపచేయడం వల్ల పోగొట్టుకొన్న రాజ్యవైభవాలను తిరిగి సంపాదించుకోవడం జరుగుతుంది. ఐశ్వర్య మదంచే భగవంతుని యొక్క ఉనికిని తృణీకరిస్తే, ఎంతటివారికైనా అగచాట్లు, అష్టకష్టాలు తప్పవని ఈ వ్రతమాహాత్మ్యం మనకు తెలియజేస్తున్నది. శివుడు శ్మశానవాసియైనా, భస్మాన్ని ఒంటినిండా పులుముకొన్నా భక్తులకు ఐశ్వర్యాన్ని అను గ్రహించే వాడు. విభూతి అంటే ఐశ్వర్యం. అల్పాయుష్కులైన మానవులకా ఐశ్వర్యం శివానుగ్రహంచేతనే లభిస్తుందని చెప్పేదే కేదారోపాఖ్యానం.

## కవి జీవిత విశేషాలు

స్కాందపురాణోక్తమైన కేదారేశ్వర వ్రతకథను ఆధారంగా చేసుకొని, ప్రాబంధికమైన వర్ణనలనూ, కథావస్తువులో తదనుగుణంగా మార్పులను చేర్పులను చేసి కేదారోపాఖ్యానమనే ప్రబంధాన్ని మూడు ఆశ్వాసాలతో 525 గద్యపద్యాలలో వ్రాసిన కవియొక్క పుట్టు పూర్వోత్తరాలను మనం తప్పక తెలుసుకోవలసి ఉంది.

కేదారోపాఖ్యానంలోని అవతారికను బట్టి, గద్యభాగాన్ని (colophon) బట్టి కవి జీవిత విశేషాలు కొంతవరకు తెలుస్తున్నాయి. కేదారోపాఖ్యానంలో కవి తనపేరును 'వెంక కవీంద్రుఁడు', 'వెంకయ కవి'

1. వైష్ణవులు "దీర్ఘశరణాగతి" అని చెప్పేదానినే, శైవులు, సుదీర్ఘ కాలవ్రతానుష్ఠానం గాను , వీరశైవులు వీరమాహేశ్వరాచార వ్రతంగాను అనుష్ఠిస్తారు

అని తెలిపియుండగా, ఈకవియే వ్రాసిన మరొక కృతి దీబగుంట వీరభద్ర చరిత్ర అనే కళ్యాణరాజ చరిత్రము అవతారికలో వేంకటసుబ్బసుకవి, వెంకటసుబ్బకవి అని గద్యభాగంలో చెప్పబడియుండటం చేత ఈయన పూర్తిపేరు కృష్ణిపాటి వేంకటసుబ్బకవిగా నిర్ణయింపవచ్చును.

## కవి వంశవృక్షం

ఈకవి ములికినాటి బ్రాహ్మణుడు. కాశ్యపగోత్రుడు కృష్ణిపాటి వారి వంశవృక్షమిట్టున్నది.




మహాశూరులు, వేదాంత శాస్త్ర శోభిత విద్యాధరులు నల్వురు సుతులను తన తల్లిదండ్రులు కన్నారని చెప్పాడుగాని, వారిలో ముగ్గురి పేర్లనివ్వలేదు.

వారిలో సద్గుణంబులు వన్నెఁగన్న
వాఁడ వెంక కవీంద్రుండ వరకవిత్వ
తత్వనిపుణత సకలవిద్వజ్జనములుఁ
బొగడుచుండఁగఁ గృతిసేయఁబూనితేను - (అవతారిక-ప-25)

అనడంచేత ఈకవి తన తల్లిదండ్రుల సంతానంలో మొదటివాడా, చివరి వాడా లేక మధ్యముడా తెలియడంలేదు.

ఈ సందర్భంలో ఈకవియే వ్రాసిన శ్రీదత్తప్రభు శతకాన్ని పరిష్కరించి పీఠిక వ్రాసిన శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యుల వారి మాటలి లావున్నాయి. "ఇతని వంశవృక్షశాఖ ఇతని కుమారునితోనే నిలిచి పోయినది. ఇందుకొక కారణము గలదని అభిజ్ఞుల ఉవాచ. వెంకటసుబ్బ కవి కుమారుని దౌహిత్రుని వంశస్థులు కర్నూలు జిల్లా, రుద్రవరం మండలం లోని శ్రీరంగాపురంలో ఉన్నట్లు తెలియవస్తున్నది. ఈకవి మేనమామగారి ఊరు మార్కాపురం తాలుకాలో గల జల్లివారి పుల్లల చెరువు గ్రామం. అచట ఇతని మేనమామ వంశీయులైవరైనా యుందురేమో!"

## కవినివాసం

'క్రిష్టిపాడు' అనే ఇంటి పేరును పరిశీలిస్తే ఈశబ్దం కృష్టిపాడు అనే పదానికి వ్యావహారిక రూపంగా చెప్పవచ్చు. కృషి అంటే సేద్యము , వ్యవసాయము. కృషిచేసే వాడు కృషికుడు - రైతు, కృషీవలుడు. కృషకము అంటే నాగలి కఱ్ఱు. కృష్టము అంటే దున్నబడినది. కృష్టి అంటే దుక్కి అని అర్థాలు.

'క్షితి హలకృష్టిఁబుట్టి యడగెన్ క్షితియందునె సీత' అని ఆముక్త మాల్యదా ప్రయోగం. హలకృష్టి అంటే నాగేటి దుక్కి. కాబట్టి వ్యావసాయిక

కుటుంబానికి చెందిన కృష్టిపాడు అనే గ్రామవాస్తవ్యుడు కృష్టిపాటి వేంకటసుబ్బ కవి. కృష్ణశబ్దం వ్యవహారంలో క్రిష్ణ అయినట్లు, కృష్టి శబ్దానికి వ్యవహారిక రూపంగా క్రిష్టి యేర్పడిందని చెప్పవచ్చు. కొన్ని వ్రాతప్రతులలో క్రిష్ణిపాటి అని ఉండడం వ్రాయసకాని పొరబాటు (scribal error) గా చెప్పవలసి వుంది.

ఈ కృష్టిపాడు కర్నూలు జిల్లాలోని నేటి దొర్నిపాడు మండలంలో వుంది. ఈ కవి ప్రప్రథమంగా గద్వాల సంస్థానం వెళ్లినప్పుడు ఆ సంస్థానాధిపతి మీ స్వగ్రామమేది? అని ప్రశ్నిస్తే ఈ కవి ఆశువుగా చెప్పిన సీస పద్యం ఇప్పుడు ఎత్తుగీతి లేకుండా లభిస్తూవుంది.

సీ. ఉయ్యాలవాడకు నుత్తరంబున నటు
కీర్తింప మాయూరు క్రిష్టిపాడు
నంద్యాలకున్ దక్షిణమున రెండామడ
కీర్తింప మాయూరు క్రిష్టిపాడు
పడకండ్ల కామడపరువులోఁ బడమట
గీర్తింప మాయూరు క్రిష్టిపాడు
నొసము విలాతిలో నుతికెక్కు రేనాట
గీర్తింప మాయూరు క్రిష్టిపాడు

అని చాటుపద్యంచేత కవి స్వగ్రామము క్రిష్టిపాడు అని తేలింది. కళ్యాణ రాజ చరిత్రము (దీబగుంట వీరభద్ర చరిత్ర) అవతారికలో

వర క్రిష్టిపాటి సద్వంశార్ణవో దీర్ణ
వర్ణిత పూర్ణ జైవాతృకుఁడవు

అని తనను గూర్చి వర్ణించుకొన్నాడు. కేదారోపాఖ్యాన గద్యలో కూడ క్రిష్టిపాటి వంశ పయః పారావారా రాకా సుధాకరుడనని చెప్పికొన్నాడు.

## కవికాలం

కర్నూలు జిల్లా, ఆళ్లగడ్డ మండలం, లింగందిన్నె గ్రామంలో వెలసిన శ్రీగురుదేవదత్త ధరణిసీతారామయోగీంద్రుల వారి ప్రభావానికి లోనై వారిని కీర్తించి శిష్యరికం చేసిన కవి పండితులలో కృష్టిపాటి కవి ఒకరు. శ్రీసీతారామస్వామి వారి కాలం క్రీ.శ. 1714 - 1796. సుబ్బకవిచే వ్రాయబడిన శ్రీదత్తప్రభు శతకము తాళపత్ర ప్రతి వ్రాసిన కాలం క్రీ.శ. 1780.

శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రి 1922వ సంవత్సరం చాటుపద్య మణి మంజరి ద్వితీయభాగాన్ని ప్రచురిస్తూ అందులో కృష్టిపాటి కవిగారి నాలుగు చాటు పద్యాలు ఇచ్చారు. (పుటలు. 42-43) ఆ సందర్భంలో కవిని గూర్చి ప్రస్తావిస్తూ, " ఈ కవి ఇప్పటికి డెబ్బదియేండ్లకుఁ బూర్వమున్నవాడు" అని వ్రాశారు. దీన్నిబట్టి 1922 -- 70 = 1852 కవి జీవించిన చివరి సంవత్సరంగా భావించవచ్చు.

శ్రీమద్దులపల్లి వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు 1946లో దీబగుంట వీరభద్ర చరిత్రకు తొలిపలుకు వ్రాస్తూ - " ఈయన క్రీ.శ. 1845 ఆ ప్రాంతములలో నించుమించు జీవించియున్నవాడు" అని తెలియజేశాడు. దీనికి ప్రధాన కారణం ఆయన పరిష్కరించి ప్రకటించిన దీబగుంట వీరభద్ర చరిత్ర తాళపత్ర ప్రతి చివర వ్రాయసకాడు"విశ్వావసు నామ సంవత్సర శ్రావణ శుద్ధ పంచమి వరకు నందెల బళెరాచయ్యా కొమారుడు నాగయ్యా వ్రాసినది" అనే వక్కణాన్ని బట్టి ఈ తాళపత్ర ప్రతి క్రీ.శ. 1905 నాటిదని మద్దులపల్లి వారు వ్రాశారు. కాని ఆ ప్రతి క్రీ. శ. 1845 నాటిదని శ్రీవైద్యం

వారు భావిస్తున్నారు. క్రీ. శ. 1845 అనే శాస్త్రిగారి కాలనిర్ణయంలో మాత్రం ఔచిత్యం కనబడుతుంది. ఈ అంశాలన్నిటిని పరిశీలిస్తే వెంకట సుబ్బకవి 18వ శతాబ్దం ఉత్తరార్ధంలో జన్మించి, 19వ శతాబ్దం పూర్వార్థం వరకు జీవించియున్నట్లు చెప్పవచ్చును. అంటే క్రీ.శ. 1754 నుండి 1845 వరకు జీవించియున్నట్లు భావించవచ్చును అని వైద్యంవారు చెబుతున్నారు.

ధరణి సీతారామయోగి క్రీ.శ. 1796 వరకు జీవించియుండం చేత ఈ కవి ఆయన శిష్యుడుగా, ఏ వయసులో చేరారో తెలియదు, కాని వైద్యం వారు కవి జన్మ సంవత్సరం క్రీ.శ. 1754 అని అంత ఖచ్చితంగా చెప్పడం లో ఆధారమేమిటో సరిగ్గా తెలియడం లేదు. ఒకటి మాత్రం ఇలా భావించ డానికి అవకాశం ఉంది. క్రిష్టిపాటి వారి దత్తప్రభుశతకం వ్రాతప్రతి కాలం శ్రీవైద్యం వారి నిర్ణయం ప్రకారం క్రీ.శ. 1780. కవికి అప్పుడు 30-35 సంవత్సరాల వయసు అనుకొంటే 1750 లేక 1755 మధ్యకాలంలో సుబ్బ కవి జన్మించి నట్లు చెప్పవచ్చు. మద్దులపల్లి మరియు వేటూరి వారి నిర్ణయం ప్రకారం క్రీ.శ. 1845 లేక 1852 క్రిష్టిపాటి వారి చరమ జీవిత సంవత్సరాలుగా చెప్పవచ్చు. అంటే ఏవిధంగా చూచినా ఈకవి 90 సంవత్సరాలకు పైబడి జీవించినవాడని ఖచ్చితంగా చెప్పవచ్చు.

## పాండిత్య ప్రకర్ష - విద్యాగురువులు

కేదారోపాఖ్యానం గద్యభాగాన్ని బట్టి ఈకవి 'శ్రీపంచ వక్త్ర హనుమత్ ప్రసాదలబ్ధకవితావిచక్షణుడు'. దీబగుంట వీరభద్ర చరిత్ర అవతారికలో కూడ 'పంచముఖవీర హనుమత్ వరలబ్ధ సాహిత్యవిశారదుడు' లక్షణగ్రంథ విలక్ష ణాక్షయ దక్షశివరామగురుపాదసేవకుడుగా చెప్పికొన్నాడు. ఈ శివరామ గురువెవరో తెలియడంలేదుగాని సుబ్బకవికి సాహిత్య విద్యాగురువు శివ రాముడని, ఆధ్యాత్మిక విద్యాగురువు ధరణి సీతారామయోగియని చెప్పాలి.

## హనుమదుపాసకుడు - వశ్యవచస్కుడు

సుబ్బకవి పూర్వీకులు కంపమళ్లలో వెలసిన ఆంజనేయ స్వామిని కొలిచేవారు కాబోలు. కేదారోపాఖ్యాన అవతారికలోని ఒక సీసపద్యంలో కంపమళ్ల గ్రామవర్ణన చేయబడింది. దాని ఎత్తుగీతి ఇలాఉంది.

గీ. ఇట్టి సద్రాజధాని చేపట్టినట్టి
పరమపావన శ్రీరామ భద్ర పాద
భవ్యయుగళార్చనామాంశ భవ్యయోగ
భంజితాశూర సముదాయ! యాంజనేయ! (ప-13)

ఇష్టదేవతాస్తుతిలో హనుమద్వర్ణన ఇలా ఉన్నది.

ప్రమదాస్యంబు, విశాలవక్షము మహా బాహుద్వయంబున్ సువ
ర్ణమణీ యుక్త కిరీటమున్ విమల నూత్న స్వర్ణ యజ్ఞోపవీ
తము హారాయత కంఠముజ్వలసిచండంబున్ లసన్మంజీఁగ
ల్గు మహాత్ముండు సమీరజుండెపుడు నాకున్ గానుపించున్ దగన్ (ప-8)

దీబగుంట వీరభద్ర చరిత్ర అవతారికలో-

వానరనారసింహ ఖగవల్లభ కోల తురంగ వక్త్రముల్
పూని గదాసి ఖేట హల పుస్తక పర్వత శంఖచక్ర శూ
లానకముల్ ధరించి హృదయంబున రాముల నుంచి భక్తులన్
మానకప్రోచు పంచముఖ మారుత నందనునాశ్రయించెదన్ (ప-12)

గీ. సప్తకోటి మహామంత్ర సర్వయంత్ర
తాంత్రిక విధాన బ్రహ్మవిద్యాధురీణ
మాననీయ మహాధ్యాన మగ్నమాన
సుండ వీ భువి వేంకటసుబ్బ సుకవి (ప- 20)

మద్దులపల్లివారి మాటల్లో చెప్పాలంటే 'ఈకవి గొప్ప యుపాసకుడు. పంచ ముఖాంజనేయుడీయన యుపాస్యదైవము ఆంజనేయుడు పలుకు తోడుగా నీయనకు ప్రత్యక్షము. ఈయన శాపానుగ్రహశక్తిగల వశ్యవచస్కుడు. నిరంకుశుడు'. ఈయన వాక్శుద్ధికి సంబంధించిన కొన్ని సంఘటనలు వేటూరి వారు, మద్దులపల్లి వారు కొన్ని చెప్పియున్నారు.

వేంకట సుబ్బకవికి నశ్యం వాడే అలవాటు వుండేది. ఒకసారి ఈ కవి సిరివెళ్ల ప్రాంతంలో ప్రయాణం చేస్తూ నశ్యానికి పొగాకు కావలసి వచ్చి దారిలో ఒక కోమటి ఇంటికి వెళ్లి పొగాకిమ్మని అడిగాడు. దానికాయన గొణుగుతూ లేదన్నాడట. పోనీ తూకం ప్రకారం యిమ్మన్నా శెట్టి లేదని చిరాకు పడ్డాడట. 'సరేలేపోనీ' అని సుబ్బకవి ఆవూరు దాటగానే, శెట్టిగారి ఇంటిలో గల పొగాకు మండెలకు నిప్పంటుకొని పొగాకంతా దగ్ధమై పోయిందట. అప్పుడు శెట్టిగారు సుబ్బకవికి పొగాకివ్వక అపరాధం చేసి నందు వల్లనే ఈ అనర్థం సంభవించిందని పశ్చాత్తాపంతో కవిగారినివా సానికి వెళ్లి క్షమాపణలు చెప్పుకొని తాంబూలమును సమర్పించి ప్రతి సంవత్సరం వార్షికం సమర్పించుకొనేవాడట. దీన్నిబట్టి వెంకటసుబ్బకవి వేములవాడ భీమకవి వలె శాపానుగ్రహ సమర్థుడని తెలుస్తుంది.

మహానంది క్షేత్రంలో జగద్గురు శ్రీ పుష్పగిరి శంకర భారతీ స్వాములవారు నవరాత్ర దీక్ష జరుపుచుండగా, ఒకనాడు బ్రాహ్మణభోజన సమయానికి కుంభవృష్టి కురవసాగింది. అప్పుడు స్వాముల వారు సుబ్బ కవితో బ్రాహ్మణ భోజనమునకు ఆకాలమగుచున్నది, వర్షము నాపలేవా? అని అడుగగా సుబ్బకవి తన ఉపాస్య దైవమైన ఆంజనేయ స్వామివారిని ఉద్దేశించి -

గోంద్రలు పెట్టి మేఘుడతి కోపమునన్ గురియంగ జొచ్చె మా
తండ్రి! మరుత్తనూజ! నను దబ్బరకాడని యెంచకుండ నీ
వేంద్రము నీవె మాన్పవలె వేయువిధంబులగాక యున్న మీ
తండ్రికి నైన జెప్పి జలద ప్రతిబంధము మాన్పు మారుతీ!

విద్యుత్పింగళ మంగళేక్షణ కృపా విర్భూతశ్రీ క్రిష్టిపా
డ్విద్వద్వేంకట సుబ్బసూరి కవితోద్వృత్త మాలించి నీ
విద్యుద్గర్జన భర్జనాదులడరన్ వేమారు వర్షింపకే
విద్యాశంకర భారతీ విజయమున్ విశ్రాంతి వాటిల్లగా

అని చెప్పగానే భోరున కురుస్తున్న వర్షం ఆగిపోయి బ్రాహ్మణ సమారాధనం చక్కగా జరిగిందట. విద్యాశంకర భారతీ స్వామివారు తమ సంస్థానము నుండి వెంకటసుబ్బకవికి వార్షికం ఏర్పాటు చేసి ఆతని వశ్యవాక్కుకు మెచ్చుకొని గొప్పగా సన్మానం చేశారట. వార్షికం ఏర్పాటు చేసినట్లు దాన పత్రం వ్రాసియిచ్చారట. సుబ్బకవి తర్వాతకూడా ఆయన కుమారుడు వార్షికం తెచ్చుకొనేవాడట. ఈ దానశాసన పత్రం సుబ్బకవి కుమారుని దౌహిత్రుని దగ్గర శ్రీరంగాపురంలో వుండినట్లు మద్దులపల్లి వారు చెబుతున్నారు.[1]

ఆళ్ళగడ్డ తాలూకా శ్రీరంగాపురంలో కరణంగారి యింటిలో పెళ్ళి జరుగుతుండగా సుబ్బకవి అక్కడి సభలో కూర్చుండి చేతులు పైకెత్తి ఏదో ఒక వస్తువును పట్టుకొని క్రిందికి దించినట్లుగా దించి పెట్టాడట. తాము చేసినదేమిటని ఒక వ్యక్తి ధైర్యం చేసి అడుగగా "నాయనా! దొర్నిపాటిలో కరణంగారి అబ్బాయి మిద్దెయెక్కి క్రిందపడుతుంటే మా ఆంజనేయ స్వామి

1. దీబగుంట వీరభద్ర చరిత్ర (1946) తొలిపలుకు, పుటలు 5-6.
చాటుపద్య మణిమంజరి, ద్వితీయ భాగం, (1922), పుటలు. 42-43

వారిని అక్కడికి పంపి నేనిక్కడ యిలా చేసాను అన్నారట". పిమ్మ
కొందరు చాటుగా దొర్నిపాటికి మనిషిని పంపించి విషయాన్ని విచారించ
నిజంగా ఆవేళకు సరిగ్గా అలాగే జరిగిందట. ఆమాటలను బట్టి ఆంజనే
స్వామి మహిమయే అని అందరూ అనుకొన్నారు.

## సుబ్బకవి చాటువులు

నొసము సంస్థానాధిపతిగా వుండి సిపాయిల తిరుగుబాటు
పూర్వమే కుంఫిణీ ప్రభుత్వాన్ని ఎదిరించిన ధీరుడు ఉయ్యాలవాడ న
సింహారెడ్డి (విప్లవకాలం 1845-1847) ఉయ్యాలవాడ కర్నూలు జి
కోయిలకుంట్ల తాలూకాలో ఉన్నది. దీన్నిబట్టి క్రిష్టిపాటి వెంకటసుబ్బ
ఉయ్యాలవాడ నరసింహారెడ్డికి సమకాలీనుడని తెలుస్తున్నది. ఓబ
చార్యులు నొసము సంస్థానములో ఆస్థానకవి. వెంకట సుబ్బకవి ఒకస
నొసము సంస్థానానికి నరసింహారెడ్డి ఆహ్వానం మీద వెళ్లి సన్మాని
బడినాడు. సుబ్బకవికి నశ్యం లేకుండా క్షణం గడవదుకదా! పొడ
కాయలో నశ్యం నిండుకొన్నది. అప్పుడిక చేసేది లేక ఓబళాచార్యుల
యిట్లన్నారు.

నశ్యములేదుగా! పవనవనందన దివ్య కటాక్ష వీక్షణా
వశ్య వరప్రభావ విభవాను భవాద్భుత భూమి భృద్ధనుః
కైశ్య ఘుమంఘుమం ఘుమిత గాంగఝురీ విలుఠత్తరంగ సా
దృశ్య కవిత్వతత్త్వ ముఖరీ కృత వేంకటసుబ్బసూరికిన్

అని చెప్పగానే ఆచార్యులవారు నశ్యాన్ని అందిస్తూ -

కో కో నశ్యమవశ్య మీశ్వర జటాకోటీరటద్ద్యోధునీ
ప్రాకా శ్యోర్మి సకాశ పేశల సుశబ్ద ప్రక్రియోపక్రమా
నేక గ్రంథనిబంధ నార్జిత సమున్నిద్ర ప్రతాపప్రథా
స్తోక శ్రీకర క్రిష్టిపాటి కుల సింధు స్వచ్ఛ చంద్రోదయా![1]

ఒకసారి సుబ్బకవి తన మేనమామ యూరైన మార్కాపురము తాలూకాలోని జల్లివారి పుల్లలచెఱువుకు వెళ్ళినపుడు సూర్యాస్తమయ కాలంలో జల్లి దివాకరనాయుడు గారు గుఱ్ఱముపై స్వారి బోతుండగా చూచి సుబ్బకవి -

జల్లి దివాకరావనిపు శౌర్య యశంబుల కోడి, తేజమున్
డిల్ల పడంగ లోకమున తీవిగ నుండగ లేక మెల్లగా
నల్ల దివాకరుండకట! యయ్యపరాంబుధిఁ గ్రుంకుచున్న వాఁ
డెల్ల యడుంగులున్ జగతి నేనుఁ గడుంగుకులోకువే కదా!

అనే పద్యం చెప్పగా వెంటనే సంతోషించిన ప్రభువు గుఱ్ఱము దిగి మీకేమి కావలయునని అడుగగా, సుబ్బకవి, ఆకాలంలో నల్లమలలోని నుండి రాక పోకలకు కాలినడకయే తప్ప వాహనమేదీయులేదుకాబట్టి గుఱ్ఱము నివ్వవల సిందనే భావాన్ని నర్మగర్భంగా యిమిడ్చి -

ఎండగుఱాలనెక్కి పరుగెత్తెడి మమ్ముకను గూడి నీ సము
ద్దండ తరాశ్వమొక్క మొగిఁ దాఁబరుగెత్తఁగఁ జాలునేని యా
కొండల మీదికిన్ విడుము, గుఱ్ఱపు ధాటిని జూతమింతకున్
బండిన వెన్నెలన్ గసరి ప్రబ్బిన కీర్తిఘనా! దివాకరా!

1. దత్తప్రభు శతకము - క్రిష్టిపాటి వేంకటసుబ్బకవి, పరిష్కర్త వైద్యం వేంకటేశ్వరా చార్యులు, కర్నూలు, 1988, చూ. పీఠిక.

అని చెప్పిన పద్యంలోని అభిప్రాయాన్ని గ్రహించి దివాకర నాయుడుగారు తానెక్కిన గుఱ్ఱాన్ని, తాను ధరించియున్న షేర్వాణి (పెద్దకోటు), పెద్ద పోగులు సమర్పించి వార్షికము యేర్పాటు చేసి, అప్పుడప్పుడు దర్శనం మిప్పించుచుండవలెనని ప్రార్థించాడట! ఎక్కడికైనా పోయేటప్పుడు వేంకట సుబ్బకవి ఆప్రభువిచ్చిన షేర్వాణి, పోగులు ధరించి గుఱ్ఱము పైనెక్కి పోయేవాడట.

## కవి రచనలు

క్రిష్టిపాటి వేంకటసుబ్బకవి సమకాలీనుడైన నొసము సంస్థానంలో ఆస్థాన కవి ఓబళాచార్యుల కోకనశ్యమనే చాటుపద్యంలో - 'అనేక గ్రంథ నిబంధనార్జిత సమున్నిద్ర ప్రతాపప్రథా'. అనే వాక్యాన్ని బట్టి సుబ్బకవి అనేక గ్రంథాలు రచించినట్లు తెలుస్తున్నది, కాని మనకిప్పుడు లభించే గ్రంధాలు ఐదు మాత్రమే. అవి -

1. కేదారోపాఖ్యానము (ప్రబంధము)
2. కళ్యాణ రాజచరిత్రము (దీబగుంట వీరభద్ర చరిత్ర)
3. శ్రీదత్తప్రభు శతకము (గేయ శతకము)
4. హనుమచ్ఛతకము (సంస్కృతం)
5. నాడీనక్షత్రమాల (జ్యోతిష గ్రంథం)

ఈ ఐదు గ్రంథాలలో ప్రస్తుతం కేదారోపాఖ్యానమనే ప్రబంధం పరిష్క రింపబడి ప్రకటింపబడుచున్నది. మద్దులపల్లి వారు దీన్ని కేదారేశ్వర మాహాత్మ్యమని పేర్కొవడం చూస్తే వారీ గ్రంధం యొక్క తాళపత్ర ప్రతుల్ని గాని కాగితపుప్రతుల్నిగాని చూచినట్లుకానరాదు. వారిననుసరించి శ్రీవైద్యంవారుకూడ కేదారేశ్వర మాహాత్మ్యం అముద్రితం అంటూ మద్దుల

పల్లివారు దీన్ని చూచినట్లుగాను 1946వరకు ఆప్రతి జీవించి ఉందని భావించారు. ఆప్రతులు కర్నూలు మండలంలోనే ఉండవచ్చు. కాని 1939 లో స్థాపింపబడిన శ్రీవేంకటేశ్వర ప్రాచ్యపరిశోధన సంస్థలోకేదారోపాఖ్యానం కాగితపు ప్రతి ఒకటిమాత్రమే (Stock No. 347)లభ్యమవుతుండడం విశేషించి పేర్కొనదగింది. దీని ప్రతులు మరే యితర ప్రాచ్య పరిశోధనా గ్రంథాలయాల్లో లేకపోవడం ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది. లభ్యమవుతున్న ఏకైక కాగితపు ప్రతిని ఆధారంగా చేసుకొని, తత్పూర్వం మద్దులపల్లి వారిచే పరిష్కరింపబడి ప్రకటింపబడిన దీబగుంట్ల వీరభద్ర చరిత్ర (కళ్యాణ రాజ చరిత్రము) ముద్రితా ముద్రిత ప్రతుల్ని సంప్రదించి కవి హృదయానికి దగ్గరగా ప్రస్తుత కేదారోపాఖ్యాన పరిష్కృత ప్రతి సిద్ధం చేయబడింది. ఈ గ్రంథంలోని విశేషాలు తర్వాతి పుటల్లో చర్చింప బడుతుంది.

2. దీబగుంట వీరభద్ర చరిత్ర: దీనికే కళ్యాణ రాజ చరిత్రమని పేరు. దీని తాళపత్ర ప్రతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధన సంస్థ గ్రంథాలయంలో (Stock No. 343) లో ఉన్నది. ప్రస్తుత పరిష్కర్త దీన్నిగూడ పరిష్కరించి ముద్రణకు సిద్ధంచేసియున్నాడు. దీనికి తాళపత్ర ప్రతులు రెండు, కాగితపు ప్రతి ఒకటి, మొత్తం మూడు ప్రతులు లభింపగా పరిష్కరించినవారు నంద్యాల మునిసిపల్ హైస్కూల్ ప్రధానాంధ్ర పండితులైన విద్వాన్ కావ్యతీర్థ శ్రీమద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారు. వీరు దీనిని దీబగుంట వీరభద్రాలయ ధర్మకర్తయైన సారెడ్డి వీరారెడ్డిగారిచే 1946లో ప్రకటింపజేశారు.

---

1. దీబగుంట వీరభద్ర చరిత్ర ముద్రిత ప్రతి జిరాక్స్ కాపీని నాకు 29.11.1989లోనే పంపిన మదీయ సాహితీ మిత్రులు సమానధర్ములు శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యుల వారికి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ఇది మూడు ఆశ్వాసాల పద్యకావ్యం. పూర్వం రణవీర ఘంటా నృసింహకవి ద్విపదకావ్యంగా రచించిన దానిననుసరించి తుప్పద శరభయ్య ప్రభువు కోరికమేరకు వేంకటసుబ్బకవి ఈ గ్రంథాన్ని చంపూ కావ్యంగా రచించాడు. కర్నూలు జిల్లా, ఆళ్లగడ్డ తాలూకా, గోస్పాడు మండలంలో గల దీబగుంట గ్రామంలో వెలసిన వీరభద్ర స్వామి వారి చరిత్ర యిందలి ప్రధానేతివృత్తం. మహానంది క్షేత్రవైభవం, కళ్యాణ రాజుల చరిత్ర, బసవేశ్వరుడి వృత్తాంతం, వీరభద్ర మహిమ, వీరశంకర ప్రభువు ఉదంతం, స్పర్శవేది లింగ మహిమ మొదలైన అంశాలిందులో వర్ణింప బడినాయి. మద్దులపల్లి వారు ప్రస్తావించిన తాళపత్ర ప్రతి లేఖకుడు నందెల బళెరాచయ్య కొమారుడు నాగయ్యయే మాసంస్థలోని తాళపత్ర లేఖకుడు కావడం గమనింపదగినది. దీని లేఖన కాలం క్రీ.శ. 1845.

3. శ్రీదత్త ప్రభు శతకము: క్రీ.శ. 1780లో లిఖింపబడి, శ్రీ ధరణి సీతారామ స్వామి వారికి సమర్పింపబడిన ఈ శతకం తాళపత్ర ప్రతిని పరిష్కరించి విపుల పీఠికతో 1988లో శ్రీగురుదేవదత్త ధరణి సీతారామస్వామి భక్త సమాజంవారిచేత ప్రకటింపచేసినవారు,శ్రీవైద్యంవేంకటేశ్వరాచార్యులవారు.

దత్తప్రభుశతకం మాత్రాఛందస్సులో రచింపబడిన 132 గేయపంక్తులు గలది. ఈగేయాలు ప్రతి ఐదు మాత్రలకు విరుగుతూ, ఖండగతిలో నడు స్తాయి. ద్విరదగతిరగడ పద్యలక్షణానికి సరిపోతాయి. ధరణి సీతారామ స్వామి శిష్యరికం చేసిన వేంకటసుబ్బకవి క్రీ.శ. 1780 ప్రాంతాల్లోనే ఈ శతకం రచించినాడు.

ధరణి సీతారామ ధన్యుడౌ నీవవైు
పరుల పాపములెల్ల బాపు దత్త ప్రభో!

అట్టెలింగము దిన్నె పట్టణంబున బుద్ధి
బుట్టి నిల్చిన యత్రిపట్టి దత్త ప్రభో!
పాటించి విను క్రిష్టిపాటివేంకట సుబ్బ
చాటు ధారాపార ధాటి దత్త ప్రభో!

అనే గేయపాదాల వల్ల కర్తృత్వం తెలుస్తున్నది. ఈ శతకంపై భక్త రామదాసుగా పేరొందిన కంచెర్ల గోపన్న వ్రాసిన పాహి రామప్రభో పాహిరామ ప్రభో, పాహి భద్రాది వైదేహి రామప్రభో! అనే గేయ శతకం యొక్క ప్రభావమేగాక, మన్నెకొండ హనుమద్దాసు రచించిన పాహి నారాయణా, పాహి నారాయణా, పాహి భద్రాది వైదేహి నారాయణా! అనే గేయ శతకం యొక్క ప్రభావం కూడా కనబడుతుంది. సుబ్బకవి శతక ప్రారంభంలో పాహిదత్త ప్రభో, పాహి దత్త ప్రభో, పాహి భక్తావనోత్సాహి దత్తప్రభో అని అదే నడకలో తన రచనను నడిపించాడు.

4. హనుమచ్ఛతకము: సుబ్బకవి తనఉపాస్యదైవమైన హనుమంతుని గూర్చి సంస్కృతంలో రచించిన శతకమిది అని మద్దులపల్లివారు చెబుతున్నారు. అముద్రితమైన ఈ శతక ప్రతి నాకు లభించలేదు.

5. నాడీనక్షత్రమాల: ఇది వైద్య గ్రంధమని మద్దులపల్లివారు వ్రాశారు. కాని జ్యోతిష గ్రంధం కావచ్చు. ఇదే శీర్షికతో వావిళ్ల వారు మద్రాసు నుండి 1978లో ప్రచురించియున్నారు. కాని ప్రతులు అలభ్యం. ఇటీవల విజయవాడలోని రోహిణి పబ్లిషర్స్ వారు నాడీ నక్షత్రమాల అనే గ్రంథాని ప్రచురించారు. సుబ్బకవి రచన తెలియకపోవడంవల్ల ఇది ఆగ్రంధమేనని నా అనుమానం.

## కేదారోపాఖ్యానం - అవతారికా విశేషాలు

కేదారోపాఖ్యానం శివాంకితం కాబట్టి కావ్యాదిలో శివస్తుతి చేయబడింది. తిక్కనకు హరిహరనాధుడు స్వప్నంలో సాక్షాత్కరించినట్లు సుబ్బకవికి

కవికి శివుడు స్వప్నంలో కనబడి 'యుష్మద్రచితప్రబంధంబు మదంకితం సేయుము, సకల విభవంబులు గల్గునని' అంతర్ధానమయ్యాడు. కవి ని మేల్కాంచి ఆరు షష్ఠ్యంత పద్యాలు చెప్పాడు. కవి ఇష్టదేవతల శ్రీలక్ష్మీనారాయణ, విష్ణుమూర్తి, శ్యామల, లక్ష్మి, శారద, విఘ్నేశ్వ వాయునందన, అష్టదిక్పాలక, నవగ్రహ స్తుతులున్నాయి. సుకవి స్తు కుకవి తిరస్కృతి తర్వాత కవి వంశక్రమవర్ణన చేశాడు. ఆతరువాత స్వప్నవృత్తాంతం, షష్ఠ్యంతాలు వస్తున్నాయి.

## వ్రత శబ్ద నిష్పత్తి

1. వృఞ్, వరణే అను ధాతువునుండి గాని, వృఞ్, సంభక్తౌ అను ధాతు యొక్క బాహుళకత్వంచేత 'వ్రియతే ఇతివ్రతమ్' అను కరణ వ్యుత్ప చేత, కిత్ అయిన అతచ్ ప్రత్యయం రాగా, కిత్ అగుటవలన గుణాభావ చేత యణ్ రాగా వ్రత శబ్దము సిద్ధించుచున్నది.

2. మరోకరకంగా చూస్తే 'వ్రజంత్యనేన స్వర్గమ్' అనే వ్యుత్పత్తిని అంగీకరిస్తే **'గత్యర్థాత్ వ్రజధాతోః** గోచర సంచర' ఇత్యాది సూత్రమువలన 'ఘ ప్రత్యయ **పృషోదరాదిత్వాత్** జకారస్థానే తకారాదేశేన సాధయంతి వ్రతశబ్దమ్'.

## వ్రతశబ్దార్థ విచారము:

దీనిలో మొదటి వ్యుత్పత్తిననుసరించి వరణము, స్వీకారము పాలనము, కర్తవ్యము, ఆచరణీయము అనే అర్థాలు సిద్ధిస్తున్నాయి రెండవ వ్యుత్పత్తి చేత పుణ్యమును గలుగజేయునది, స్వర్గప్రాప్తి సాధకము అనే అర్థాలు సిద్ధిస్తున్నాయి. ఉణాది కోశములో వ్రతశబ్దం భక్షణము అశనము, అనే అర్థాల్లో చెప్పబడి వుంది. కాబట్టి నియమపాలనం, పుణ్య జనకమైన ఉపోషణాదికం, మధుమాంస వర్జనాధి నియమం. నియమ

గ్రహణం, శాస్త్రచోదితనియమానుష్ఠానం మొ॥ వ్రతశబ్ద వాచ్యాలవుతాయి.

a) దీర్ఘకాలాను పాలనీయః సంకల్పం వ్రతమ్-నారాయణోపాధ్యాయుడు.

b) స్వకర్తవ్యవిషయో నియత స్సంకల్పోవ్రతమ్-దత్త హరినాథ వర్ధమానాదులు

c) నియమరూపా ధర్మా అపి వ్రతాః - మనువు

d) సమ్యక్ సంకల్ప జనితానుష్ఠేయ క్రియావిశేష రూపం వ్రతమ్ - న్యాయకోశకారుడు

వ్రతం ప్రవృత్తి నివృత్తి రూపం. అనగా ద్రవ్యపూజనాది విశేష భోజన ప్రవృత్తిరూపం. ఉపవాస మధుమాంస వర్జనాది నివృత్తి రూపం. వ్రతాలు మూడు విధాలు-a) నిత్య వ్రతాలు b) నైమిత్తిక వ్రతాలు c)కామ్య వ్రతాలు. కేదారేశ్వర వ్రతం కామ్యవ్రతం. వైదిక క్రియాకలాపాలలో వ్రతశబ్దం శాస్త్రీయ నియమానుబంధంగావుంటుంది.

a) ఉపనయన సంస్కారాయ వ్రత బంధ ఇతి

b) "త్రిరాత్ర మావ్రతా దేశాత్" అని

యాజ్ఞవల్క్య స్మృతిలో వ్రత శబ్దం ఉపనయనార్థంలో ప్రయోగింపబడింది.

## వైదికవాఙ్మయంలో వ్రతశబ్దం

1. తవవ్రతే కవయో విద్మ నాపసః - ఋ. 1-31-1
2. కవిర్దేవానాం పరిభూషసి వ్రతమ్ - ఋ 1-31-2
3. అనువ్రతం వరుణోయంతి మిత్రః - ఋ 4-13-2
4. నక్తముప తిష్ఠతే న ప్రాతః సగ్ంహి నక్తం వ్రతాని సృజ్యంతే - తైత్తిరీయ సంహిత - 1-5-9-5
5. వ్రతమే కా రక్షతి దేవయూనామ్ - తై.సం. 1-3-11-3
6. అగ్నే వ్రత పతే వ్రతం చరిష్యామి తచ్ఛకేయం తన్మేరాధ్యతామ్ - వాజసనేయ సంహిత 1-5

7. వ్రతేన దీక్షా మాప్నోతి దీక్షయాऽऽప్నోతి దక్షిణామ్ - వా.సం. 19-30

8. సమానో మంత్రః సమితిః సమానీ సమానం వ్రతం సహచిత్త మేషామ్ -

అథర్వ వేదం 6-64-2

9. యస్యవ్రతం పశవోయంతి సర్వేయస్య వ్రత ఉపతిష్ఠంత ఆపః -

యస్యవ్రతే పృష్ఠపతిర్నివిష్టస్తం సరస్వన్త మవసే హవామహే -

ఆథర్వవేదం 7-41-1

ఇలా వందలకొలది తావుల్లో వైదికవాఙ్మయంలో వ్రతశబ్దం ప్రయోగింపబడింది. వ్రతాలన్నీ కాలాన్ని అనుసరించి ఉంటాయి. దానిలో తిథులకు సంబంధించిన వ్రతాలే అధికంగా ఉన్నాయి. సంహితా బ్రాహ్మణ రూపాలైన వేదాల్లో వ్రత శబ్దం చెప్పబడి యుండటం చేత వైదిక వ్రతాలనీ, తంత్రగ్రంథాల్లో చెప్పబడినవి తాంత్రిక వ్రతాలనీ, పురాణాల్లో చెప్పబడినవి పౌరాణిక వ్రతాలనీ చెప్పవలసి యుంటుంది. మనమీరోజు పాటిస్తున్న మతం పౌరాణిక మతం. కేదారేశ్వర వ్రతం కూడా స్కాందపురాణంలో చెప్పబడివుందని గుర్తించాలి.

ఉపోషణాది రూపం (ఉపవాసం) శాస్త్రీయ నియమపరిపాలన రూపమైన వ్రతాచరణం ఒక్క భారతీయుల్లోనే కాదు, జైన, బౌద్ధాది మతాల్లోను, మహమ్మదీయ మతాల్లోను ఉన్నాయి. జైనుల్లో సల్లేఖనమనే వ్రతం, మహమ్మదీయుల్లో రంజాన్ వ్రతం ఉపవాసంతో కూడుకొన్నదే. వ్రతానికి, చంద్రునికి సంబంధం ఎక్కువగా ఉందనే విషయం తిథి వ్రతాల ఆధిక్యంచేత మనం తప్పక గుర్తించవలసి యుంటుంది.

డా. పాండురంగ వామన్ కాణే రచించిన History of Dharma śastra (Vol. 5, Pt. 1 BORI, Poona, 1958, pp. 253-462)లో 1255 వ్రతాలు చెప్పబడ్డాయి. అందులో కేదారేశ్వర వ్రతం పేరులేదుగాని కేదార గౌరీ వ్రతమున్నది. ఇది కార్తీక అమావాస్య తిథిలో జరుపుతారని గౌరిని, శివుని ఈ వ్రతంలో కొలుస్తారని అహల్యా కామధేను అనే ధర్మశాస్త్ర

గ్రంథాన్ని బట్టి ఇది దాక్షిణాత్యుల్లో మిక్కిలి ప్రసిద్ధి వహించిందని పద్మ పురాణంలోని కథ చెప్పబడింది.

జగన్నాథ శాస్త్రి హోషింగ్ సంకలనం చేసిన వ్రతకోశం మొదటి భాగం (Benares, 1929) లో 1622 వ్రతాలు చెప్పబడ్డాయి. స్మృతి కౌముది (పుట. 65) ని బట్టి కేదారనాథ పూజ ఉపోషణాలు శ్రావణమాస సోమవారమని చెప్పబడివుంది. (పుట. 90)

కనుపర్తి మార్కండేయ శర్మ సంకలనం చేసిన వ్రతకోశం మొదటి భాగం (1931)లో 1695 వ్రతాలు చెప్పబడ్డాయి. వీరుకూడా శ్రావణ సోమవారం కేదారనాథ పూజా ఉపోషణాలు చేయాలని చెప్పారు.

## కేదారేశ్వర వ్రతం ఎప్పుడు చేయాలి?

స్కాందపురాణంలో అథాశ్వినమావాస్యాయాం కేదారేశ్వర వ్రతమ్ అని చెబుతూ 'మాసి భాద్రపదేऽష్టమ్యాం శుక్లపక్షే సమాహితః క్షౌమైః కార్పాస కైర్వాపి యథారుచి సుశోభనైః, హస్తే బద్ధ్వాప్రతిసరం హ్యేకవింశతి తంతుభిః, ఉపోష్య రజనీంతాం తు కృత్వా బ్రాహ్మణ భోజనమ్. తదారభ్య ప్రకర్తవ్య మమావాస్యావధిం వ్రతమ్, నిత్యం ప్రాతః సముత్థాయ కృత్వా పూజాం ప్రయత్నతః' - వ్రత చూడామణీ (వావిళ్ల, 1935 పుట. 281).

ఆరువ్రతాలు అనే గ్రంథంలో (1982) కేదారేశ్వర వ్రతం భాద్రపద శుక్లాష్టమియందు ప్రారంభించి నవమియందు ప్రత్తితో తయారుచేయబడిన ఏకవింశతి తంతువుల చేత ప్రతి సరమును ధరించి ఆదినమందు ఉపవాస ముండి మరునాడు బ్రాహ్మణ భోజనములు చేయించి, అది మొదలు అమా వాస్య వరకు ఈ వ్రతంచేస్తూ ప్రతిదినము కేదారేశ్వరుని ఆరాధింపవల యునని చెప్పబడింది.

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు వ్రత కథలు (1952) అనే ప కావ్యంలో కేదారేశ్వర వ్రతం (పుటలు. 58-72) శరదృతువులో చేసిన వ్రాశారు. ఈ వ్రతంలో తోరానికే అత్యధిక ప్రాధాన్యం అంటూ -

వ్రత మఖిలమ్మొక యెత్తీ
వ్రతపుం దోర మొక యెత్తు వ్రతమొనరుచు ధీ
యుతులట తెలిసికొనుట కో
క్షితిపా! నా సలిపినట్టి చెయిద మెఱుగుమా! (ప. 63)

వేటూరిప్రభాకరశాస్త్రి, వ్రాసిన పుణ్యవతి-భాగ్యవతి అనే కేదారేశ్వర వ్ర కథ (ఆనందవాహిని, సం. 1, సం. 7-10, 1930) సంసార పక్షంగా ప్రవర్తిల్లి కథ. అతిశయోక్తులు లేవు. పుణ్యవతి, భాగ్యవతి అనే అక్కాచెల్లెండ్ర బ్రాహ్మణ కన్యకలు. తండ్రితో అడవికి వచ్చి అక్కడ ఋషికన్యలు నో నోము చూచి వారి సహాయంతో తామునోచుకొన్నారు. మఱ్ఱిఆకులే తమ పాకులుగా, మఱ్ఱికాయలే పోక చెక్కలుగా, మఱ్ఱి ఊడలే తోరాలుగా చేసి నోము ఫలించింది. ఇదే కేదారోపాఖ్యానంలో సుబ్బకవి -

ఇసుక కేదారేశు బొసగంగ నొనరించి
నరిది భృంగుల సమున్నతి నొనర్చి
వటఫలంబులు పోక లటుల, తత్పర్ణము
లాకులుగా జేసి, యతిముదమున
వనలతల్ తోరము లొనరించి, వారిచే
బూజగావించెను పురహరుండు (1-125)

చెల్లెలైన భాగ్యవతి చేతికి కట్టుకొన్న తోరాన్ని ఆమె భర్త తెంపి ఎండిపోయిన కాకరపాదు పై వేయగా అది చిగురించింది. ఆతర్వాత వీరి ఇల్లు దొంగలు

పడి దోచుకొన్నారు. భిక్షాటనపాలైనారు తల్లీ కొడుకులు. ఒకరోజు అక్కగారి వద్దకు తన కుమారుని పంపుతుంది చెల్లెలు. ఇచ్చిన ధనంపోగొట్టుకుంటాడు కుమారుడు. చివరికి అక్కాచెల్లెళ్లు కలవడం, జరిగింది తెలుసుకొని ఆ పోయిన తోరం కాకరపాదునుండి వెదికి తెచ్చి పాలలో నేతిలో కడిగి పాలవెల్లిని గట్టి అఖండంగా నోము నోచగా పూర్వ వైభవం తిరిగి సంప్రాప్తించింది.

వేంకటసుబ్బకవి కేదారోపాఖ్యానంలో ఆశ్వయుజ మాసంబున కృష్ణపక్ష అమావాస్యయందును, కార్తీక సోమవారమునందును ప్రభాతంబున లేచి వ్రతం చేయవలెను (1-62) అని యున్నది. కావ్యాంతంలో కూడ కార్తీక సోమవారమే కామవేది మరల వ్రతము నోచినాడు (3-151). తత్పూర్వం ఆశ్వయుజ వరకృష్ణదర్శయందు విజయదేవుడు వ్రతాన్ని చేశాడు (3-144).

## ప్రస్తుత పరిష్కర్త నిర్ణయం

స్కాందపురాణం ప్రకారమైతే భాద్రపద శుక్లపక్ష అష్టమి (14-9-2002) శనివారమౌతుంది. కేదారేశ్వర వ్రతానికి సోమవారం శ్రేష్ఠ మైందిగా చెబుతారు. అష్టమి తిథితో ప్రారంభించి ఆశ్వయుజ శుక్లపక్షానికి ముందురోజైన అమావాస్యవరకు (6-10-2002) అనుకొంటే 23 రోజులౌ తుంది. ఇది సరియైన నిర్ణయం కాదు. పైగా అమావాస్యతో వ్రతోద్యాపనం చేయడం మంచిదికాదు. ఎందుకంటే తిథి వ్రతాలన్నీ చంద్రసంబంధంగా వుంటాయి. కాబట్టి అమావాస్యతో ప్రారంభమైనప్పటికీ పౌర్ణమితో అంతం కావాలి. అప్పుడే వ్రతానికి సంపూర్ణ ఫలం, శుభకాల సూచకం కూడా. అందువల్ల భాద్రపద శుక్లపక్ష అష్టమి (14-9-2002) నుండి భాద్రపద శుక్ల పక్ష పూర్ణిమ వరకు (21-9-2002) ఎనిమిది రోజులలో వ్రత పరిసమాప్తి చేయాలి అనడం ఒక విధంగా సముచితంగా ఉంటుంది.

రెండవ పద్ధతి ప్రకారం భాద్రపద కృష్ణపక్ష అమావాస్య (6-10-2002)తో ప్రారంభించి ఆశ్వయుజ శుక్లపూర్ణిమ (21-10-2002) వరకు 16 రోజుల్లో వ్రత పరిసమాప్తి చేయడం మరింత సముచితంగా ఉంటుంది.

మూడవ పద్ధతి ప్రకారం ఆశ్వయుజ కృష్ణపక్ష అమావాస్య (4-11-2002) అంటే దీపావళి అమావాస్య సోమవారం కేదారేశ్వర వ్రతం ప్రారంభించి కార్తీక శుక్ల పూర్ణిమ వరకు (19-11-2002) 16 రోజుల్లో వ్రతో ద్యాపనం చేయడం అత్యంత సముచితమైనదని నా నిర్ణయం, దీనినే కేదారోపాఖ్యాన కర్త క్రిష్టిపాటి వేంకటసుబ్బకవి నిర్దేశించాడు.

దీనికి ఉపబలకంగా, దీబగుంట వీరభద్ర చరిత్రలో సిరియమ్మ కేదారేశ్వర వ్రతం చేస్తుంది. ఆసందర్భంలో తాళపత్ర ప్రతుల్లో 'అంత శరదంతమున గార్తీకామావాస్య' యని ప్రయోగింపబడివుండగా కేదారవ్రతా నికి కార్తీక పూర్ణిమ ముఖ్యమని అమావాస్య అనే అపశబ్దాన్ని మార్చవలసి వచ్చిందని శ్రీమద్దులపల్లి వారు వ్రాశారు. దీనిచేత ఆశ్వయుజ కృష్ణపక్ష అమావాస్యతో మొదలుపెట్టి కార్తీకశుక్లపక్ష పూర్ణిమ వరకు కేదారేశ్వర వ్రతం చేయాలని నా నిర్ణయం. ఇప్పుడు మనము చేస్తూన్నట్లు అమావాస్య ఒకరోజు మాత్రం చేయడం సరియైన పద్ధతికాదు.

## కథావస్తువు - మార్పులు, చేర్పులు

స్కాందపురాణంలోని కేదారేశ్వర కథలో శివపార్వతుల మధ్యలో జరిగిన సంభాషణలో పార్వతి కోపించి తన శక్తిని శివునినుండి ఉపసంహ రించుకొని అడవులకు పోతుంది. అక్కడ ఉండలేక శివునిలో తిరిగి కలసి పోవాలని కోరుకుంటుంది. కాని సాధ్యపడలేదు, ఆసందర్భంలో మునులను ప్రార్థించగా వారు భాద్రపద శుక్లాష్టమి నుండి అమావాస్య వరకు

ఫలితంగా రాజు పిచ్చివాడై అడవులబట్టాడు. రెండుసార్లు ధనం పోవడానికి గల కారణాన్ని బ్రాహ్మణుల చేత జ్యోతిష్కులచేత పుణ్యవతి విచారింపజేసి కేదారేశ్వర వ్రతాన్ని చెల్లెలు కుమారుడైన విజయదేవునిచే చేయించి మరల ధనాన్ని యిచ్చి పంపినట్లు, దారిలో పోగొట్టుకొన్న ధనమంతా తిరిగి లభించినట్లు తీర్చాడు. కాంచీ నగరం నుండి భద్రగజం కామవేది మెడలో పూలదండ వేయడం, నారద మహర్షి వలన దూర్వాసాశ్రమంలో తన భార్యాబిడ్డలున్నారని తెలుసుకొని వారిని కలవడంతో కథ సుఖాంతమైనది.

## కవి జ్యోతిషశాస్త్ర పరిజ్ఞానం

నాడీనక్షత్రమాలవంటి జ్యోతిషశాస్త్రగ్రంథంలో వ్రాసిన క్రిష్టిపాటికవి యొక్క జ్యోతిష శాస్త్రపరిజ్ఞానం కేదారోపాఖ్యానంలో పలుచోట్ల కనబడుతుంది. అవతారిక ఎనిమిదవ పద్యంలో అష్టదిక్పాలక, నవగ్రహస్తుతిని కందపద్యంలో చేశాడు. సౌమ్యగ్రహంబులు .. (2-44) అని ప్రారంభమయ్యే సీసపద్యంలో పుణ్యవతీ వజ్రదంతుల వివాహమహోత్సవలగ్నం నిర్ణయింపబడినది. దానిని కవి యిలా చెప్పాడు. సౌమ్యగ్రహాలైన గురువు, శుక్రుడు, బుధుడు, చంద్రుడు-జలరాశులైన కర్కాటక, మకర, కుంభ, మీనాలలో గానీ ధనుస్సు ఎనిమిది, తొమ్మిది స్థానాల్లో వుండినా క్రూరగ్రహాలు ఆరు, మూడులో వుండినా సప్తమాధిపతి అనగా వివాహ స్థానాధిపతి ద్వితీయస్థానమున అంటే కుటుంబ స్థానమున వుండగా సర్వగ్రహములు స్వక్షేత్ర, మిత్రక్షేత్రాల్లో వుండి జామిత్ర శుద్ధికలిగి, శుక్రుడు ఆరవ స్థానంలో వుండగా, బుధుడు ఎనిమిదవ స్థానంలో వుండగా ఒక దివ్య శుభ లగ్నం వివాహానికి పెట్టడం జరిగింది.

అలాగే గురుడు బుధుండు.... (2-117) అనే పద్యంలో పుత్ర జననంలోని వైశిష్ట్యం యిలా చెప్పబడింది. గురువు, బుధుడు, శుక్రుడు, చంద్రుడు మొదలైన సౌమ్యగ్రహాలు 1, 4, 7, 10 కేంద్ర స్థానమందుండగా

శిశు జననం జరిగింది. పైవిధంగా గురు, శుక్ర, బుధ, చంద్రులు కేంద్ర కోణాల్లో వుంటే సరస్వతీ యోగముపట్టి గొప్ప కవి, గాయకుడు, సాహితీ సమరాంగణ చక్రవర్తి, ధనవంతుడు, కీర్తిమంతులవుతారని జ్యోతిషదీపిక తెలుపుతున్నది.[1]

దీన్నిబట్టి క్రిష్టిపాటి వేంకటసుబ్బకవి జ్యోతిషశాస్త్రంలోను, ముహూర్త నిర్ణయంలోను దిట్ట అని స్పష్టమౌతున్నది. ఈ కవి జ్యోతిష శాస్త్రమేగాక కామశాస్త్ర విషయాల్లో కూడా పరిజ్ఞానం కలవాడని తెలుస్తు న్నది. చౌశీతిబంధంబులు, అష్టాదశ చుంబనంబులు (2-11) అనే మాటలను బట్టి 84 విధములైన రతిబంధములు 18 విధములైన చుంబనములు వాత్స్యాయన కామసూత్రములను బట్టి మనకు తెలుస్తున్నాయి.

ఈకవి బహువిషయ పరిజ్ఞానానికి సూచకంగా ఈ క్రింది పద్యపాదం ఉదాహరణంగా చెప్పవచ్చు. ఉద్యాన గండకి నుదయించి తిలకించు భవ్య పాలగ్రామ పంక్తులనగ (2-89). హిమాలయ పర్వత ప్రాంతాల్లో గండకీ నది ప్రవహిస్తూ ఉంది. ఈనదీతీరంలోనే మనకు వివిధ పాలగ్రామాలు దొరుకుతాయి. ఈవిషయాన్ని పైపద్యపాదంలో కవి ఉద్యానవనంలోని వృక్షాలపై ఆరోపించి చెప్పడం గమనింపదగినది.

## విశేషచ్ఛందోనైపుణ్యం

ఉత్పల, చంపక, శార్దూల, మత్తేభములు, సీసము, ఆటవెలది, తేటగీతి వంటి సామాన్య ఛందములేగాక, ఈకవి గర్భకవిత్వంలోను నైపుణ్యం కల

1. జాతక చక్రమున మహాయోగములు - వి.యస్.యల్. నరసింహాచార్యులు జ్యోతిష దీపిక, జనవరి, 2002, పుట. 18. కేదారోపాఖ్యానంలోని జ్యోతిషసంబంధ విషయాలను నాకు వివరించి చెప్పిన సహోద్యోగులు శ్రీ వి. రాఘవేంద్రరావు, M.A. (I.C), M.A. (Astrology) గారికి నా కృతజ్ఞతలు.

వాడని విశేష చ్ఛందో పరిజ్ఞాతయని తెలుస్తున్నది. కాని, చిత్ర కవిత్వం జోలికి మాత్రం పోలేదు.

1. లయగ్రాహి 1-91, 2-67, 2-104
2. తరళము, 1-121
3. మత్తేభ, కంద గర్భ సీసం 1-128 (గర్భకవిత్వము)
4. పంచచామరము 1-164
5. రగడ 2-62
6. స్రగ్ధర 2-172
7. మాలినీ 2-192
8. దండకము 3-163

## కథాకథన శిల్ప రహస్యాలు

ఈకవి పౌరాణిక కథావస్తువును ప్రాబంధిక ధోరణిలో తీర్చిదిద్దినప్పటికీ కథాకథన శిల్పపాటవం గలవాడని అనేక సందర్భాలు నిరూపిస్తున్నాయి. కథాపరమార్థాన్ని పట్టియిచ్చే ఒకసందర్భం పరిశీలించబడుతుంది. భాగ్యవతీ, విజయదేవులు రాజ్య సంపదల్ని పోగొట్టుకొని దూర్వాస మహా ముని ఆశ్రమంలో కాలంగడుపుతున్నారు. ఆరు నెలలు గడిచాయి వీరు రాజ భోగాలు అనుభవించినవారు. పర్ణశాల జీవితం ఒకవైపు కష్టంగానే వుంది, కందమూలాలే ఆహారం, చప్పబడిపోయారు. ఆపరిస్థితిలో అక్క పుణ్యవతి జ్ఞాపకానికి వచ్చింది. ఉజ్జయినికి వెళ్ళాలనిపించింది. తల్లీ కొడుకులు ఈవిషయమై సంభాషించుకొంటారు. విజయదేవుడంటాడు -

జననీ! మునియనుమతమున
జనవలె బంధువ్రజములసదనంబునకున్
ఘనునకు తెలియమి గోపము
జనియించిన శాపమిచ్చు సత్యంబరయన్ (3-25)

మొదటనే రాజ్యసంపద కోల్పోయారు. ఇప్పుడు ఏపని చేసినా చెప్పి చేయాలి. చెప్పకుండా చేస్తే శాపగ్రస్తులై ఇంకా ఆధోగతికి పోతారనే ధ్వని ఈపద్యంలో యిమిడ్చినాడు. అందుకని దూర్వాసుని అనుమతి కోరినారు. అనుకున్నది సాధించినారు తండ్రిని కలిశారు. రాజ్యసుఖాదులు పొందారు. మునికి నమస్కరించి వెళ్లిపోతే సరిపోతుంది, కాని, కవి కథా రహస్యమంతా చివరి ఘట్టంలో తళతళలాడించాడు. అది యిలా ఉంది.

మునివర్య! నీదుయాజ్ఞన్
జని యుజ్జయినీపురమున సకల బంధువ్రజమున్
గనుగొంటి వ్రతముఁజేసితి
ధనమొగిలభియించె, నాదుతండ్రిన్ గంటిన్

భవత్కృపాకటాక్షంబులు మాయందు నిలుపుటంగాదె శత్రు మండలంబుల జండగతింజెండివైచి సకల మహీమండలంబుగెలిచి పురంబు జేరి మీ ఆశ్రమంబున మేమున్నయునికిఁదెలిసి సకల సైన్యసమేతుండై మజ్జనకుండు వచ్చియున్నవాడని తెలియంజెప్పి నిలుచున్నయెడ (3-136)

కేదారవ్రతంచేయడంవలన ఈశ్వరకృప కల్గడం అటుండనిచ్చి, అడవిలో యెప్పుడైతే దూర్వాసుని ఆశ్రమములో ఆశ్రయం లభించిందో అప్పుడే వారికి సకల శుభాలుచేకూరాయి. మునిజనుల కరుణాకటాక్షం అటువంటిది. ఇదంతా ఋష్యాశ్రమ సంస్కృతిని స్థాపించేవిధంగా కవి

వ్రాయడం ఇక్కడ కథాగతపరమరహస్యం. ఋషిముఖతః ధర్మం ప్ర
స్తుంది. పురాణములు వ్రాసిన వారందరూ ఋషులేకావడం యిక్కడ గ
నింపదగినది. ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోనుధావతి అనే
భూతి వాక్యానికి పైకథాఘట్టం ఒక వ్యాఖ్యానం. కామవేది దూర్వాస మ
మునికి కృతజ్ఞతలు తెలియజేసి ధనకలశము, వస్త్రభూషణాలివ్వాబో
ముని సున్నితంగా దానిని నిరాకరిస్తాడు. (3-148) ఋషులకు వస్తు వ్యామో
హములేదు. ధర్మానువర్తనమే వారికి ప్రధానము. ఇది కేదారోపాఖ్యా
కథా పరమార్థము.

## మాండలికములు

ఈ కవి రాయలసీమలోని కర్నూలుమండలనివాసి, కాబట్టి కర్నూ
జిల్లా మాండలికాలు కొన్నింటి ప్రయోగించాడు.

1. కూలబడంగ ద్రొబ్బి (2-151)
2. **వెడల ద్రొబ్బిరి నగరంబు వీరభటులు (3-49)**
3. **కాలము వెళ్లఁగఁ ద్రొబ్బుచుండు (3-99)**

ద్రొబ్బు అనే క్రియాపదానికి తోయడం, గెంటడం అని అర్థాలు.
సర్కారుజిల్లాలలోనైతే ద్రొబ్బు అనేమాటకు మోసముచేయడం అనిఅర్థం.
కడపమాండలికంలోను ద్రొబ్బుఅనేమాటను వాడుతారు.

పొసఁగ జనుదెంచిఁ **దోలుకపొమ్ము** లెమ్మా (3-30)

సామాన్యంగా పశువులను తోలుకొనిపోవడం రావడం మనకు తెలుస
చిత్తూరు, కడప ప్రాంతాలలో ఈ అర్థంలోనే వాడుతారు. మనుషులన
పిలుచుకునిరావడమనేది యిక్కడి వాడుక. కాని, కర్నూలుజిల్లా మాండలి

కంలో పశువులను, మనుషులను తోలుకుని రావడమనేదే వ్యవహారంలో కనబడుతుంది. మహత్, అమహద్వాచకాలకు ఒకే క్రియా పదాన్ని వాడడం యిక్కడ గమనింపదగినది.

సవిశిష్టోజ్జ్వల కార్పాస వితంతు గ్రంథియుక్తసత్తోరంబున్ (2-130) ఇది ఒక విశిష్టమైన రచనావిధానంగా చెప్పవచ్చు. కేదారవ్రతములో తోరమునకు అత్యధిక ప్రాధాన్యం వుందని చెప్పడానికి కవి తన పద్య రచనాశిల్పముచేత దానిని వ్యంజింపజేసినాడు. కార్పాసము అనగా ప్రత్తి లేక దూది. ఆది మానవుడు కనిపెట్టిన అద్భుత విషయాలు రెండు.1. అగ్ని 2. దూది. అగ్నితో ఆహారాన్ని పచనంచేసి ఎలా తినాలో తెలుసుకున్నాడు. ప్రత్తిని పండించి దానితో బట్టలు ఎలా నేయాలో తెలుసుకుని వస్త్రధారణ చేశాడు. కార్పాసము హరప్పా, మొహంజొదారో నాగరికత కంటే ప్రాచీన మైనది. (చూ.. Karpasa in pre-historic India-A chronological and Cultural Clue - K.D. Sethna, 1981)

ఇవేగాక మరికొన్ని విశిష్ట ప్రయోగాలు ఈ కవి చేసివున్నాడు. కూతాడ కుండ (అవతారిక ప 23), జాయాహీనుఁడు (1-106), సంపతిల్లు (2-74), హసాదు (3-155), ఏమారకన్ (3-163). పురుషుల్ యన్యాంగనేచ్ఛల్ గదా! (2-98) వంటి రమణీయమైన అర్థాంతరన్యాసాలంకారాలు కొన్ని ఉదాహరణాలు మాత్రమే!

## పద్యరచనాప్రౌఢిమ

ఈకవి సంస్కృత సమాసప్రౌఢిమలోను, తెలుగుపదాల పోహళింపు లోను అందెవేసినచేయి అనడానికి రెండు ఉదాహరణలతో ఈ పీఠికను ముగిస్తున్నాను.

మ. హరిదశ్వోజ్జ్వల తిగ్మదీధితి సమూహక్షుణ్ణనిర్భగ్న బం
ధుర గోత్రార్ధవిశాలరంధ్ర పరితంతుర్ణా గతాహీశ భా
స్వరశీర్షస్థ మణీఘృణీ నిచయ విభ్రాంతి ప్రదోద్యద్దివా
కరకాంతంబగు యాతపాగమము జాగ్రద్భావమై భాసిలెన్ (2-83)

సీ. పుత్రపౌత్రులుఁ గల్గి-పొలుపొందువారలే
వంధ్యలై దుఃఖించు-వారు లేరు
సకలాంగములుఁ గల్గి-సంతోషపడువారె
వడియంగ హీనులె-వ్వారు లేరు
బహుభోగభాగ్యముల్-బడసినవారలే
పటుదరిద్రకులు నె-వ్వారు లేరు
ధర్మమార్గంబుచేఁ-దనరెడి వారలే
భవమంది క్రూరులె-వ్వారు లేరు

గీ. జారచోరులు, వ్యాధుల-మీరువారు
లేరు, కపటంబుఁ గలవారు-లేరు, విప్ర
దూషకులు లేరు, నతఁడు సం-తోషమంద
రాజ్యమొనరించు వేళ ధ-ర్మాత్మజాత! (1- 161)

తిరుపతి

8.2.2002 - ముదివేడు ప్రభాకరరావు

# విషయసూచిక

కేదారోపాఖ్యానము

విషయసూచిక

కేదారోపాఖ్యానము

విషయసూచిక

కేదారోపాఖ్యానము



*****

# కృష్ణిపాటి వేంకటసుబ్బకవి

## విరచిత

# కేదారోపాఖ్యానము

### అవతారిక

### ఇష్టదేవతాస్తుతి

### శివస్తుతి

శా. శ్రీగౌరీశు కపోలదర్పణ నిజో-ష్ణీషానురాజచ్ఛిరో
భాగస్ఫారతరంగరంగదమృత-ప్రాగల్భ్యగంగాఝురిన్
బాగొప్పారఁగఁ జూచి చూపెఁ గద సా-పత్న్యకృథాహీనయై
వేగంబేయని సంతసించు హరుఁడె-వ్వేళన్ నను0 బ్రోవుతన్ 1

### శ్రీలక్ష్మీనారాయణ స్తుతి

సీ. క్రొక్కారు మెఱుపుచే-ముక్కారు పంటల
నవని ప్రజల బ్రోచు-నన్నదాత!
భరత, లక్ష్మణ, వాలి-భానుజ, యింద్రజ,
హనుమ,విభీషణుల-కభయదాత!
గాంగేయ, పాంచాలి-ఘనదర్శితంబైన
మోక్షంపుఁ ద్రోవల-ముక్తిదాత!
గోపికాశృంగార-ఘనరాసకేళిలో
నధ్యాత్మ రతి రహ-స్య ప్రదాత![1]

---

1. కేదారోపాఖ్యానము కాగితపుప్రతిలో ఈ సీసపద్యమందలి నాలుగుపాదాలు అన్వయరహితంగాను, దోషభూయిష్ఠంగాను ఉండడంచేత సంపాదకునిచే పూరింపబడినది.

గీ. వినుత లక్ష్మీసమేతుఁడై-వెలయునట్టి
యాదిపురుషుండు రమేశుఁడవ్యయుండు
లోకపాలుండుఁ గాన్పించు-నాకు నెపుడు
వేడ్కఁగనుమూసినప్పుడు-విచ్చినపుడు 2

## గరుడారూఢ విష్ణుమూర్తి స్తుతి

చం. తన మహిమన్ చరాచరముఁ-దప్పక సృష్టి నొనర్చు నేర్పు వా
డొనరఁగ[1] శుభ్రపక్షికుల-జోత్తము నెక్కి తిరుంగువాఁడు గీ
ర్వనరుహ లోచనాహృదయ-వారిజముబ్బఁగఁజేయువాఁడు నా
కనవరతంబుఁ గావ్యరచ-నాతిశయంబులు గల్గఁజేయుతన్ 3

## శ్యామలా స్తుతి

చం. అరుణతరాధరత్వము మ-హాసితకాంతి సమానవక్త్రమున్
దరుచుగ మంగళత్వము బు-ధస్తుతియున్ గురుకావ్యవందిత
స్ఫురణయు, మందయానమును-భూరిశశాంకవిహారికేతు దృ
క్తిరముగఁగల్గు శ్యామల ను- తించెదఁగావ్యరసాభివృద్ధికిన్ 4

## లక్ష్మీ స్తుతి

ఉ. క్షీరపయోధిరాడ్తనయ-చిత్రితకుండల నూత్నరత్న వి
స్తార ధగద్ధగద్ధగిత-సారితకాంతికపోలయుగ్మ ల
క్ష్మీరమణీమణీతిలక-చిత్తమునందతిప్రేమమీఱ న
న్నారయభోగభాగ్యసర-సాత్మకుఁగానొనరించుఁగావుతన్ 5

[1] వాఁడు + ఒనరఁగ = వాఁడొనరఁగ

## శారదాస్తుతి

కం. పారదకుంద సురద్రుమ
వారిజ హిమభూధరేంద్ర-వరమృగరాడ
బ్జారితులతాంగి[1] భాసుర
శారద నను దివ్యవాగ్వి-శారదుఁజేయున్ 6

## విఘ్నేశ్వరస్తుతి

శా. చంద్రాయత్త లసత్కిరీట-భుజగేశః ప్రస్ఫురద్ధార స
చ్చంద్రాధీశ్వరధీర హీర హిమవ-చ్చంద్రాబ్జకుందాహి రా
డింద్రేభా భవచందనామరమహో-ర్వీరుడ్విమోద్యద్యశ
స్సాంద్ర ప్రాభవ పార్వతీతనయుఁ- డిష్టాప్తిన్ ప్రసాదింపుతన్ 7

## వాయునందన స్తుతి

ఉ. ప్రమదాస్యంబు, విశాలవక్షము,మహా-బాహుద్వయంబున్ సువ
ర్ణమణీయుక్తకిరీటమున్ విమలనూ-త్నస్వర్ణయజ్ఞోపవీ
తము హారాయత[2] కంఠ ముజ్వలసిచం-డంబున్ లసన్మంజిఁగ
ల్గు మహాత్ముండు సమీరజుండెపుడు నా-కున్ గానుపించున్ దగన్ 8

---

అబ్జాసను లతాంగి--అని యుండవలెను. కాని, దీనిచే 'స' ప్రాసస్థానంలో వచ్చి ప్రాస
ంగమైనప్పటికీ అర్థవంతమైన పాఠం కనుక స్వీకరింపబడినది. అబ్జారితు లతాంగి-అనే
పపాఠాన్ని ఇంతకన్నా మార్చడానికి వీలులేక పోయింది.

హారాయితకంఠ-మనుట హనుమ విషయంలో మరింత ఔచితీవంతమేమో! తిక్కన
మయాజి హరిహరనాథ స్తుతిలో 'భద్రాయితమూర్తి' అన్నట్టుగా.

## అష్టదిక్పాలక-నవగ్రహ స్తుతి

కం. హరి పావక యమ నైఋతి
వరుణానిల ధనద భర్గ-వనజహితాబ్జా!
ధరసుత బుధ గురు రవి శని
వర రాహుధ్వజుల మదిని- వర్ణింతుఁదగన్[1]

## సుకవి స్తుతి

సీ. ఆదికవిత్వంబు-పాదేరు పఱచిన[2]
వాల్మీకి మౌనికి-వందనంబు
తన ముఖాంబుజముఁ-జూచిన వారు కవులెయై
యలరు భోజునకు నే-నతి వినయము
దర్శపూర్ణిమ యంచు-దర్శింపఁగాఁ జేయు
కాళిదాసుకు నమ-స్కారమరయ
నలచరిత్రము మహో-న్నతి జేయు శ్రీహర్షు
నకు సభక్తికవంద-నములు మిగుల
గీ. నిటుల గీర్వాణ సుకవుల-నెల్లఁ గొలిచి
ప్రేమ నన్నయ, తిక్కన-సోమయాజి
రమణ పోతన శ్రీనాథు-రంగనాథుఁ
డాది తెనుఁగు కవీంద్రుల-నభినుతింతు 1

1.హరి=ఇంద్రుడు, పావకుడు=అగ్ని, యముడు, నైఋతి, వరుణుడు=జలాధిదేవత, అనిలుడు=వాయువు, ధనదుడు=కుబేరుడు, భర్గుడు. ఈశానుడు-వీరు అష్టదిక్పాలకుల నవగ్రహములు-ధరసుతుడు=అంగారకుడు లేక కుజుడు, బుధుడు, గురువు=బృహస్ప రవి=సూర్యుడు, శని, రాహువు, ధ్వజుడు=కేతువు, శుక్రుడు, చంద్రుడు. పరిశేష న్యాయ ము చేత చివరి రెండు పేర్లు గ్రహింపబడినవి. గ్రహరాజు సూర్యుడు కనుక నవగ్రహాల క్రమము ఇలావుంటుంది. శ్లో. ఆదిత్యాయ సోమాయ అంగారక బుధాయచ
గురుశుక్ర శనిగ్రహశ్చ రాహవే కేతవేనమః

2. పాదు + ఏరుపఱచిన = పాదేరు పఱచిన

ఉ. శ్రీకర ముల్కినాటి కుల-సింధు లసత్పరిపూర్ణచంద్రుఁడ
స్తోకసమస్తశాస్త్ర పరి-శోధిత బంధురనైపుణుండు స
త్యాకరబుద్ధి దివ్యకవి-తామహుఁ డార్యనుతుండు రాజిలున్
బ్రాకటపుణ్యమూర్తి గుణ-భాసితుఁడోబులభట్టు దక్షతన్ 14

కం. అతని తనయుండనతి వి
ఖ్యాత యశస్సాంద్రుఁ డలఘు-కరుణామతి ని
త్యాతత శివపూజానిధి
యైదనరున్ శేషయాఖ్యుఁ-డార్యనుతుండై 15

కం. ఆ మహితాత్మునియందు మ
హామహుఁడగు పంక్తిరథుని-యందుదయంబౌ
రాముని కైవడి వెంక
ట్రామయ జనించె బంధు-రాజి నుతింపన్ 16

ఉ. ఆ పురుషోత్తముండు సక-లాగమశాస్త్రపురాణవైద్య వి
ద్యాపరిపూర్ణుఁడై నిఖిల-ధార్మికవృత్తు లెఱింగి మంత్ర శా
స్త్ర పటిమన్ జెలంగి బుధ-సన్నుత వైఖరిఁగాంచి సమ్య
గ్దీపితకీర్తిచే వెలసె-ధీరుఁడు మజ్జనకుండు రాజిలున్ 17

వ. అమ్మహనీయప్రభావుండు 18

కం. గరుడాద్రి వంశజలనిధి
పరిపూర్ణసుధాకరప్ర-భావిలసితుఁడై
ధర వన్నెకెక్కి రాజిలు
వరసాత్మకు బుచ్చిరామ-శాస్త్రికిఁ బ్రీతిన్ 19

కం. జనియించి శశికళాతతి
దినదినమును వృద్ధిఁబొందు-తెఱఁగునఁదానున్
దినదినముఁజెలఁగియొప్పెడి
ననుగుణముల కాటపట్టు-యగు సీతాంబన్ 20

చం. ఉపమయమయ్యె సంభ్రమమ-హోదధిఁదేలియు భూసురాళికి
న్నపరిమితాన్నదాన సర-సాదరణన్ విలసిల్ల బంధుమి
త్రపరిజనాళికిన్ ముదముఁ-దార్కొనుచుండగిరీంద్రకన్యకున్
విపుల సులగ్నమందు శివ-విష్ణుఁడుపెండిలియౌతెఱంగునన్ 21

కం. రామయ కపచిత సీతా
భామయొనర్చిన విధంబు-ప్రాపున వెంక
ట్రామయ కపచిత సీతా
భామ యొనర్చును మదంబ-పరమప్రీతిన్ 22

సీ. పతిసేవఁగల్గి తద్వివదిత-వక్షముఁద్రొక్క
మానిన లక్ష్మిస-మానమగును
భర్తకెప్పుడు శిరో-భారంబుఁబాపి స
పర్యఁ బూనిన గంగ-సాటియగును
కూతాడకుండ వా-క్కున నియమంబు
లొప్పిన గీర్భామ-యొప్పుసాటి
పరపురుషాకాంక్షఁ-బాసి తత్ప్రియుసేవ
దొరకొన్న యహల్య-తుల్యమగును

గీ. యనుచు నీరీతి జనములు-నభినుతింప
ధవునియందు నతిప్రీతిఁ-దనరుచుండు

గీ. వరకృపామృతదృష్టిచే-వచ్చి యెదుటఁ
గానుపించిన నత్యంత-కౌతుకమున
నిద్రమేల్కాంచి యమ్మహా-నిగమవేద్యుఁ
బొగడఁ దొడఁగితి నంజలి-పూర్వకముగ 27

కం. దేవాదిదేవ సుజన మ
హావైభవదాయకామ-రాధిప నత స
ద్భావజమదనాశన వృష
దేవేంద్ర తురంగ విమల! -దీపిత సుయశా! 28

వ. అని నానాప్రకారంబుల నద్దేవుని స్తుతియింప, నమ్మహానుభావుండు నాయందు దయాళుండై, యుష్మద్రచిత ప్రబంధంబు మదంకితంబు సేయుము. సకల విభవంబులు గల్గునని యంతర్హితుండయ్యె, నంత నేను నిద్ర మేల్కాంచి, యత్యంత కందళిత హృదయారవిందుండనై యమ్మహాదేవునకు నమస్కరించి, షష్ఠ్యంతంబులు వివరించెద 29

## షష్ఠ్యంతములు

కం. శారద ఘనశారద ఘన
సార సుసారస సమాన-చారుతనునకున్
భూరి ధరాకార శరా
సార విదారణున కమిత-సత్యాత్మునకున్ 30

కం. ఫాలాగ్ని జ్వాలాగత
కీలాల చరన్నిశాంత - కేతన గర్వా
భీలునకు నహికులేశ్వర
మాలావృత కంఠభాగ - మహితోన్నతికిన్ 31

కం. పురదానవ హరణాయత
ధరణీధ్రశరాసన వంది-తామర విద్వి
ద్వరణోజ్జ్వల సాయకునకు
కరిచర్మాంబరునకు నమిత-కారుణ్యునకున్ 32

కం. నిరుపమ గుణజాలునకున్
పరమ దయాళునకు భక్తపరి-పాలునకున్
సురరాజవంద్యునకు భా
సుర రాజకిరీటునకును-శుద్ధాత్మునకున్ 33

కం. అళికోరునేత్రునకు గో
కుల రాజవిరాజమాన - ఘోటకునకు ని.
స్తుల హిమగిరితనయా ముఖ
జలజ దివాకరున కమిత - జగదీశునకున్ 34

కం. గజదైత్యగర్వభేదికిఁ
గుజనాత్మవిదూరునకును-గోత్రేశునకున్
రజతాద్రి శిఖరవేదికి
నజవినుత పదద్వయునకు-నమలాంగునకున్ 35

వ. అంకితంబుగా నా యొనర్పంబూనిన కేదారోపాఖ్యానంబునకు కథా
క్రమం బెట్టిదనిన 36

*****

# ప్రథమాశ్వాసము

## కథా ప్రారంభము

ఉ. శ్రీకర ధర్మమార్గ పరి-శీలుఁడు భూసుర బృంద వందితా
స్తోకచరిత్రుఁడుజ్జ్వల య-శోన్నతుఁడార్త జనానుపాలన
ప్రాకటపుణ్యమూర్తిగుణ-భాసితుఁడాయమనందనుండు స
త్యాకర శీలుఁ గృష్ణుఁగని-యంచిత భక్తిగ నిట్లనెన్ దగన్ 37

ఉ. దేవ! మహానుభావ! గుణ-దీపిత! యే యితిహాసమింపుచేఁ
దా వినెనేని పాపములుఁ-దప్పకఁ దొల్గునొ దానిఁ జెప్పుమం
చా వసుధేశకుంజరుఁడు-సాదరభాషల విన్నవింపఁ గుం
తీవర నందనాగ్రజుని-ధీరతఁగన్గొని పల్కె వేడుకన్ 38

కం. భూపాలచంద్ర! కేదా
రోపాఖ్యానంబనఁగఁ బ-రగునుజ్జ్వల కథ
న్నింపార వినుము! యితర
వ్యాపారము మాని యధిక-వరబుద్ధి మెయిన్ 39

వ. యీ వ్రతరూపంబగు చరిత్రంబుఁగావించినన్, వినినన్, సకలపాప క్షయంబు, సకల సంపత్కరంబుఁగాన వినుమని యిట్లనియె 40

### కైలాస పర్వత వర్ణనము

శా. లీలోద్యాన లతాకుడుంగ విచర-ల్లేఖాసమూహంబు చి
త్రాలంకార[1] మణిద్యుతి ప్రతులితా-త్యంతార్కబింబంబు, ది
క్పాల ప్రస్ఫుట పట్టణోత్తమమునై-భాసిల్లి రాజిల్లు న
క్కైలాసంబు జగద్ధితంబుగ మహా-కల్యాణశైవాకృతిన్ 41

---

1. 'ముద్రాలంకార' అని కాగితపు ప్రతి పాఠం

మ. వెయి సంఖ్యంగల పాదజాలములచే-విశ్వంభరన్ మించి య
న్నియుఁ గల్గు సశరస్సమూహములచే-నెయ్యంబునన్ వ్యోమమం
తయుఁ బ్రాపించి విలోకనస్థలములం-దందన్ప్రవర్తిల్లుఁ జం
ద్రయినుల్ గల్గి రహించె రౌప్యగిరి ను-ద్యద్బ్రహ్మసామ్యంబొగిన్ 42

ఆ.వె. దంతపంక్తిచే ను-దాత్త రత్నవిచిత్ర
కటకములను మిగుల-ఘననితంబ
భారమునఁ దనర్చి-భామినీమణిలీల
నలరుచుండు రాజ-తాద్రి మిగుల 43

ఆ.వె. ఉగ్రకరుఁడు చంద్రుఁ-డుదయాస్తమయములఁ
బూర్వపశ్చిమములఁ-బొదలుచుండ
ఘనవిలంబమాన-ఘంటాన్వయంబున
నొప్పుగజములీల-నొప్పునగము 44

క. వితతోదగ్రవిశాలో
ర్జితశృంగంబులు వహించి-చెన్నొందెడి గో
స్థితిఁ బొంది శాంబరత
న్నతి వైభవలీల శంక-రాకృతిఁదోచున్ 45

కం. గిరిరజత గహ్వారంబులు
సరసత వికసత్సుమాక్షి-సహస్రతచే
నెరలు వహియింప నొప్పున్
పరగ సురాధీశ హస్తి-భల్లము పోలెన్ 46

కం. శశభృత్కిరణాహత భా
శశికాంతగళజ్జలాను-స్నానము చే, సూ
ర్యశిలాగ్ని మధ్యమంబున
వసియించిన మునులనంగ-వప్రములలరున్ 47

మ. లలిత స్కంధనిషణ్ణలీలగళలీ-లన్ పన్నగాశ్లిష్ట మూ
ర్తులచే నాట్యలతాభుజాగ్రములచే - రూపింపఁగాఁ బల్లవో
జ్జ్వలదుత్తుంగపటీకలాపములచే-సర్వేశ్వరాకారమున్
దళుకొత్త న్వహియించు వృక్షతతులం-దందన్ గిరీంద్రంబునన్ 48

చ. పరహిత రామలక్ష్మణ ప్ర-భావితమై బహుకాంతియుక్తమై
వర వనచారవర్గజన-వందితమై తగ వాయు సంభవ
స్ఫురితచలత్వమున్ గలిగి-భూధరదివ్యనదుల్ ప్రకాశమున్
నిరుపమ వల్మికోద్భవ వి-నిర్మల వాక్పటిమన్ చెలంగుతన్ 49

మ. తనయందున్ ప్రవహించు వాహినులు భ-ర్తన్ బొందఁగాఁబోవుచో
దనర న్నాత్మజభావమూని యవరో-ధత్వంబునన్ బొందెనో
యనఁ బక్షీంద్రరవంబుఁదోచె రసను-ద్యల్లీల నేపారు శం
భు నగేంద్రంబు జగద్ధితంబుగ మహా-భూభృల్లలామంబునన్ 50

వ. తత్ప్రదేశంబునందు 51

సీ. జయగిరీశ్వర! రమేశ్వర-మిత్ర! యని పల్కు
చిలుకలగుంపుచేఁ-గులుకునొకటి
'పాహిమాం వృషభేంద్ర-పాహి!' యంచు పఠించు
రమణీయ రాయంచ-రాజి యొకటి

'పరమేశ్వరాయ తుభ్యం నమో!' -యనిఁ దలంచు
మయూరతతి మేలు సొ-బగు యొకటి
'హర! మహేశ్వర! యుమేశ్వర!' -యంచు స్మరియించు
సొంపారు శారిక-గుంపు నొకటి

గీ. నిటుల సహస్రనామముల్ - యెనయ భక్తిఁ
గలిగి నన్ని కెలంకుల - ఖగకులంబు
నతి మృదూక్తుల నుడువును - నహరహంబు
హృదయకంజంబు వికసనా-స్పదముఁగాఁగ!

ఉ. ఆ నగరంబు స్వర్గమున-కంటె, వికుంఠముకంటె, సత్యలో
కానకు కంటె, భోగవతి - కంటెఁ, గుబేరపురంబుకంటె, వై
శ్వానరవాటికంటె, నతి - వైభవలీల విచిత్రగోపురా
నూనత తేజరిల్లు నతి-నూతన పట్టణరాజిమైతగన్

## శంకరుని కొలువు కూటవర్ణనము

వ. తత్పురంబునందు విచిత్రనీలమణి ప్రచయఖచితచిత్రభిత్త్యనంత శయ నాకృతి ననుసరించు దుగ్ధాంబోధిరాత్తనయ తనుద్యుతులన్ విడంబించ రంగారు బంగారు డోలంబుల నధిష్ఠించు గారుత్మతస్తంభ చతుర్ముఖ నిక్షిప్త స్ఫటిక పాంచాలికా కరతలకలిత శశికాంత కలశముఖ నిర్గళిత జలాభిషేచిత మహేశ్వర శిరోభాగ భాగాబ్జద్యుతి వ్యాజంబును, సకల త్రికాలవేది మునిగణ రాజిత వ్యాఘ్రచర్మాభిహిత నిజకర నివసద్బాల కురంగ పాధ్వస పరిహర్తృకేచ్ఛాపరతంత్ర మరకతమయ స్థలప్రదర్శిఁ రుద్రకన్యాభినిర్మిత శుకతుండహస్తోరగ గ్రసితాకాంక్షితాగత షణ్ముఖ తురంగంబును, తత్కేదార ప్రచలిత వైనాయకభూషణమణి ఫణిఫణాగ్ర

ప్రద్యోతిత మణిప్రచయంబుఁగని భీతిల్లు మూషకంబునకు సంతోషం
బొనరింప మోదకంబు చూపఁదుండంబుసాచిన హుంకృతనినదంబునం
గ్రమ్మగట్టురాయనిపట్టి యెకిరింతకు గంగాజలభ్రాంతి పుట్టించు నిర్మల
చంద్రకాంతజగతి స్థలంబును గలుగు నక్కొలువుకూటంబునందు నూత్న
రత్నానూన కాంచన సింహాసనంబునందు కందళిత సుందర మందస్మిత
వదనార విందుండై శంకరుండు కొలువుకూర్చుండె నయ్యవసరంబున 54

సీ. దక్షిణంబున బ్రహ్మ దామో-దరుఁడు నుత్త
రంబున నందీశ్వ-ర ప్రభృతులు
ముందటి పార్శ్వంబు-లందు లక్ష్మియు వా
ణి ఖచరులు దేవతా-నిచయములును
ద్వాదశాదిత్యు లేకా-దశరుద్రులు
గరుడగంధర్వ-కిన్నరులు భూత
భేతాళ యక్షర-క్షోతతుల్ కాళికా
ది త్రిశక్తులు వశి-ష్ఠాత్రిగౌత

గీ. మాది కౌండిన్య వాల్మీకి-హరిత జామ
దగ్ని నారద కుత్స త్రి-దండ పులహ
క్రతు పులస్త్యాష్టవసువులుఁ-గ్రమముఁగాఁగఁ
గొలుచుచుండఁగ విఘ్నేశ-గురుఁడు యొప్పె 55

వ. తత్సమయంబున 56

## శివుఁడు పార్వతికి కేదారేశ్వర వ్రతకథఁదెల్పుట

కం. ధరణీభృత్తనయ కరాం
బురుహంబులు మోడ్చి పర-మమోదంబున శం
కరు వృషభేశ్వర వాహుని
పరమేశ్వరు వినుతిఁ జేసిఁ- బరమప్రీతిన్ 57

చం. అరయ చరాచరంబులకు-నాదిమపూరుషమూర్తి వైన ని
న్నెఱిఁగి పఠింప శక్తులమె! -యీశ్వర! సర్వశుభప్రదంబునై
జరుగు వ్రతంబుఁ దేటపడ-సాంతముగా వివరింపుఁడన్న శం
కరుఁడు గిరీంద్రకన్యకనుఁ-గన్గొని పల్కె నుదంచిత క్రియన్ 58

కం. ఏ దారి లేనివారికిఁ
గేదారవ్రతము సేయఁ-గీర్తియు శుభముల్
మోదము భక్తియు ముక్తియు
నాదిగ సకలార్థఫలము-లందుదు రవనిన్ 59

వ. అని స్వమహత్త్వరూపకంబగు వ్రతంబుఁగల్పించిన శంకరు నాలోకించి
పార్వతీదేవి యిట్లనియె 60

ఉ. ఏ విధి, నేది మాసము, మ-రెన్నఁడు యే తిథి, యేమి వస్తువుల్
గావలె నెందుఁ జేయవలె-కారుణికోత్తమ విస్తరించి నా
భావము సంతసిల్లఁ దగఁ-బల్కు సుధారసతుల్యవాక్కులన్
దేవ! కుభృద్ధనుర్ధర! సు-ధీజనవందిత! పాదపంకజా! 61

సాలోపరిస్థిత చంద్రకాం-తాజ్యోత్స్న
కా ప్రేరితాభ్రాప-గా చకోర
పుర్ద్వార తోరణ - స్ఫురిత మౌక్తిక
సమ్మదభృత్ప్రభాభా-స్వద్విహంగ

తే. గీ. మనఁగఁ గనుపట్టు దివ్య-దేవాలయాగ్ర
ఘటిత మాణిక్యకుంభ వి-ఖ్యాతదీప్తి
రాత్రి భాస్కరబింబ వి-భ్రాంతచక్ర
సంఘమై బాల నగరరా-జంబు వెలయు 65

మ. కలితాబ్జోపల సౌధవీధి కనక-త్కాంతాకరన్యస్త ని
స్తుల వీణారవముల్ మృదంగరవముల్-శ్రోత్రస్థితిన్ బొంద స్వ
స్తిల దేవాంగన లభ్రవీధిఁ బరికిం-చన్ మోములత్తెత్తి యిం
తులు యేపట్ల ముగ్ధలౌ చూడుమను ను-క్తుల్వింద రక్కామినుల్ 66

మ. తన గంగాధర భావముజ్జ్వలశుచి-త్వంబేర్పడన్ జేతునం
చను తత్పట్టణరాజమందు వెలయున్-నార్యామనోనాథ స
ద్ఘన పద్మాంచిత గోపురంబు విలస-త్కంజాత విద్వజ్జనా
గణ కూటోద్ధృత భాసమాన సురలో-కహ్లాదినీ రాజమై 67

కం. వర తద్వర్ణముఁ దేటఁగ
నెఱిఁగింతు నటంచుఁ బురి-నహీశ్వర తల్ప
స్ఫురఁ దాఖండల మణిగో
పురమతి హరిపదముఁ గాంచి-పొందుగ వెలయున్ 68

### రథవర్ణనము

చక్రధరస్ఫూర్తి-సరవితో రాణించి
సద్గిరీశౌన్నత్య-సరణి మించి
వాజీంద్రగమన భా-వంబుచే దులకించి
రాజరాజాప్తిచే-రమణఁగాంచి
నక్రముఖాహిత - చక్రభేదన మెంచి
గోస్థితిచే వన్నెఁ-గులుకరించి
సతత ఘనాఘన-ద్యుతిచే విడంబించి
ఘంటాధరత్వంబు-కడువహించి

చండనోద్దండ రిపుకాండ-చండవిజిత
లాంఛనాంచిత కేతుక-లాపశిఖర
భాగములు రత్నసంఘవి-భ్రాజితములు
హరిహరాకృతులప్పురి-స్యందనములు 69

### అగడ్తల వర్ణనము

చంద్రధారణములు చాల-సాంద్రమగుచు
శృంగి సంచారలీలచేఁ-జెన్ను మిగిలి
సరసపారంగమోదిత-స్ఫురణఁ బెంచి
పురహరాకృతి గాంచు న-ప్పురి యగడ్త 70

### చాతుర్వర్ణములు

సకల వేదపురాణ-శాస్త్రముల్నేర్చుట
ద్విజవాహనత్వంబు-తేటఁ బడియోఁ
గువలయప్రియుఁడవై-గురుబుద్ధిఁ గల్గుట
దోషాకరస్ఫూర్తి-దొంగలించె

ధనదాఖ్యమిద్ధరా-స్థలి నొప్పు చెలికాడు
తిరిపమై యుండుట-తెల్లమయ్యెఁ
గ్రామపాలన రీతి-ఘనముగా నుండుట
పట్టణభేదన-పటిమ దెలిపె

గీ. ననుచు నీ రీతి హసియింతు-రవని సురులు
పార్థివులు, వైశ్య, శూద్రులు-పరమ భక్తిఁ
బుణ్య మిత్రత్వ దా-క్షిణ్యమున చతు
ర్ముఖాబ్జయక్షేశ నీరధ-రాధివరుల 71

నగరవాసుల వైభవము

సీ. ఎందుఁ జూచిన వార-సుందరీకర లస
ద్వీణామృదంగాది-విపులరవమె
ఏ దిక్కు దర్శింప-వేదశాస్త్రశ్రౌత
విద్యానువాద స-ద్విద్యరవమె
ఏ వంకఁ గాంచిన-దేవోత్సవోద్యోగ
కరములై యొప్పు-మంగళరవంబె
ఏ చక్కిఁ గనుఁగొన్న-నిభరథాశ్వపదాతి
ఘణఘణాత్కార-ఘీంకార నాద

గీ. మెచటఁ గనుఁగొన్న పల్లకు-లెక్కువారె
శారికాకీరచక్రాంగ-సకల బర్హి
సంఘభాషిత పదపద్య-చాతురీ వి
శేషమ్ము లెక్కడను చూడఁ-జెలఁగు పురిని 72

## హస్తివర్ణనము

చ. నగర మదేభకర్ణపుట-నవ్యగళన్మదసిక్తయుక్తిమ
ద్యగణిత కర్ణసంచలిత-మం దుదయించు సమీరధాటిచే
ఖగకులమెల్ల తీవ్రగతి-కంపితమై చనుచుండెనప్పుడున్
ఖగకులమెల్ల తీవ్రగతి-కంపితమంతయు మానెనుద్ధతిన్ 73

## అశ్వవర్ణనము

చ. ఒకగిరిఁ దాల్చువానిఁ దగ - నోపి భరించితినంచుగర్వమున్
వికసనఁ జెంద నీకు ఖగ-వీరకులోత్తమ! సర్వభూమి భృ
న్నికరము చేతయొప్పు నవ-నీభరమూనిన వానిదాల్చి మే
మొకరమె యంచుఁ గేరు పురి-నుజ్జ్వల ఘోటములా సుపర్ణునిన్ 74

కం. ఆ నగరు వజ్రదంత ధ
రానాథుండేలు భూధ-రద్వీడ్విభవా
నూనగతిన్ పరిపాండుర
మానిత కీర్త్యంగనా స-మంచితమూర్తిన్ 75

## వజ్రదంతుని ఆస్థానమునకు నారదుఁడేతెంచుట

వ. ఇట్లా సార్వభౌముండు సకలబంధు మిత్రాశ్రిత జనసచివ వర్గంబులుఁ పరివేష్టించి కొలువ, వందిజనగాయక వారకాంతానృత్యవిశేషంబులుఁ జెలంగ, సకలమహీపాల శిరఃకిరీట తటనివసద్రత్న సంఘర్షిత రజఃపటలంబు కొలువుకూటంబు సింగారింప, కాంచనరత్న సంఘటిత మేదురసభాస్థానంబున దివ్య సింహాసనంబున కొలువై కూర్చుండె, నట్టి సమయంబున నారదుండు సనుదెంచి, పురంబుసొచ్చి 76

కం. చనిచని పురవిభవములుఁ దా
గనుఁగొనుచు ముదంబు మెఱయ - కడువేగమునన్
జననాథుని మొగసాల క
డను నిలిచినఁ గనిరి యచ్చట - దౌవారికులున్ 77

కం. అమ్ముని రా కంతయు వా
రమ్మనుజాధీశ్వరునకు-నానతి యిడినన్
సమ్మోదంబున నారదు
సమ్ముఖమునకేగుదెంచి-సద్భక్తిమెయిన్ 78

## వజ్రదంతుఁడు నారదమహర్షిని సేవించుట

సీ. సాష్టాంగ మొనరించి-సభకుఁ దోడుకవచ్చి
మణిమయాసనమున-మౌని నునిచి
సౌవర్ణ కలశ భాస్వ-జ్జలంబుల పాద
పంకేరుహంబుల-భక్తిఁ గడిగి
తజ్జలంబుల వజ్రదం-తభూమీశుండు
శిరమున ధరియించి-కరయుగంబు
మొగిచి యిట్లని పల్కె, -'మునికులాబ్ధిశశాంక!
త్వద్దర్శనప్రాప్తిఁ-దనరు మాకుఁ

గీ. గలుఁగుటయె కాదె భోగ-భాగ్యప్రసిద్ధు
లగుచు సర్వంసహాచక్ర-మంతఁ బ్రోవుచు
మహిమ వర్ధిల్లి యుండుట-నిహమునందు'
ననుచు పాదంబు లొత్తుచు-నవనివిభుఁడు 79

ఉ. ఎచ్చట నుండి యెచ్చటికి-నేగెదరో, మునిబృందవంద్య! మీ
రిచ్చటి కేమి కార్యమున-నొప్పుగ వచ్చితిరో, సవిస్తరం
బిచ్చముగాఁగఁ దెల్పుఁ డన, -నవ్వసుధేశ్వరుఁ జూచి పల్కెఁ దా
జెచ్చెర నే వ్రతంబొకటి - చెప్పఁగవచ్చితి మానవేశ్వరా! 80

వ. అనుటయు 81

కం. ఎవ్వరిచే వినఁబడియెను
యెవ్వరు తద్వ్రతముఁ జేసి-రెవ్విధి దాని
న్నివ్వటిలఁ జెప్ప వేడుక
నువ్విళ్లూరంగ నాకు-నుజ్జ్వలచరితా! 82

వ. అనుచు నవ్వజ్రదంతమహీపాలుండు నక్కేదారవ్రతప్రభావంబును
దానిఁజేయు వారెవ్వరో తేటపడంజెప్పుమనిన నారదుండిట్లనియె 83

**నారదుఁడు వజ్రదంతమహారాజుకు కేదారేశ్వర వ్రతప్రభావము తెల్పుట**

చం. జనవర! యీవ్రతంబుఁ దగ-శంభుఁడుఁ జెప్ప గిరీంద్రకన్య తా
ననుపమలీలఁజేసె శుభ-దాస్పదమై విలసిల్లుటన్ మహా
మునులును యక్షసాధ్యసుర-ముఖ్యకుబేరులు సాంద్రభక్తిచేఁ
దనర రచించినార లిది-తప్పక నీవు నొనర్పు వేడుకన్ 84

ం. ఈ వ్రతంబె కదా-యింద్రుండు రచియించి
[1]పౌలోమితో స్వర్గ-పదవిఁ బొందె

1. పౌలోమి = ఇంద్రుని భార్య - శచీదేవి.

నీ మహత్తున కదా-యేచి తేజోవతి
పురియుఁ గైకొనె[1] నుషర్బుధుఁడు వేడ్క
నీ విభవంబె కా-[2]వైవస్వతుఁడుఁ బూని
సింహాళనగరంబు-చేకొనియెను
ఈ ప్రభావంబు-ననె కదా నైఋతి
[3]కృష్ణాంగనంబు న-ధ్ధతి వహించె

గీ. వరుణుఁ డొనరించి [4]శ్రద్ధాఖ్య-పట్టణంబుఁ
బొందె [5]యక్షేశ్వరుఁడు మేలుఁ -బొందె దీనిఁ
జేసి కాదె మహామునుల్-సిద్ధిఁ గల్గి
తపము లొనరించి బ్రహ్మ-త్వనిపుణులౌట! 85

ఉ. చంద్రుఁడుసూర్యుఁడున్నలుఁడు-చక్కఁగ [6]మారుతభుక్కు లేడ్హరి
శ్చంద్రులు సిద్ధసాధ్యగణ-చారణయక్షముఖుల్ సభక్తిచే
సాంద్రముఁగాఁగ నీ వ్రతము - సల్పియుఁ గాదె పురావనీస్థలుల్
చంద్రముఖీలలామలను-సన్నుతికెక్కఁగఁబొందఁ గల్గెడిన్ 86

---

1. వ్రాతప్రతిలోని "షర్బుధుడు" అనేది అపపాఠం కనుక "ఉషర్బుధుఁడు" అనే సుపాఠంతో సవరింపబడినది. ఉషర్బుధుఁడు = అగ్నిహోత్రుఁడు. ప్రాతఃకాలమున ప్రకాశించువాడు - వ్యుత్పత్తి. అష్టదిక్పాలకులలో నొకడు. ఆగ్నేయదిశాధిపతి ఇతని పట్టణము పేరు తేజోవతి.

2. వైవస్వతుఁడు = వివస్వంతుని కుమారుఁడు. చతుర్దశమనువులలో ఏడవవాఁడు. ఇప్పుడు నడుస్తున్న మన్వంతరం పేరు వైవస్వత మన్వంతరం.

3 'దాక్షాపురంబు'- ఇది అపపాఠం (wrong reading) నైఋతి దిక్కుకు అధిపతి నైఋతి ఇతని పట్టణం పేరు కృష్ణాంగన.

4. 'సిద్ధాఖ్య' - ఇది కూడా అపపాఠం. అష్టదిక్కులలో పడమటి దిక్కుకు అధిపతి వరుణుడు. ఇతని పట్టణం పేరు శ్రద్ధావతి.

5. యక్షేశ్వరుఁడు అనగా కుబేరుఁడు. ఉత్తర దిక్కుకు అధిపతి. ఇతని పట్టణం పేరు అలకానగరము.

6. మారుతభుక్కు లేదు - సప్తమరుత్తులు, ఆవహుడు, సంవహుడు, అతివహుడు, అనువాహుడు, పరివాహుడు, నివహుడు, వహుడు.

వ. అని యుపన్యసించి, యవ్వ్రతవిధానంబంతయుం జెప్పి సంయమి ప్రవరుండు సత్యలోకంబునకుం జనియె; నమ్మానవేశ్వరుండు తద్వ్రతంబు సేయ మోదంబు సందడింప పురజనంబులకుందెలియునట్లుఁ జాటింప నియోగించి పురంబుఁగైసేయ ననేకదాసీజనంబులంబంచి యప్పుడు 87

## వజ్రదంత మహీపాలుఁడు కేదారేశ్వర వ్రతము సేయ సమకట్టుట

సీ. వితత శిల్పాచార్య-విద్యాప్రవీణుల
రప్పించి వారితో-రాజుఁబలికె
మీర లీక్షణమున-నూరికిఁ బడమట
వటవృక్షమొక్కటి-యొనరఁగలదు
తత్ప్రదేశంబునఁ-దనర మంటపముఖ
వేదికాస్థలములు-వెలయునట్లుఁ
చలువచప్పరములు-చెలువంబుగాఁజేసి
రండనియాజ్ఞ తీ-వ్రముగ నొసఁగ

గీ. వారుశిరమున ధరియించి-వందనములుఁ
జేసి యత్యంత సంతోష-భాసమాను
లగుచు ప్రత్యగ్దిశాస్థలి-కరుగుదెంచి
యాయముఖలక్షణంబుల-నరసి చూచి 88

సీ. నవరత్నముల నొప్పు-నవగృహంబొక్కటి
వెలయునందలి-వజ్రవేదికయును
ముత్యాలతోరణం-బులుఁ గట్టి దివ్యమౌ
ళి ప్రాసనంబు-లు సుప్రసిద్ధి

నొనరించి గజరథాశ్వోష్ట్ర-శాలలుఁ జేసి
పానీయశాలలు-పటిమఁదీర్చి
పాకశాలలు మహాభవ్య-భోజనశాల
లలరించి యేటికి-నరయమెట్లుఁ

గీ. బెట్టి నిష్కంటకంబుగా-పృథివిఁ జేసి,
మార్గమున నీడ పొనరించి-మనుజనాథు
కట్టి శృంగారమంతయు-నరయఁ జెప్ప
వస్త్రమాల్యానుభూషణా-వళులొసంగె! 89

సీ. వితత భూధర సము-న్నత రథావళులపై
రాజనందనులు సం-భ్రమత రాగ
ఘంటాసహస్రముల్-కడునొప్పు మాతంగ
కోటిపై బంధులుఁ-గూడి కొలువ
గజ్జెలందెల చేత ఘలు-ఘల్లుమను తీవ్ర
తురగంబు లెక్కి భి-ల్దొరలు నడువఁ
జటుల పరాక్రమోద్భ-టులునౌ భటులు కో
టానుకోటులు చుట్టుఁ-బూని రాగ

గీ. ఛత్ర చామర బిరుదాంక-చయములొప్ప
దంబు మీరంగ వింజామ-రంబు లేయ
శక్ర వైభవలీల వ-జ్ఞనవిభుండు
భద్రగజమెక్కి వెడలె మ-న్నిద్రగతిని 90

లయగ్రాహి. అత్తరిని భూవిభుఁడు-చిత్తమున మోదము మ
రుత్తతులు గెల్చు సుర-సత్తముని లీలన్

మత్త విలసద్భట త-ళత్తళలచేఁ దనరు
కత్తుల మెఱుంగులు వి-యత్తలము నిండన్
నుత్తమ మహీసురు లు-దాత్త యనుదాత్తముల
మొత్తముగ వేదములు-గత్తుకొని చెప్పన్
చిత్తభవబాణములు-హత్తుకొని నేత్రముల
యొత్తుకొని వేశ్యలతి-వృత్తి నటియింపన్ 91

వ. ఇట్లమ్మహీపతి భేరీభాంకృతనాదంబు లజాండంబునిండ గాయక పాఠక వీణామృదంగ ఢక్కాకాహళతూర్యనాదంబులుఁజెలంగ నిఖిలభృత్యామాత్య సంఘంబులు నడువ, పార్థివాగ్రేసర కిరీటనివసద్రత్నప్రభలు గగనమండలంబు నిండ, పురంబువెడలి ప్రత్యగ్దిశాభిముఖుండై పోవుచు 92

మ. ఇటులన్ సర్వమహీపతుల్ సచివులు-న్నింపార విప్రుల్ మహో
ద్భట దంతావళముల్ తురంగరథముల్-భాసిల్లి తన్గొల్వఁద
ద్వటవృక్షంబునుఁ జూచి సంభ్రమముఁ దో-పన్ తద్గజేంద్రంబు వి
స్ఫుట వేగంబున డిగ్గి యచ్చట మహా-భూదేవతల్ గొల్వఁగాన్ 93

కం. చనివారుఁ దాను మందిర
మునఁ జప్పరములను పీఠ-ములుఁ గనుచున్
మనమున సంతోషంబులుఁ
బెనగొన నాశ్చర్య మైన-పృథుచిత్రముగాన్ 94

వ. ఇట్లు పురజనంబులు తమతమ యోగ్యస్థానంబులన్నిలిచి యుండునప్పుడు 95

సీ. స్నానంబు లొనరించి మా-నితాంబరములు
ధరియించి భూషణ-తతులుఁ దొడఁగి
గ్రైవేయమను మాలికలు-కంఠమునఁదాల్చి
కాంచనాసనములఁ-గ్రమముఁగాను
కూర్చుండి యత్యంత-కుతుకంబు మెఱయంగ
భూపాలచంద్రుండు-పొలుపుమీఱఁ
గనకకేదారేశ్వరుని-నిల్పి నందిభృం
గులనుంచి విప్రులఁ- గూడిమంత్ర

గీ. ములను ప్రాణప్రతిష్ఠాది-ముఖ్యమయ్యు
నలరు పంచామృతస్నా-నములు నొవర్చి
నవ్యయజ్ఞోపవీత ము-న్నతి నొసంగి
లలితగంధంబునిడి-యక్షతలఁ బెట్టి 96

ఉ. మల్లెలు మొల్లలున్ కుసుమ-మంజరులున్ విరజాజిపువ్వులున్
దెల్లని తుమ్మిపువ్వులును-దీపితబిల్వము మాచిపత్రియున్
ఫుల్లసరోజముల్ కనక-పుష్పములాదిగఁ బూజఁ జేసెఁ దా
నుల్లము పల్లవింప పురు-షోత్తముఁ డానృపుఁ డాదరాకృతిన్ 97

కం. ధూపంబిడి భక్తి మెయిన్
దీపంబు లొనర్చి విమల-దీపిత పరమా
న్నాపూప ఘృత నివేదన
మా పురుషోత్తము కొసంగె-నధికప్రీతిన్ 98

వ. అప్పుడు 99

## కేశవభూసురుని కుమార్తెలైన పుణ్యవతీ, భాగ్యవతుల వృత్తాంతము

కం. వాసిగఁ దత్పురిలో నొక
కేశవభూసురుండు గలఁడు-కేవల వృద్ధుం
డై శిరము వణంకుచు భి
క్షాశనము భుజించి పొంద-వాగ్రజఁ బెలుచన్ 100

కం. ఒనర నవ్విప్రవరునకుఁ
బనుపడఁ దగ పుణ్యవతియు-భాగ్యవతియునున్
తనయాద్వంద్వముఁ గలరొగి
ఘనసుందర మెంచ వశముఁ-గాదెవ్వరికిన్ 101

కం. పెట్టను సొమ్ములు లేకొగి
కట్టను వస్త్రములు లేవు-కడు వాకిటికిన్
నెట్టన లేదన్నము నే
వట్టున లేదాత్మభాగ్య-బంధువ్రజమున్ 102

చం. ప్రతిదినమొక్కరీతిగఁ బు-రంబున భిక్షముఁ దెచ్చినట్టి ధా
న్యతతిఁ గుమారికాయుగికి-నన్నముఁ జేసి భుజింపఁబెట్టి యా
క్షితి సురవర్యుఁ డర్థము భు-జించి దరిద్రము చేత వేగుచున్
మతిఁ గలగంగ తాను బతి-మాలి యబద్ధము నాడడెన్నఁడున్ 103

కం. శంకరు పదయుగిఁ దనహృ
త్పంకరుహమందు నిలిపి-భక్తి నియుక్తిన్
గొంకక నేమారఁడు ని
శ్శంకన్ నొకఘటికయైన్న-శమనతనూజా! 1C

గీ. వీథిఁ బడియున్న ధనధాన్య-వితతిఁ గొనఁడు
పరుల సంపత్తిఁ గనుఁగొన్న-మురియు మదినిఁ
దనదు దారిద్ర్యమునకు వే-దన వహింపఁ
బోడు యొకవేళనైన నా-భూమిసురుఁడు 105

కం. జాయాహీనుఁడుఁ గావునఁ
బాయఁడు నొకదినము నాత్మ-భవనము భిక్షం
బాయతముగఁ నీఁగొని తన తన
యాయుగ్మముఁ జేరవచ్చు-నలసి నిలు కడన్ 106

ఉ. ఎప్పుడు వచ్చునో మిగుల-నెప్పుడు నన్నముఁ జేసి పెట్టునో
యెప్పుడు నారగింతుమె మ-రెక్కడ వృద్ధుఁడు గాసిఁ జిక్కెనో
యెప్పుడు భిక్షధాన్యముల-నెవ్వరు పెట్టిరొ యంచుఁ దండ్రికై
చొప్పుగ పుత్రికాయుగముఁ-జూచుచు నుందురు నిత్యమాకటన్ 107

వ. ఆ దినమున తండ్రి యుదయంబునన్ లేచి, కాలోచితకృత్యంబులు నిర్వర్తించి, భిక్షాటంబునకుంజనియె; నచ్చట వజ్రదంత మహీపాలుండు వ్రతంబుఁ జేయంగోరి, సమస్తజనసమేతంబుగాఁ బురము వెడలిజనుచుండు సమయంబునఁ, బుణ్యవతీ భాగ్యవతీలలామలుఁబోవువారలం గనుంగొని 108

క. పురీజనము వ్రతము సేయన్
వరభూషణకోటిఁ దాల్చి-వైభవములచే
ధరణీనాథుని వెంబడి
వరమతులై పోవుచున్న-వారు నిజముగాన్ 109

## కేదారవ్రతము చేయుటకు తమకు శక్తిలేదని పుణ్యవతీ, భాగ్యవతులు దుఃఖించుట

వ. అనిమరియు 110

చ. జనకుఁడు లేడు, యీవ్రతముఁ-జక్కఁగఁ జేయఁగఁ గార్యవస్తువుల్
మన కొగి లేవు, యేమనుజ-మండలి వేడిన నీరు, వస్త్ర భూ
షణ గణమైనలేదు, మది-సంతసమంద ధరింప నెట్లకో
యని కనునీరు వేఁదొరుఁగ-నక్కయుఁజెల్లెలు నాత్మఁగుందుచున్ 111

వ. వారిరువురు చనిచని పురజనంబులు వ్రతంబుసేయు స్థలంబునకుఁ జేర
బోవుచో మార్గాయాసంబున కొంత విశ్రమించి లేచి తమ మనంబున 112

ఉ. పట్టణసీమఁ బాసి వట-పాదపమున్ గని దాని పొంతకున్
నెట్టనఁ బోయి చూడ నవ-నీపతి యేవ్రత మాచరింప నే
పట్టునఁ గాంచినన్ మనుజ-పంక్తులు దాని రచింపనింక మే
మెట్టులఁజేయ నేర్తుమని-యిద్దరు నచ్చట నిల్చి యాత్మలోన్ 113

ఉ. పౌరజనంబులెల్ల బహు-భాగ్యము లుల్లసిలన్ వ్రతంబు సం
పూర్ణతఁ జేసినారు, మన-పుణ్యము నిట్టులఁజేయఁగా విధిన్
దూఱఁగనేల చెల్లియల? -దోషజనాళికిఁ బుణ్యకార్యముల్
కోరిన వచ్చునే?"యనుచు-ఘోరవిషాదమునొంది యేడ్వఁగాన్ 114

## పార్వతీపరమేశ్వరులు వృద్ధబ్రాహ్మణ దంపతులై వచ్చి పుణ్యవతీ, భాగ్యవతులచే కేదారవ్రతము సేయించుట

సీ. కైలాసగిరియందుఁ-కేళికావనవీథిఁ
బార్వతీయుక్తుఁడై-భవుఁడు వారి

యార్తనాదము వీను-లందుసోకినఁ దానుఁ
గులకాంతఁ గనుఁగొని-పలికె నపుడు
నేనుఁ గల్పించితి-నీవు రచించితి
వీ వ్రతంబు సభక్తి-నెవ్వరేనిఁ
జేయువారికి నిష్ట-సిద్ధులుఁ జేకూరు
నంటి నది వ్యర్థ-మయ్యె నిపుడుఁ

గీ. దెలియ నుజ్జయినీపురి-దీనవృత్తిఁ
బుణ్యవతి భాగ్యవతులను-భూసురాబ్జ
లోచనలు దీని తీరు మది-లోన భక్తి
యొనర ఘటియింపు దారి-ద్య్రమును లేక 115

వ. ఉన్నవారు, వారి దుఃఖంబులు బాపి సకల విభవంబులు గలుగఁ
జేయవలయుననిన 116

మ. కరుణాసింధుఁడు శంకరుండు గిరిరా-ట్కన్యాసమేతంబుగా
ధరణీభాగము కేగుదెంచి విలస-ద్ధాత్రీసురాకారమున్
యిరవొప్పన్ ధరియించి వృద్ధగతిచే-వేగంబె భక్తావనో
త్కర వాంఛాగతిఁదెల్పఁ గేశవసుతా-ద్వంద్వంబు నీక్షింపుచున్ 117

కం. ఓ కమలేక్షణలార!
మీకీ దుఃఖమునుఁ జెంద-మేదిని లోనన్
యే కష్టుఁడు శ్రమఁ బెట్టెనొ
యా కష్టునిఁ దెలియఁ జెప్పు-మనిన న్వారల్ 118

వ. కరములు ముకుళించి మాకెవ్వరపకారము చేయలేదని చింతిల్లి
యిట్లని వక్కాణించిరి 119

కం. అష్టాదశఫణముల వా
రష్టైశ్వర్యానుకూలురై-వ్రతఫల ము
త్కృష్టగతి నొంది యొప్పిరి
కష్టపు దారిద్ర్యబాధ-గలిగెన్ మాకున్ 120

తరళము. అనుచు బలికిన వారిఁగన్గొని-యభవుఁ డాదర భక్తిచే
వనజలోచనలార! ఖేదము-వలదు మీ కిటుఁ బొందగా
ధనము లేదననేలఁ? గల్గినఁ-దనర భక్తికి సాటియే!
యెనయ నీ వ్రత మాచరింపుఁడు-యేము నిల్చెద మిచ్చటన్ 121

వ. అనిన వారు దుఃఖంబు మాని కరకమలంబులు ముకుళించి సాష్టాంగ
దండంబుఁ బెట్టి యిట్లనిరి 122

గీ. బాడబోత్తంస! మీరలుఁ- బల్కినట్లు
మేము వర్తిల్ల గలవార-మిద్ధచరిత!"
యనిన వారలఁ గన్గొని-వనజవైరి
మౌళి యిట్లని పల్కెః ప-ద్మాప్తపౌత్ర! 123

వ. మీరా ప్రవహించు నదికిఁ జని, స్నానంబుఁ జేసి జాగ్రత్తగా రండనిన
వారలట్టులఁ జేయ, నప్పుడు 124

**పుణ్యవతీ, భాగ్యవతులు కేదారేశ్వర వ్రతము చేసిన క్రమము**

సీ. ఇసుక కేదారేశుఁ- బొసగగంగ నొనరించి
నరిది భృంగుల సము-న్నతి నొనర్చి

వటఫలంబులు పోక-లటుల, తత్పర్ణము
లాకులుగాఁ జేసి-యతి ముదమున
వనలతల్ తోరము-లొనరించి వారిచేఁ
బూజఁ గావించెను-పురహరుండు
వారలిద్దఱు భక్తి-మీర కేదారేశు
నమ్మి సాష్టాంగదం-డంబుఁ బెట్టి

గీ. యభవుఁ డిచ్చిన ఫలముల-నపుడు దేవు
నకు నివేదనఁ గావించి-సుకరముగను
విమలతోరంబు లాత్మ హ-స్తములయందుఁ
గట్టుకొని వారిచే కథా-క్రమము వినిరి 125

ఉ. అంతట జీర్ణవస్త్రములు-దంచిత నూతన యంబరంబులై
కాంతి వహించి భూషణని-కాయముఁ గానఁగవచ్చె వచ్చినన్
సంతసమంది శర్వునకు-శాంభవికిన్ దగ వందనమ్ముల
త్యంతముఁ గాగఁ జేసిరి ప-దంబులు ఫాలముసోకునట్లుగాన్ 126

వ. అప్పుడు వారి భక్తితాత్పర్యములకు మెచ్చి స్వస్వరూపములు ధరియించి శాంతభావంబున సుధామాధురీభాషణంబుల వారి పరమానందంబుఁబొందించి, 'యీ వ్రతం బేకవింశతి హాయనంబులు పరమభక్తి శ్రద్ధలంజేయుఁడు, సకల భాగ్యంబులుగలుగు, పుత్రపౌత్రులను నిఖిల భోగంబులనుఁ గల్గి సుఖించెదరుగాక! యీ వ్రతంబు విఘ్నం బైన కాలంబున విపత్తు సంభవించు' నని పలికిన వారలు 'మీరెట్లుఁబలికిన నట్లు వర్తిల్లఁ గలవార' మని మ్రొక్కి యిట్లని వినుతించిరి 127

### పుణ్యవతీ, భాగ్యవతులు శివస్తుతి సేయుట
### మత్తేభకందగర్భసీసము

సీ. వితత కైలాస ని-వేశపాండుర లస
ద్గోత్రామరేడ్వం-దిరా పరాకు!
నిహత పంచాంబక-నీలకంధర లస
ద్వ్యాపార మేధా-మతే పరాకు!
నితత పద్మోదర-విశ్వరక్షణ మహా
నందీశ సద్వా-హనా పరాకు!
సుమతి హృత్పద్మ వి-శుద్ధ భాస్కరసుధా
మాధుర్య వాక్ప్రౌఢి-మా పరాకు! !
గీ. వరదశర హిమగిరి హర-శర భవశర
జాత భవ హయతనయ-శశధరకీర్తి
కరి నిశాటేంద్ర మదగిరి-సురభశర మ
హాత్మ శరధి సుశరధిక-హర పరాకు![1] 128

---

1. 128 సంఖ్యగల ఈ సీస పద్యంలో మత్తేభవిక్రీడితమనే వృత్తము ఎత్తుగీతిలో కంద పద్యము ఇలాగర్భితంగా వున్నాయి. సీస పద్యంలోని ప్రతిపాదంలో గల ప్రథమాక్షరాలను తొలగించి, ప్రతిపాదంలోని చివరగల 'పరాకు' అనే మూడక్షరాలనుతొలగిస్తే మత్తేభ విక్రీడితమవుతుంది.

మ. తత కైలాస నివేశ పాండుర లస-ద్గోత్రామరేడ్వందితా!
హత పంచాంబక నీలకంధర లస-ద్వ్యాపార మేధామతే!
తత పద్మోదర విశ్వరక్షణ మహా-నందీశ సద్వాహనా!
మతి హృత్పద్మ విశుద్ధ భాస్కర సుధా-మాధుర్య వాక్ప్రౌఢిమా!

ఎత్తుగీతిలో రెండవపాదంలోని చివరి అక్షరం దీర్ఘాంతంగాను, నాల్గవపాదం చివర గల 'పరాకు' అనే పదాన్ని తొలగించి, చివరి అక్షరం దీర్ఘాంతం చేస్తే కంద పద్యమవుతుంది.

క. వరద శర హిమగిరి హర
శరభవ, శరజాతభవ, హయతనయ-శశధర కీర్తీ!
కరి నిశాటేంద్ర మదగిరి
సురభ శర మహాత్మ! శరధి-సుశరధిక హరా!

ఉ. ఓ మహనీయులార! కరు-ణోజ్జ్వల దృష్టుల మీరుఁ జూడఁగా
మేము కృతార్థతన్ బడసి-మేదిని కీర్తి వహించి హెచ్చుగాఁ
గామిత భోగభాగ్యములుఁ- గాంచితి మంచుఁ బ్రదక్షిణంబుగాఁ
దాముఁ దిరింగి వారి పద-తామరసంబులు సోక మ్రొక్కినన్[1] 129

వ. అప్పుడు శంకరుండు వారల నాశీర్వదించి, 'శుభంబుఁ బొందుం' డని దివ్యకుసుమాక్షతలు శిరంబులందిడి, మరికొన్ని యక్షతలు వారల చేతి కిచ్చి మీ గృహంబుపయిన్ జల్లుండని చెప్పి, తిరోధానంబు నొందిన, తక్షణంబున భాగ్యవతీపుణ్యవతులు గృహంబునకుం జనుదెంచి యక్షతలు జల్లిన, నంతకు ముందే కాంచనమణిమయంబై యుండుట సంతోషంబు జెంది, గృహంబునన్ ప్రవేశించి జూచిన, సకల వస్తువిస్తార మంగళప్రశస్తంబయి యుండుటన్ జూచి, పులకాంకితశరీరులై తమతండ్రి రాక కెదురుచూచుచున్న సమయంబున, తమ తండ్రి భిక్షం బునకుంజని వచ్చి, గృహంబు కాంచనరత్నమయంబై బహు సుందరంబై యుండుటఁ గనుఁగొని యాత్మగతంబున 135

కేశవభూసురుఁడు కుమార్తెల యదృష్టమునకానందించుట

ఉ. నా గృహమెవ్వరో బలిమి-నిన్ గ్రహియించి విచిత్రవైఖరిన్
బాగుగఁ జేసికొంచుఁ బసి-బాలల వెళ్లగఁ బట్టి ద్రొబ్బఁగాఁ
నేగతిఁ జెందిరో నృపుఁడు-నించుకవల్దనఁడయ్యె నింక నె
ట్లేగఁగ వచ్చునంచు మది-యందుఁ దపించుచు మేలెఱుంగకన్ 136

1. ఉ. ఓ మహనీయమూర్తి! పురు-షోత్తమ! మీ కరుణార్ద్రదృష్టిచే
మేము కృతార్థతంబడసి-మేదిని కీర్తి వహించి సౌఖ్యముల్
కామిత భాగ్యచిహ్నములుఁ-గాంచితి మంచు ప్రదక్షిణంబుగాఁ
దాముఁ దిరింగి శంకరు ప-దద్వయికిన్ కడు మ్రొక్కి రిర్వురున్

129వ పద్యానికి పాఠాంతరముగ కవిగారే మరోకతీరుగా ఉత్పలమాలలోనే విడిగా ఒక పద్యం వ్రాసి చేర్చివున్నారు.

కం. అని మనమునఁ దలపోయుచుఁ
జని వాని నెఱుంగ వలయు-సభవారలకున్
వినయమునఁ దెలుపఁగా వలె
ఘను లన్నృతము నేల పలుకఁ-గా నేర్తురొకో! 132

వ. అని గృహంబు జొచ్చునెడ 133

ఉ. కాంచనరత్నభూషణ ని-కాయముఁ దాలిచి నూత్నవస్త్రముల్
మించ ధరించి నవ్వులెల-మిన్ మఖమండలి నిండుచుండఁ ద
త్ప్రాంచిత గేహముల్ వెడలి-తండ్రినిఁ గాంచి నమస్కరించి త
త్కాంచన పీఠి నిల్పి నతి-కౌతుక మొప్పఁగ నిట్లనెం దగన్ 134

చ. తెలుపుఁడు యీ మణీఖచిత-దీపితభూషణకోటి మేటి యౌ
వలువలు నే మహా సుగుణ-వంతుఁ డొసంగెనొ చిత్రవైఖరిన్
నిలయముఁ గానుపించు నిది-నిక్కము నామదిఁ జోద్యమయ్యెడున్
కలఁగను లీలఁ దోఁచె నిది-గ్రక్కునఁ బుత్రికలార!" వేడుకన్ 135

వ. అనినఁ దమ తండ్రిం గనుంగొని, యిప్పటభేదనంబునం గల పురజనం
బులు భూపాలసహితంబుగాఁ గేదారవ్రతంబు సేయ, మేముంజని,
తద్వ్రతంబు రచియింపన్ ద్రవ్యానుకూలంబు లేక మహాదుఃఖంబునుం
బొందియుండ,మాపుణ్యవశంబున నచ్చటికి శంకరుండు భార్యా
సహితుండై దుఃఖించుచున్న మమ్ముంగని, యాదరించి, ఆపుణ్య
పురుషుండు కేదార వ్రతంబు మా చేతంజేయించి, కరంబుల తోరంబులుఁ
గట్టినఁదక్షణంబ సకల భూషణంబులుం గనుపట్టె. జీర్ణవస్త్రంబులు
నూతన చీని చీనాంబరంబులై తోచె; నప్పుడుమామహేశ్వరులు
స్వస్వరూపంబులు ధరియించి, యాశీర్వదించి, యిరువదియొక్క

వత్సరంబులీ వ్రతంబుఁ గావింపుఁడని యానతిచ్చి, వారలంతర్ధానంబ
గుటయు, మేము గృహంబునకుంజనుదేర, తద్గృహంబు కాంచనమయంబై
తోచెనని చెప్పిన, తమతండ్రి పరమానందంబునుం బొందె. దుహితృ
సహితంబుగా భుజియించి, చీనిచీనాంబరంబులు ధరియించి, మణి మయ
భూషణం బులుఁ దొడిఁగి, గంధకస్తూరి పరిమళాద్యలంకృతులై పరమా
నందంబునసుఖంబుండిరంత 136

వజ్రదంత మహీపాలుడు పుణ్యవతీ, భాగ్యవతులజూచి మోహించుట

ఉ. అప్పుడు భూవిభుండు ముద-మొందుచు బంధుముఖాది వర్గముల్
తప్పకఁ దన్నుఁ గొల్వఁగ ను-దాత్తతఁ దత్పురిఁ జేరవచ్చుచో
నొప్పుగఁ గాంచె ముందర మ-హోజ్జ్వల రత్నమయంపు గేహమున్
కప్పుర గంధులున్ మదన-కాండ విభిన్నచలచ్ఛరీరుఁడై 137

చ. మనము వ్రతంబు సేయఁ జన-మంత్రికులోత్తమ!యీగృహంబు ము
న్నెనయ కుటీరమైఁ దనరె-నిప్పుడు చిత్రవిచిత్రవైఖరిన్
గనుపడు నేమి చోద్యమొకొ-గా కెవరైన మరింతలోన ని
ట్లనుపమ లీలఁ జేతురె సు-రాధిప శిల్పికినైన శక్యమే! 138

వ. అని మరియును 139

సీ. గరుడకామినులొకొ-గంధర్వకాంతలో
దేవతా భామలొ-తెలియదయ్యె!
పన్నగ లలనలో-కిన్నరస్త్రీలొకో
యక్షాంగనలొ-యిట్టి లక్షణములుఁ

గలుగునే మర్త్యుల-కలవియే యీ రూప
మీ చంద మీ యంద-మీ మితార
మీ చన్ను లీకన్ను-లీసన్ననడుములు
యీ పద్మనేత్రము-లీ ముఖములు

గీ. యనుచు వర్ణించి వర్ణించి-యతను బాణ
పరవశాయత్తచిత్తుఁ డై-పలికె మంత్రి
వరునిఁ గనుఁగొని 'నీ వేగి-వారిజాక్షు
లెవ్వరొ చూచి రమ్మన'-నేగె నతఁడు 140

వ. చని తద్వృత్తాంతంబంతయు నెఱింగి నమ్మహీపతికిఁ జెప్పందొడంగె 141

మంత్రి మహారాజుకు కేశవభూసురుని వృత్తాంతము దెల్పుట

చ. జనవర! కేశవాఖ్యుఁ డతి-సభ్యుఁడు, విప్రుఁడు యాచకాను వ
ర్తనమున నుండు నీ పురిని-తత్తనయల్ లలనాద్వయంబు వా
రనుపమ లీల నీ వ్రతము-సాంగముగా నొనరించు హేతువున్
ఘనతర భూషణాంబర ని-కాయముచే విలసిల్లి యొప్పెడిన్ 142

కం. మనుజేంద్ర! యమ్మహా మహి
మను నీ భవనంబు కనక-మయమై విలసి
ల్లెను వారుఁ బరమ నిష్ఠా
ఘనమతులై దాని సేయఁ-గా నిక్కముగాన్ 14

చ. అనవిని చిత్తమందు ముద-మొందుచు నా సచివాగ్రగణ్యునిన్
గనుఁగొని పల్కె నీవుఁ జని- గ్రక్కున నద్ద్విజవర్యు మద్గృహం

బునకును౯ దోడి దెమ్మనుచు-భూవిభు౯ డంత గృహంబు౯ జేరి తా
ననుపమ లీల నుండె సక-లార్యసుహృజ్జనబంధుయుక్తు౯డై 144

కం. ముదమున నాతఁడు విప్రుని
సదనమునకు నేగుదెంచి-సద్భక్తిగ౯ ద
త్పదములకు మ్రొక్కి యిట్లను
సదమల గుణజాల మహిత- సజ్జనలోలా! 145

## వజ్రదంత మహారాజు కేశవభొట్లను సభకు ఆహ్వానించి పుణ్యవతినిచ్చి వివాహముసేయుమని కోరుట

వ. అనిన నవ్విప్రునిం గొనియాడి నమస్కరించి, రాజాజ్ఞన్ చెప్పి దోడ్కొని, రాజమందిరంబు ప్రవేశించిన, నవ్వజ్రదంతమహీపాలుండు నబ్భూసురపుంగవుండైన కేశవభొట్లుం గనుంగొని, కనకమయపీఠిన్ గూర్చుండ నియోగించి, సాదర భాషణంబుల నిట్లనియె 146

చ. విలసిత భూషణవ్రజము-విత్తము మత్త లసద్గజంబు ల
న్నలఘు తురంగముల్ రథము-లంబరముల్ మదిమెచ్చ నిత్తు మీ
కొలసిన యట్ల భూసురకు-లోత్తమ! నీ పెదబిడ్డ నిమ్ము నే
వెలయ వివాహమయ్యెదను-వేడితి నాపయి ప్రేమమీఱఁగాన్ 147

వ. అనిన భూసురపుంగవుండు కొంత తడవాలోచించి యిట్లనియె 148

మ. జననాథాగ్రణి! నీవు నన్నడుగఁగా-సంతోషమున్ గాదె మా
కనువొందన్ మిముబోటి భూధవులు డా-యన్ జాల రామాత్రులై
ఘనతన్ మీరిన మేలు పుణ్యవతినిన్- గల్యాణమున్ గమ్మ నే
నెనయన్నిచ్చితి దివ్యలగ్నమున నీ-వింపొంద మోదంబునన్ 149

వ. అని పలికినఁబరమానందంబుఁబొంది, విప్రులవలన నొక్క దివ్యలగ్నంబు వివాహంబునకు శుభస్కరంబగుట నెఱింగి యనంతరంబ 150

పుణ్యవతీ, వజ్రదంతుల వివాహసన్నాహములు

చ. నగర మలంకరింప జన-నాథుఁడు మంత్రులఁ బిల్చి పల్కెనో
సుగుణవరేణ్యులార! పరి-చారకవర్గము చేత శీఘ్రతన్
యగణితవైఖరిన్ గృహము-లాదిగ వీథులనెల్ల నెల్లెడన్
సొగసుగఁ జేయుఁ డట్లనుచు-సువ్రతపాండునృపాత్మజాగ్రణీ! 151

వ. శిల్పకులుఁ జిత్రవిచిత్రవైఖరిన్ స్ఫటికశిలాసంఘాత జంభాసురభిన్మణి మిళితలలితకలధౌతకుడ్యంబును, చతుర్ముఖాంచిత కాంచనపాంచాలికా స్తంభంబును, సాంద్రచంద్రకాంతఖచిత కుట్టిమబును, వజ్రప్రముఖ మణి ఖంజితాట్టాలకంబును, మాణిక్యసోపాన వేదికాస్థలంబునగు కల్యాణ మంటపంబు రచియించిరి. పరిచారకులు పుష్పఫలభారాన్వితరంభా స్తంభంబులు నిల్పి, ముత్యాలతోరణంబులుం గట్టి, సాంకవ మృగమద ఘనసార మిళిత లలితకలపంబుల నలికి ముత్యాలముగ్గులిడి సకల గృహవింశతిద్వారంబుల రంభాస్తంభంబుల నిల్పి, పణ్యకల యందు ఘుమఘుమ వాసనావిశేషమార్గ సాంకవకలితజలంబులు నెల్లెడల కొల్లలుగాఁ జల్లి చలువచప్పరంబులుఁ గైసేసి, పానీయశాలలుఁ గావించి, నిఖిలవితర్దికల పచ్చికస్తూరి మస్తుగా నలికి, రంగవల్లికలుఁ దీర్చి, రాజ

సౌధంబుల నలంకరించి, సాంబ్రాణి ధూపవాసన లిడిన, ధూపధూమంబుఁ గర్తనంబునిండ, మేఘభ్రాంతిచేత గృహమయూరవర్గంబులుఁ బురివిచ్చి యాడం దొడంగె. తద్వ్యహిత గగనదర్శితనిశాంతరాజహంసంబులు భయాకులత్వంబున నంతఃపురంబునఁ జేరియుండె. నిశాసమయ చంద్రకాంత సోపానరోచిఃపటల విలోకితభీతిచేతం జక్రవాకంబులు దిశల కుఱుకం జొచ్చె. ఇట్లు గావించుయనంతరంబ సూర్యుండుఁ జరమదిశకుం జనియె. మరియు 152

చ. కలువలు సంతసిల్లె, జన-కాండము లుల్లసిల్లె, దిక్తటంబులున్
దెలివిని దాల్పఁగాఁ దొడఁగె, - కౌతుకమొప్పఁ జకోరవర్గముల్
వెలయఁగ చక్రవాకములు- వేడుకఁ గొందల మందఁ జంద్రుడిం
పలవడఁ బూర్వభూధ్రశిఖ-రాగ్రమునన్ విలసిల్లె నప్పుడున్ 153

వ. ఆ రాత్రి సమస్తజనంబులు సుఖనిద్రఁ గాంచిరప్పుడు 154

సీ. చక్రచక్రంబుల-శ్రమదీర కళలూరె
రాజీవరాజియు-రహి వహించె
నమర చకోరక- సమితి తల్లడమందె
భువనముల్ తేజఃప్ర-పూర్తిఁ జెందె
నిఖిలమౌ పక్షిగ-ణంబు లున్మదమందె
నీలోత్పలంబులు-నీటఁ గలిసె
జారచోరుల మాన-సంబులు భీతిల్లె
నిలిచె తమఃకాండ-నిచయమెల్ల

గీ. వెలయు మునివర్గములు నదీ-విపులసీమఁ
జేరి స్నానాదికృత్యముల్- జేసి నిష్ఠఁ

బూని నిలిచిరి నక్షత్ర-ములు నడంగె
భానుబింబంబు పూర్వాద్రి-పైనఁ దోచె 155

## పుణ్యవతీ, వజ్రదంతుల వివాహ కథనము

వ. తదనంతరంబ, సకల భూసురులు వజ్రదంతసార్వభౌమునకు స్నాతకంబుఁగావించిరి. అతండు మంగళస్నానంబుఁ జేసి, నూతన చీనిచీనాంబరంబులు ధరియించి, మహనీయ భూషణంబులుఁ దాల్చి నవరత్నఖచితంబైన కిరీటంబు శిరంబున ధరియించి, ముత్యాలహారంబులు కంఠంబునం దాల్చి మాణిక్యవిలసిత ముద్రాలంకృతుండై బంధుభృత్యామాత్యజనంబులు తోడ నడువఁ, దూర్యనాదంబుఁ జెలంగఁ, గల్యాణమంటపంబుఁ జేరె. మరియుఁ బుణ్యవతీలలామకు మంగళస్నానంబుఁ గావించి, మహనీయ వస్త్రంబుఁ గట్టి, కట్టాణి ముత్యంపు కుట్టురవికెఁ దొడిఁగి, గొప్పగా కొప్పుఁ బెట్టి, కనకరత్నమయభూషణతతులుఁ దొడిఁగి, సాంకవమృగమద ఘనసార కలితలలితగంధంబుఁ బూసి, నిఖిల కుసుమమాలికలుఁ జుట్టి, లగ్నంబునకుఁ దొడి తెచ్చి రప్పుడు 156

ఉ. ఆతఁడు దివ్యలగ్నమున-నా నలినాక్షినిఁ బెండ్లియయ్యె వి
ఖ్యాతిగ భూమివర్యులు మ-హాధ్యయనంబుఁ బఠింపుచుండ వే
శ్యాతరుణీగణంబుఁ బద-చాతురి నాట్యము సల్ప బంధుల
త్యాతత మోదమందఁగ న-జాండము భద్రరవంబు నిండఁగాన్ 157

సీ. బ్రాహ్మణ కోటికి- భవ్యవస్త్రంబులు
భూషణావళులు వి-స్ఫూర్తి నొసఁగె
సకల భృత్యామాత్య-సమితికి సంతోష
మునఁ బొంద మణిసంఘ-ముల నొసంగె

గాయక పాఠక-గాణిక్యకోటికి
నవ్యహారాళి యు-న్నతిగ నిచ్చె
కవికోటులకు శాస్త్ర-కారుల కత్యంత
ఛర్మయానంబులుఁ- బ్రౌఢి నొసఁగె

గీ. నితర జనములకెల్ల-నింపుసొంపుఁ
బెంపుఁ గల వంటకంబులుఁ- బెట్టి, వారు
సంతతానందమునుఁ బొంద-జనవిభుండు
శాశ్వతైశ్వర్యకీర్తి యి-జ్జగము నిండ 158

వజ్రదంతుని మహీపాలుని ధర్మరాజ్యము

ఉ. అంగల సత్సువర్ణత మ-హీధరరాజిత పద్మరాగతన్
తుంగపయోధరద్వయ సు-దుర్గత భూరినితంబచక్రతన్
రంగుగ రాజ్యలక్ష్మివలె-రాజిలు పుణ్యవతీలలామతో
మంగళలీల నా నృపుఁడు-మానితవైఖరి నేలు మేదినిన్ 159

సీ. ముసలివారలఁ గాక-మగశిశుకోటుల
సమయింపజాలఁడు-శమనుఁ డెలమి
నమరాధిపుఁడు పైరు-లరసి మానవకోటి
కోరినప్పుడు వానఁ-గురియఁ జేయు
త్రేతాగ్ను లవిశంబు-దీధితీవ్రజముచే
విప్రగేహంబుల-వెలయుచుండు
అలసి చెమ్మటఁ దోగ-నది యెల్ల మాన్పఁగా
వెలయ సమీరుండు-విసరుచుండు

గీ. జెఱువు లేరులు వంకలుఁ-జెలఁగి కూప
ములును సంపూర్ణ జలముచేఁ-దులకరించు
వజ్రదంతావనీపతి-వసుధనేలు
చుండ నతని ధర్మవి-స్ఫూర్తిఁ జేసి 160

సీ. పుత్రపౌత్రులుఁ గల్గి-పొలుపొందువారలే
వంధ్యలై దుఃఖించు-వారు లేరు
సకలాంగములుఁ గల్గి-సంతోషపడువారె
వడియంగ హీనులె-వ్వారు లేరు
బహుభోగభాగ్యముల్-బడసినవారలే
పటుదరిద్రకులు నె-వ్వారు లేరు
ధర్మమార్గంబుచేఁ-దనరెడి వారలే
భవమంది క్రూరులె-వ్వారు లేరు

గీ. జారచోరులు, వ్యాధుల-మీరువారు
లేరు, కపటంబుఁ గలవారు-లేరు, విప్ర
దూషకులు లేరు, నతఁడు సం-తోషమంద
రాజ్యమొనరించు వేళ ధ-ర్మాత్మజాత! 161

కం. అని కృష్ణుఁడెఱింగించిన
విని ధర్మతనూభవుండు-విష్ణుని కృ
ష్ణునిఁ గనుఁగొని తర్వాతి కథ
న్ననఘా! వినవలతుఁ దెలుపుఁడని-యడుగుటయున్ 162

## ఆశ్వాసాంత పద్యములు

ఉ. కామద విఘ్నరాజి జన-కామద విస్తృతకుంభిదైత్య భి
ద్యోమధరస్ఫురన్ మకుట-సోమధరేంద్ర శిలీముఖాసనా!
భీమసుపర్వశత్రుకుల-భీమసురోత్తమ పుత్రజైత్రకా!
తామరసారి వారిజని-తామర సామజకీర్తి శోభితా!! 1(

పంచచామరము : పన్నగేంద్రభూషణా! వి-పన్నగేంద్రవజ్రి కా
పన్నరక్షదేవవంద్య-పన్నలీ సపద్మకా!
సన్నుతాత్మ వార్ధిరాజ-సన్నిషంగ గోత్రజా
అన్నపూర్ణ సుస్మితా-నుచారు వక్త్రరాజితా! 1(

## గద్య

ఇది శ్రీమత్పంచవక్త్ర హనుమద్వరప్రసాదలబ్ధ
కవితావిచక్షణ క్రిష్టిపాటి వంశపయఃపారావార
రాకాసుధాకర కాశ్యపగోత్రవరపవిత్ర
వేంకట్రామార్యపుత్ర
వెంకయకవి ప్రణీతంబైన
కేదారోపాఖ్యానంబునందు
ప్రథమాశ్వాసము

*****

ఉ. బాహుబలంబు నన్సకల- పార్థివకోటులఁ బట్టి బెట్టుగా
నాహవమందుఁ గెల్వసక-లావనిఁ జేకొనిరాజ్యమేలె ను
ద్వాహము లేక తా తన య-వారితసుందరరూపరేఖకైయె
మోహనగాత్రిఁ దెచ్చినను- ముఖ్యముగాఁ గొనఁడయ్యె వేడుకన్ 6

సీ. తన్నియోజిత మంత్రి-తతులు వంగ కళింగ
బంగాళ నేపాళ- పాండ్య చోళ
మలయాళ కాశ్మీర- మగధ కేకయ విదే
హాది దేశంబులం- దరసి యరసి
తన రూపురేఖకై- తరుణీశిరోమణి
సరిగాక యున్న య-జ్ఞనవిభుండు
కడు మంత్రులను నరి-గాపుగాఁ బురినుంచి
కోటపై కావలి- కొంతమంది

గీ. మంచిరథ మత్తగజ ఘోట-కోత్తమాది
పరిజనంబులు చుట్టుఁ గా-పుదలకునిచి
కొంచెమగు బండ్లు గుఱ్ఱముల్- గొలుచుచుండఁ
దానునొక కొన్ని దినములు- ధరణిఁదిరిగె 7

ఉ. పల్లెలుఁ బట్టముల్ సకల-పార్థివకోటితనూజలందరిన్
తెల్లమిగాఁగఁ జూచి తన- దీటుకుఁ దోయరుహాక్షిఁ గానకన్
పల్లవ బాణబాణపరి-బాధితమానసుఁడయ్యెనమ్మహీ
వల్లభుఁ డొక్క దివ్యవన-వాటిఁ జరింపుచునుండునంతటన్ 8

## నారదుఁడు కామవేదికి ఉజ్జయినీపురములోని భాగ్యవతిని గూర్చి తెల్పుట

ఉ. నారదుఁ డేగుదెంచి జన-నాథకులోత్తమ యిందునుండఁగాఁ
గారణమేమి తెల్పుమనఁ-గారుణికోత్తమ! సుందరాంగికై
కోరి యనేకదేశముల-కున్ జనియందులఁగానలేక మా
యూరికిఁ బోవువాఁడనయి- యుండెదనిచ్చట మౌనిచంద్రమా! 9

చ. అనవిని నారదుండు వసు-ధాధిప! యుజ్జయినీపురంబునన్
వనరుహనేత్రి సుందర మ-వారితమై విలసిల్లు నిన్ను మిం
చినది మితారమందుఁజని- చేకొను తద్వనజాక్షినంచు నా
మునివరుఁడేగె మింటికి న-మోఘ హరిస్మరణానురాగుఁడై 10

శా. ఆ మాటల్ చెవి సోకినంత మహదా-నందంబునుం బొంది తాఁ
గామోదంచిత బాణపీడిత మనః-కంజాతుఁడై యిప్పుడీ
భూమిన్ గల్గిన రాజకోటులలో యే- భూమీశుఁ డేతెంచినన్
సామున్నైననుఁ జెల్మినైనఁ గడునే- సాధింతుఁ దత్కామినిన్ 11

కం. అని మనమునఁ బల్కియు న
జ్జననాథుఁడు సకలసైన్య-సందోహంబున్
తను చుట్టుముట్టి కొల్వఁగ
వనజాక్షినిఁ జూచు వేడ్క- వర్ధిలుచుండన్ 12

చ. జవమునఁ దత్పురంబునకుఁ-జయ్యన వచ్చి సమస్త వాహినీ
ధవుల వనాంతరంబులనుఁ-దప్పకనుంచియుఁ గన్యకామణీ
భవనముఁ జేరె భూవిభుఁడు- పౌరజనంబులచే నెఱింగి ధీ
ప్రవరులు కొంతమంది తను- భాసిలి కొల్వఁగ వేడ్కమీరఁగాన్ 13

వ. అప్పు డక్కేశవ భూసురుండు పరమసంతోషంబునన్ యా రాజేంద్రు
కనకాసనంబునఁ గూర్చుండ నియోగించి 14

ఉజ్జయినికి వచ్చిన కామవేదికి కేశవభూసురుఁడు అతిథిమర్యాదలు
చేయుట

సీ. కారణం బేమొకో- ఘనులు మా బోటుల
సదనంబునకు రాగ- జనవరేణ్య!
మా భాగ్యమేమని- మరి యెన్నఁగా వచ్చు
నే దేశవాసులో- యెఱుఁగనైతి
నని పల్కు విప్రునిఁ- గని తాను నిట్లనుఁ
గాంచీశ్వరుండను- కామవేది
యను నామధేయుండఁ- దనర గన్యార్థి నై
ధరణీతలంబెల్లఁ- దిరిగి తిరిగి

గీ. యెందునైనను మరి యొక్క- సుందరాంగిఁ
గానఁగా లేకయున్నచో- కమలభవుని
సుతుఁడుఁ జనుదెంచి యిచ్చటఁ- గోమలాంగిఁ
గలదటన్నను వచ్చితిఁ- గలుషదూర! 15

వ. ఇట్ల మ్మహీపాలుండుఁ దన వృత్తాంతంబంతయుఁ జెప్పుచుండ భాగ్య
వతీ లలామయు నతనిం గనుంగొని 16

ప్రథమ వీక్షణములోనేచక్షుఃప్రీతికిలోనైన భాగ్యవతీ కామవేదుల
మనఃస్థితి

సీ. ఈ మోహనాంగుండు- యే మానినీమణి
కబ్బునో కౌఁగిట- నదుముకొనఁగ

నీ సింహమధ్యుండు- యే సుందరికి మోవి
పానంబు సాయఁగాఁ- బట్టుపడునొ!
ఈ సుందరాస్యుండు- యే భాగ్యవతికి
మన్మథ సంగరంబున- మనునొ దినము
ఈ పద్మనేత్రుండు- యే పుణ్యశాలికి
కుచయుగంబునుఁ బట్టు- రచన యెగునొ!

యెంత సుకృతంబుఁ జేసిన- నింతులకును
గాంతుఁడై యుండునో గదా- ఘనుఁ డితండు
లేక నా బోటి దానికి- జోక పడునె!
కూర్చునే బ్రహ్మ ధాత్రిపైఁ- గుటిల ముడిగి 17

అని యీ రీతిగ మోహతాపమున నా- యబ్జాక్షి వీక్షించి తా
వనజాస్త్రాంబక బాధచేత నితర-వ్యాపారముల్ మాని యా
జననాథుండిట కేమి హేతువున యా-వన్మంత్రి వర్గంబుతోఁ
జనుదెంచెన్ తగఁ గన్యకార్థ మిటులన్- సంధిల్లునే నా యెడన్ 18

కన్యకార్థంబునై- ఘనుఁడు మా తండ్రిని
నరయంగ నిమ్మని- యడిగినట్లు
నడిగినంతనె దాను- యానందమునుఁ బొంది
యేర్పడ భూమీశు- కిచ్చినట్లు
నిచ్చినంతనె తాను- మెచ్చి వేడుక మీఱ
నీ క్షణంబునఁ బెండ్లి-యైనయట్లు
నైనమాత్రనె నన్ను- యావిభు కౌగిటఁ
జేర్చి సంతోషంబుఁ- జేయునట్లు

గీ. నన్ను కరుణార్ద్రదృష్టి ను-న్నతిగఁ జూచి
యటుల సంధించునే బ్రహ్మ- కుటిల ముడిగి
పరగఁ గావించెనేనియుఁ- బరమభక్తిఁ
బొలుపు మీఱంగ వేనోళ్లఁ- బొగడవచ్చు 19

వ. అని యనేకప్రకారంబుల నతని వయోరూపరేఖావిలాసంబులుఁ గాంచి,
పొంచి వర్ణింపుచున్న యవసరంబున, నన్నీరజగంధినిం గనుంగొని
యమ్మహీపాలుండు తన మనంబున నిట్లని వితర్కించె 20

సీ. పరికింప నిది స్వయం-ప్రభ దివ్యసత్ప్రభ
ప్రభ గాదు జలధరో-ద్భవుని మెఱుపు
మెఱుపుఁ గాదిది సూన-శరుని చొక్కపుఁ జిల్క
చిల్కగా దమృతంపు- చిన్నమొల్క
మొల్కఁ గాదిది ముద్దు- గుల్కు బంగరుబొమ్మ
బొమ్మఁ గాదిది రంభఁ- బోలు యింతి
ఇంతిగాదిది సము-ద్రాంత విద్రుమలత
లత గాదు వాసంత-లక్ష్మి గాని

గీ. యనుచు వర్ణించి తమిమించి- యూఘళించి
కాంచి యెదనుంచి తిలకించి- కళవళించి
పొంచి మోహించి మేనెల్ల- పులకరించి
కరము భూతలమున నాది- కామవేది 21

సీ. బంగారు బొమ్మయె- రంగుమీర నొనర్చి
మెచ్చుగా నమృతంపు- మెఱుగుఁ బెట్టి

పరిపూర్ణచంద్రు లో-పల నల్పు పోగొట్టి
ముద్దుగుల్కెడు నట్టి- ముఖముఁ బెట్టి
చక్రవాకులఁ బట్టి- చరణము ల్దెగఁ గొట్టి
కుచయుగంబు రచించి- కొమరుమించి
చిలుకలఁ గడునొంచి- పలుకులుఁ గావించి
కంబు హొయల్దీసి- గళముఁ జేసి

గీ. ఖంజనంబుల గ్రహియించి- కన్నులుంచి
జీవకళఁ బోసి మోహినీ-దేవి యనెడి
నామధేయంబునిడి దీని- నళినవిభుఁడు
సంచరింపంగ విడిచెనొ-జగతి యందు 22

సీ. కమలద్వయం బీడుఁ- గావచ్చు వాటికి
చుఱుకుచూపులు చాల- మెఱసియున్నఁ
జక్రవాకద్వయి- సాటియౌ ననవచ్చుఁ
జలనంబుమాని ని-శ్చలతనున్న
భృంగసంఘములుద్ది- బెట్టి మేలనవచ్చుఁ
బరువెత్తి గంపులుఁ- బాయకున్న
శంఖంబు సరిఁబోల్పఁ- జాలు నీటనుమున్గ
కెప్పుడుఁ బైటఁ దా- నొప్పి యున్న

గీ. వెలయఁ దమదమ వర్తనల్- విడిచెనేనిఁ
చూపులకుఁ జన్నుదోయికి- సొబగుకొప్పు
నకును సుందరకంఠంబు-నకును సాటి
చెప్పఁగా వచ్చు, లేకున్నఁ- జెప్పఁదగునె! 23

సీ. జలములలో మున్గి- స్వచ్ఛమౌటనె కదా
యడలి హంసంబులీ- నడక నేర్చె
వనములలో పల్ల-వంబులుఁ దిని గదా
పికంబు లీగతిఁ- బాడనేర్చెఁ
జక్కఁగాఁ బుష్పౌడుల్- మెక్కి తపించఁగా
సొరిది భృంగము లిట్లు- చూడనేర్చె
ఫలములుఁ దిని తపో-భావమూనఁగ గదా
చిలుకలు నీ రీతిఁ- బలుక నేర్చె

గీ. ననియు నొక్కొక్క రీతిని- ననుసరించె
నెంత తప మాచరించెనొ- యీ లతాంగి
యవయవంబులుఁ గనుగొంటి- ననుచుఁ బుష్ప
ధన్వ్వ శరపీడితాంగుఁడై- తమిని మునిఁగి 24

కన్యాంగ సౌందర్యకథనము

వ. మఱియు నబ్భూపాలుండు నవయవంబులు వర్ణింపం దొడంగె 25

చ. సరసిజపత్రనేత్రికి వి-శాలపయోఘనసూచకంబుఁగాఁ
బరువడి నాభివల్మికముఁ- బాసి కుచాద్రులుఁ జారఁ బోవు సు
స్థిరముగ నల్లనల్లనగు- చీమలబారనఁ జూడ నొప్పె న
బ్బురముగ రోమరాజి పరి-పూర్ణవినీల మణీగణప్రభన్ 26

మ. సరసీజేక్షణ గబ్బిగుబ్బగవతో- సామొద్దిహీనంబులై
ధరముల్ కాననమై హసించె కచమున్- దానాదినిన్ చెక్కిలిన్
పరగన్ మాని గళంబు హాస్యపరిచె- న్బల్మాఱు తద్వృంతమై
దిరిగేతెంచి తృణీకరించె నడుపున్- ధీరాహితంబొప్పునే! 27

చ. సరసిజపత్రనేత్రి ముఖ-సంపద కోడి కలంకఁ జెంది తా
నరయ కళావిహీనుఁడై యం-బర మధ్యగుఁ డయ్యెఁ గానిచో
నిరవుగఁ గప్పు నేల ధరి-యించెను వే బహుళాపహృద్ద్యుతిన్
బొరసె నదేల ఖేచరతఁ- బూనఁగ నేటికి రాజు కిమ్ముగాన్ 28

. మిగులఁ గృష్ణార్జునత్వంబు- యుగమునందుఁ
గాంచి కాబోలు మదగజ-గమన లోచ
నములు నటుఁగాకయుండిన- నమరునెల్ల
వారుఁ గర్ణాంతమనిఁ బల్క- వశమె వినఁగ 29

౨. వారిజనేత్రి పిరుందులు
వారణకుంభంబు లనఁగ- వలదందురె త
దూరువులు కరితుండంబులు
నారయ గమనంబు ద్విరదమ-ని తెలిసినచో 30

. సరసీజేక్షణ రథకం
దరముల సరియనఁగఁ బలుకఁ- దగియెడివో కుం
దరమా దరమా దరమా
తఱచుగ వర్ణింప మిమ్ము-ధాతకునైనన్ 31

కమలజుఁ గూర్చి యా సతి ము-ఖంబు తపంబొనరించె వేడుకన్
గమలజు భావ మొందఁ బతి- కక్షకు హంసగమత్వమూనఁ ద
ద్గమనమునన్ స్వయంభువతఁ- గైకొనెఁ జన్గవ హేమగర్భతన్
సమత వహించె నంగము ప్ర-శస్తముగా హరిసూతిమధ్యమున్ 32

ఉ. ఎప్పుడు కౌగిలింతుఁ దమి- నెప్పుడు తత్కుచయుగ్మమందుదున్
ఎప్పుడు మోవిమోవి నిక- నెప్పుడు నొక్కుదు మారుపోరిలో
నెప్పుడు జొక్కుదున్ కళల- నెప్పుడుఁ దేలుదు సారెసారెకున్
ఎప్పుడు యెప్పుడంచు మది-నెంచి తపించు రమించువేడుకన్ 33

వ. ఇట్లంతర్గతంబునం దలంచి మోహపరవశాయత్తచిత్తుండై యున్న
యవసరంబున 34

కామవేది విరహవేదనను చూచి ఆయన మంత్రి పెండ్లి రాయబారము
నడుపుట

ఉ. ఆతని మంత్రివర్యుఁడు క-రాంబుజముల్ ముకుళించి శీఘ్రతన్
పూతకులాగ్రగణ్యుఁడగు- భూసురమౌళికి వందనంబు
లత్యాయత లీలఁ జేసి స-రసానువచఃపరిపూర్ణయుక్తిచేఁ
ప్రీతి జనింపఁ గానుకలుఁ-బెట్టి యుదంచితలీల నిట్లనున్ 35

శా. ఈ భూమీశుఁడు భోగభాగ్యములచే- నింపొంద సర్వంసహా
భూభృత్కోటుల మించి శత్రుకులము- న్భీమీటి ముమ్మాటికిన్
లోభత్వంబణుమాత్రమైన మది నా-లోకింపక న్విప్రులన్
దా భావించి సువర్ణభూషణ మణీ-దానంబులిచ్చుందగన్ 36

చ. అరయఁగ నీతఁడీ హరి సు-తానుకృతిన్ వహియించు శౌర్యమం
దరయఁగ నీతఁడీ హరి సు-తానుకృతిన్ వహియించు రూపునం
దరయఁగ నీతఁడీ హరి సు-తానుకృతిన్ వహియించు గానమం
దరయఁగ నీతఁడీ హరి సు-తానుకృతిన్ వహియించు బుద్ధికిన్ 37

1. హరిసుతుఁడు - శౌర్యము; ఇంద్రుని కుమారుఁడు - అర్జునుఁడు
2. హరిసుతుఁడు - రూపు; విష్ణువు కుమారుఁడు - మన్మథుఁడు
3. హరిసుతుఁడు - గానము; వాయుపుత్రుఁడు - హనుమంతుఁడు
4. హరిసుతుఁడు - బుద్ధి; యముని కుమారుఁడు - ధర్మరాజు

సీ. దానంబుచే బలి-దర్పంబు వెడలించి
తగ రసాతలమునఁ- దాగఁ జేసె
శౌర్యంబుచే మహా- హర్యక్షము నదల్చి
దురుసుగా గుహలలో- దూఱఁ జేసె
కీర్తిచే నేణాంక-మూర్తి హాస్యమొనర్చి
తఱచుగాఁ దత్కళ- ల్దఱుగఁ జేసె
సొగసుచే కుసుమాస్త్రు- సుందరంబుఁ గలంచి
తలపడి వెస దగ్ధ-తనునిఁ జేసెఁ

గీ. గామవేదిని వర్ణింపఁ-గాఁ దరంబె
విప్రకులభూష! నీ పుత్రి- వేడ్క మీఱ
నిచ్చి వైవాహిక మొనర్పు- మిచ్చ మెచ్చి
ప్రాభవము మీఱ నత్యంత-వైభవమున 38

కం. ధనకనక భూషణాంబర
మణితతు లేమైన నీదు- మనమునఁ గో
రిన యంత నిత్తు మిపుడు
అనఘా! యటు వలసి యున్న- నడుగుము వేడ్కన్ 39

గీ. ఓలి మాకేల నిమ్మహీ-పాలునకునుఁ
బ్రేమ మీఱంగ భాగ్యవ-తీమృగాక్షి
నిచ్చితిని మంత్రికులవర్య!- యింపు మీఱఁ
బెండ్లిఁ గావింపవలయును- పృథులగతిని 40

వ. అనిన నా మంత్రిపుంగవుండు తిరిగి వచ్చి రాజునకు భూసుర వచనం
బులు విన్నవించిన తన మంత్రిం గనుంగొని యిట్లనియె 41

ఉ. పెత్తన మాచరించితివి- పెండ్లి నొనర్పుము నిన్నువంటి ధీ
రోత్తముఁ డుండఁగా మృగకు-లోత్తమ మధ్యమఁ గూడి వేడుకన్
చిత్తము పల్లవింప నిక- చెల్వగు టెల్లను చిత్రమా మహీం
ద్రోత్తములైన మాదృశుల-కుర్విని నీ పరిపూర్ణయుక్తికిన్ 42

కామవేది బ్రాహ్మణులను రావించి వివాహలగ్నమును
నిశ్చయింపుఁడనుట

వ. అని యతనిం గొనియాడి, యుజ్జయినింగల సకల జ్యోతిష్క విద్వజ్జ
నంబుల రప్పించి, కనకాసనంబులం గూర్చుండ నియోగించి, సాదర
భాషణంబుల నాదరించి యొక్క దివ్యలగ్నంబు నిశ్చయింపుండన, నా
భూసురపుంగవులు 43

సీ. సౌమ్యగ్రహంబులు- జలధిఁ బాణాష్టైక
నవమ సంఖ్యలను- నున్నతిగ నుండ
క్రూరగ్రహంబులు- నారింట మూడింట
వర్తిల్ల యేణాంక-మూర్తి రెంట
సర్వగ్రహంబులుఁ- జక్కఁగా గుణముద్ర
విలసితస్థలముల- వెలయుచుండ
జామిత్రమున గ్రహ-సందోహ మెడలించి
ఋతువున భార్గవు- రూఢిఁ బాపి

గీ. యొనిమిదింటను భౌముని- వనజవైరి
రిపు దినేందోష్టరాశుల- నపుడుఁ దఱిమి
దివ్యశుభలగ్న మొక్కటి- తేజరిల్లఁ
బెట్టి రవ్విప్రకోటులుఁ-బ్రీతి మెఱయ 44

కం. ఆ లగ్నము మరుసటి దిన
మాలస్యము లేక కుదిరె- ననుచవ్విప్రుల్
చాల వినుతింప భూపతి
మేలగు భూషణాంబరములు- మెచ్చఁగ నిచ్చెన్ 45

వ. అప్పు డక్కేశవ భూసురుండు 46

కేశవభూసురుఁడు వివాహసన్నాహములు చేయుట

సీ. తతనూత్నరత్న విస్తృ-త దివ్యకుడ్యంబు
శాతకుంభస్తంభ- సంభృతంబు
వరశుభ్రవిభ్రమ-వజ్రకుసూలంబు
నీలోపలాంచితా-ట్టాలకంబు
గారుత్మతస్ఫుర-త్తోరణోపేతంబు
అబ్జరాగవిత-ర్దికాస్పదంబు
చంద్రకాంతశిలావి-శాలసత్కాలంబు
రజతకవాటవి-రాజితంబు

గీ. మహిత మృగమదపంకిల- మండితంబు
లలితధూపప్రవాసనో-ల్లాసితంబు
దివ్యభవనంబు కామవే-దికిని డంబు
మీఱఁ గావించి నందుండఁ-జేరఁ బిలిచి 47

వ. ఇట్లు వారికి విడిదిండ్లు నియమించి, కల్యాణమంటపంబు రచియించి, గృహంబులు సింగారంబు గావించి, సకల బంధుగణంబులన్ రప్పించి, పుత్రీసహితంబుగా వజ్రదంతమహీపాల ప్రభృతి బంధుగణంబులను,

సకల విద్వజ్జనంబులను వైవాహిక్రియారచిత నిపుణులను రావించి,కేశవ భూసురుం డుదంచిత లీలన్ కామవేదిని లగ్నంబునకు రమ్మనినొక విప్రునిం బంచిన నతండు 48

కం. చని కామవేది గనుఁగొని
జననాయక! లగ్నమిపుడు- చనుదెంచెను మీ
రనుపమ లీలను రావలె
నన నతనికి భూషణాంబ-రావళులిచ్చెన్ 49

గీ. మంగళస్నాన మొనరించి- రంగు మీఱ
దివ్యమృగమద కర్పూర- నవ్యగంధ
మలదికొని రత్నభూషణా-వళులుఁ దొడఁగి
చీనిచీనాంబరంబులుఁ- బూనివెలసి 50

కం. కాంచన మణిగణరోచిః
ప్రాంచిత మాణిక్యశిఖర-భాగానూనో
దంచిత కోటీరము ధరి
యించెను శిరంబునను మోద-మింపొందన్ 51

ఉ. అప్పుడు సర్వమంత్రిగణ-శ్రితవర్గము బంధుకోటులన్
తప్పక భృత్యలోకములుఁ- దాల్చి రనేక దుకూలసంఘముల్
కప్పుర వాసనల్ జెలఁగు- గంధమలంది యనేకహారముల్
యొప్ప కిరీటముల్ దొడఁగి- రుజ్జ్వల మోదము లుప్పతిల్లఁగాన్52

వ. ఇట్లు మంగళరవంబులుఁ జెలంగ, ఢక్కాకాహళభేరీమృదంగ తాళవీణా వేణుధ్వానంబులు బోరుగొల్ప, గాయకపాఠకజనంబులు నభినందింప,

వేశ్యాగణంబులు శాస్త్రప్రసంగంబు లొనర్ప, చతుర్వేదంబులు పదక్రమ ఘనంబులు విప్రకోటులుచ్చరింప, సువాసినీగణంబులు సేసలు నింప, కామవేదిమహీపాలుండు కల్యాణమంటపంబుఁ జేరె, నయ్యవసరంబున 53

భాగ్యవతీ కామవేదుల వివాహమహోత్సవ వర్ణనము

గీ. వజ్రదంత మహీశుం డ-వార్యగతిని
రత్నకంబళ్లు పంపించి- రమ్యపీఠ
ములను వారలఁ గూర్చుండఁ- నిలిపి కాంచ
నాసనములను విప్రుల-నరయ నునిచి 54

గీ. పెండ్లికొడుకును నత్యంత- ప్రేమ మీఱ
రత్నమయపీఠమున నుంచి- రమ్యముగను
నితరజనముల నందంద- నింపుమీఱ
నిలిపి కేశవభూసురు- నెమ్మిఁబిలిచి 55

కం. నీ పుత్రికి నభ్యంజన
మేపార రచింపఁ బనుపు- మిపుడే యనినన్
దీపింపఁగ దాసీతతి
నా పణఁతి నలంకరింప- నంపెన్ బ్రీతిన్ 56

. అప్పు డబ్భాగ్యవతికి మంగళస్నానంబుఁ జేయించి 57

పొలతి కవ్వేళ జరీపేటు- పూలచీర
కట్టి కట్టాణిముత్యంపు- కుట్టురవికెఁ
దొడఁగి కర్పూరగంధంబు- మెడకుఁ బూసి
మొత్తముగ పాదముల పచ్చి-లత్తు కలఁది 58

సీ. నెఱి వెంట్రుకలు దువ్వి- నెరయ పాపటఁ దీర్చి
గొప్పగా మిక్కిలి- కొప్పుఁ బెట్టి
మల్లెలు మొల్లలు- మంచిమేల్ చేమంతి
పువ్వుల దండలు- పొసఁగఁ జుట్టి
రేకణ కేతకి- జోకతో సవరించి
వన్నె మీఱఁగఁ జంద్ర-వంకఁ గూర్చి
కాశ్మీరతిలకంబు- ఘటియించి కస్తూరి
జవ్వాజి కాటుకఁ- జుక్క నునిచి

గీ. చెక్కులను పొందుగా దృష్టి- చుక్కనిల్పి
రమ్య మణిహార కాంచన-రత్నఖచిత
ఘంటికా మేఖలాపాద- కటకభూష
ణాది శృంగార మలరించి- మోదమునను 59

వ. ఇట్లలంకృతయై భాగ్యవతీలలామ, యొక్క వేదండయాన కైదండ
గొనిరాగ, దండ నుండు రాజమండలంబు బెండువడి, కాండాస్త్ర ప్రచండ
కాండంబుల గుండియ ఝల్లుమన పుండరీకకాంతి మండలమునకు
బఱతెంచు బాలకురంగంబుఁ దెఱంగున సారసాకరంబు వెలువడి
చనుదెంచు వారిజాసను వారువంబు పగిది, తొలుకారు మంచు మించు
గుదియించు నుదంచిత లీలన్ మెల్లమెల్లన మొల్లంపుటందియల చప్పుళ్లు
ఘల్లుఘల్లుమని యుల్లసిల్ల కల్యాణ మంటపవేదికాస్థలంబున కరుగుదెంచి
కాంచన సమంచిత పీఠంబునం గూర్చుండె నప్పుడు 60

సీ. కమ్మవాసన గమ్ము- కస్తూరిగంధంబు
ముందుగా నామోద-మును ఘటింప

కుచయుగంబును ముఖ-రచన మధ్యము హొయల్
మదనాతురత్వంబు- బొదలఁ జేయ
కంకణనూపుర- ఘణఘణత్కారముల్
ముందుగా చెవులకు- విందు సేయఁ
బెళుకులు తళ్కులు- కుల్కులు మదినెంచి
నవ్వేడ్క కండ్లపం-డువులుఁ గాగఁ

గామవేది ధరానాథుఁ-డా మృగాక్షి
యవయవంబులు నఖకచ-మాది గాఁగఁ
జూచి తిలకించి మదినెంచి- చోద్యమంది
కమ్మవిల్కాడు పువ్వులఁ- గ్రుమ్మచుండ 61

ఉజ్జయినీ పురకాంతలు పెండ్లివేడుకలు చూడఁబోవుట

రగడ

గుఱుతు మీఱఁగ నగరకాంతలు- గుంపుగుంపులుఁ గూడుకొనుచును
సరసిజేక్షణులార! కేశవ- సభ్యపుత్రికి పెండ్లి నేడఁట!
కాంచినాథుఁడు కామవేదఁట! -ఘనుఁడు బహుశృంగారవంతుఁడు!
పంచబాణుని మించినాడఁట! -భాగ్యవతిసీ నతని కిచ్చిరి
నేడు లగ్నము చూడఁ బోదము! -నీటుగా మీరెల్ల రమ్మని
పోడిమిగఁ దగ వారికప్పుడుఁ- బొలుపు మీఱఁగఁ జెప్పుకొంచును
మల్లెలును చేమంతి పువ్వులు- మంచి గేదఁగి పొన్నలెల్లను
కొల్లలుగ సిగలొలయ నిడుకొని- కొమరు మిగులఁగ పునుగు గందము
మెడలఁ బూసుక కంకణంబులు- మేలిపొమ్ములు హారతతులును
తొడిగి కుంకుమబొట్టుఁ బెట్టుకఁ- దోయజేక్షణులెల్ల ముదమునఁ
బూలచీరలుఁ గట్టి బంగరు- పూలరవికెలుఁ దొడఁగి మోదముఁ

జాలవిలసిల పుత్రకుల తమ- చంకఁబెట్టుక తెలియముందట
అదుగో! మంగళరవము వినఁబడె! -నదుగో! విప్రుల మంత్రనాదము
అదుగో! హారతులుఁ బట్టుకొనుకొనుచును- నవనిసురసతులెల్లఁబోయిరి
అనుచు వచ్చుచునుండ, పాదము-లందు గజ్జెలు ఘల్లుఘల్లున
తనర నవిరళ రత్నకాంతులు- ధగధగద్ధగధగను మెఱయఁగ
చిలుక పలుకులు లీలఁ బలుకుచు- చెలువు మీఱఁగ భాగ్యవతికిని
నల మహీశున కిద్దరికిఁ దగు-నమ్మ దాంపత్యంబు జోడుగఁ
బాగఁ గూర్చెను బ్రహ్మ వీరికి- భాగ్యమంచునుఁ జూచుచుండిరి
సోగకన్నుల కఱువుఁ దీఱఁగ- మెచ్చి పెండ్లిలుఁ బ్రీతిఁ జేరఁగ 62

ఉ. అప్పుడు భూసురోత్తము లు-దంచిత మంత్రము లుచ్చరింపుచున్
తప్పక తత్వధానము ను-దాత్తగతిన్ రచియించి వేడుక
న్నిప్పుడు లగ్నమంచు మది-నెంచి సమంచిత నూతనాంబరం
బొప్పగఁ దాముఁ గూడుక మ-హోజ్జ్వలతన్ తెరగట్టి రయ్యెడన్ 63

గీ. జీలకర బెల్ల మప్పుడు- శిరమునందుఁ
బెట్ట నియమించి కరముల- గట్టిరంత
కంకణంబులు మిక్కిలి- పొంకముగను
భూసురోత్తము లత్యంత- మోదమలర 64

ఉ. మాటికి మాటికిన్ మిగుల- మంగళనాదము లుల్లసిల్లగా
వీటుగ వారకామినులు- నృత్యము సల్పి విలాసవైఖరిన్
పాటలుఁ బాడ గాయకులు- భాసుర సింహముఖంపువీణియల్
మీటురవంబు బల్దొరలు- మెచ్చి మహోజ్జ్వల వైభవాకృతిన్ 65

ఉ. రంగుగ కామవేది సుక-రంబుగ భూసురకోటి మెచ్చఁగా
మంగళలీల మంగళ మ-మంగళమంచు వచింపుచుండఁగా
బంగరు సొమ్ములుం గలు-గు భాగ్యవతీసరసీమహాక్షికిన్
మంగళసూత్ర మింపుఁ బొడ-మన్ గళసీమనుఁ గట్టె వేడుకన్ 66

లయగ్రాహి. మల్లెలును మొల్లలును- తెల్లనగు ముత్తెములు
యుల్లమున మోదములు- నుల్లసిలుచుండన్
మొల్లనగు నవ్వులతి- మొల్లమున మోముల ఘు
టిల్లఁగను కంకణములు- వ్రేళ్లఁ గడుమ్రోయన్
పల్లవ సమాజములు- పొల్లువడఁ జేయు కర
పల్లవపు టంజలుల- కొల్లలుగ సేసల్
జల్లఁగ వధూవరులు- చల్లుకొని రెల్ల జను
లెల్ల ముదమందఁగ మ-హోల్లసిత లీలన్ 67

వ. ఇట్లు సేసలుఁ జల్లుకొని 68

ఉ. భూసురకోటి కెల్ల నతి-మోదము మీఱఁగ భూవిభుండు భా
ర్యాసహితంబు మ్రొక్కి నవ-రత్నమయోజ్జ్వలభూషణావళుల్
వాసిగ నిచ్చి మంత్రిజన-వర్గము వేడుక లుబ్బుచుండగా
భాసురలీల నాదరము- బల్కి యొసంగె దుకూలసంపదల్ 69

చ. తనర ప్రధానహోమము య-థావిధిగా రచియించి వేడుకల్
మనమున నుబ్బుచుండ శ్రుతి-మంత్రములన్ ద్విజకోటిదీవెనల్
గొనకొని యిచ్చుచుండ నృప-కుంజరుఁ డప్పుడు మంత్రివర్గముల్
యొనరఁగ భృత్యకోటులును- నుజ్జ్వలతన్ తను నాశ్రయింపఁగా 70

సీ. గుళువరింగులు, మండి-గలు, ఖర్జకాయలు
పూరీలు, నిడ్డెనల్- పూర్ణకుడుము
లతిరసాల్ వడియము, -లప్పళంబులు పంచ
పరమాన్నములును, చా-పట్లు,లడ్లు,
చిత్రాన్నములు చాల- చెలువొందు వంటకాల్
హోళిగల్, చారులు, -పప్పుపులుసు,
లమితమౌ కూరలు- నలరు దధ్యన్నముల్
భూరిరుచుల్ మించు- నూరుబిండ్లు

గీ పెండ్లికూతురుతోఁ గూడ- పెండ్లికొడుకు
మహిత భూసురకోటులు- మంత్రివరులు
నాప్తులును బంధువర్గము- లారగించి
రప్పుడు నుత్సాహములు చాల- నతిశయిల్ల 71

కం. ఇతర జనంబుల కెల్ల
నతి మధురాన్నములు- నతిరసములచే
వితతముగ తృప్తిఁ జేసెను
పతి నణుమాత్రంబు- లోభభావములేకన్ 72

కం. వైణిక భట వారస్త్రీ
వైణిక నర్తకులకెల్ల- వరభూషణముల్
మానిత దుకూల కోటులు
క్షోణీశ్వరుఁ డొసఁగె వేడ్క- శోభన వేళన్ 73

## వివాహానంతరము భాగ్యవతీ భర్తతో కాంచీపురమునకుఁ బోవుట

వ. ఇట్లు పెండ్లి సంపతిల్లు[1] ననంతరంబ, కామవేది మహీపాలుండు కేశవ భూసురునకు నమస్కారంబుఁ జేసి, యనుజ్ఞాతుండై తన భార్యయగు భాగ్యవతీలలామ తోడ నొక్క మహనీయ స్యందనంబునం గూర్చుండి, సకల మంత్రివరులు పరివేష్టించి కొలువ, నిఖిలవాహినీ పరివృతుండై, వజ్రదంత మహీపాల ప్రభృతి రాజలోకంబులు రథంబులెక్కి తోడ నడువ, మంగళనాదంబులుఁ జెలంగ, వేదధ్వానంబులు విలసిల్ల, వేత్రపాణుల సాహోనాదంబులుఁ గనుపట్ట, వందిమాగధులు జయజయ శబ్దంబుల నభినందింప, నుజ్జయినీపురంబు వెడలి, కాంచీపట్టణ మార్గంబుఁబట్టి నిష్ఠా గోష్ఠిన్ సరస సల్లాపంబులు పలుకుచు, మందగమనంబునన్ చనిచని 74

1. సంపతిల్లు = ముగియు, పూర్తియగు. అని అర్థాలు. ఈ క్రియాపదం తెలుగుకు క్రొత్తది. కాని, ఇది దేశీయ శబ్దము. గిండి, గాణవంటి దేశ్య శబ్దములు తెలుగులో యెట్లున్నవో అట్లే మరాఠీ భాషలోని దేశ్య శబ్దము తెలుగులో ప్రయోగించినాడు ఈకవి. మరాఠీలో సంపణ అనగా పూర్తియగుట అని అర్థము. కామ్ సంపలకాయ్ అనగా పని పూర్తియైనదా అని వ్యవహారము. సంస్కృతములోని సమాప్తి అని అర్థమిచ్చే సమాపనమ్ అనే శబ్దమే సంపణగా మారియుంటుందని ఊహించవచ్చు. సంస్కృత ములో ఉన్నట్లుగా సమ్ అనే ఉపసర్గ ఈ దేశీ శబ్దములో లేదు. సంపణర్ఝాల=సొంతం నేరవేరినది. పూర్తిగాయైనది, వంటి ప్రయోగాల విషయంలో చూస్తే తద్భవంకాదని తెలుస్తుంది. ఈ సంపణ అనే క్రియా పదాన్ని మరాఠీ నుండి గ్రహించి ప్రస్తుత ప్రబంధ కవి తెలుగులో సంపతిల్లు అనే క్రియాపదాన్ని రూపొందించాడు. కవి సంపతి అనే రూపాన్ని గ్రహించినట్లున్నది. దీనిపై 'ఇల్లు' అనే ఇకారపూర్వక ద్విరుక్త లకారము చేర్చి సంపతిల్లు అనే క్రియారూపాన్ని కవి సాధించినాడు. ఇది బాల వ్యాకరణము, క్రియాపరి చ్ఛేదము 71వ సూత్రంలో చెప్పబడిన "రంజాదుల యించుక్చకారంబునకు సబిందు కంబున కప్రేరణంబున ద్విరుక్తలకారంబగు" అనే సూత్రం చేత -

సంపత్ + ఇంచు

సంపత్ + ఇ+ ల్ల్ + ఉ = సంపతిల్లు .

ఇది రంజాదుల వర్గానికి చెందినదిగాకపోయినా రూపసాధనలో ఈ సూత్ర ప్రక్రియననుసరించినాడని చెప్పవచ్చును.

ఉ. అచ్చటఁ దాము నిల్వఁబడి- యందర సాదర భాషణంబులన్
మచ్చిక మీఱఁ బల్కి తన- మామకు షడ్డకు వజ్రదంతునిన్
వచ్చిన పెండ్లివారలును- వారక నిల్వఁ డటంచుఁ బల్కి తా
హెచ్చుగఁ గాంచిపట్టణము- కేగె హుటాహుటిపెండ్లికూఁతుతోన్ 75

ఉ. అప్పుడు భూసురోత్తములు- యా సుదతీమణి లాప్తవర్గముల్
తప్పెట శంఖ కాహళ మృ-దంగ సమిన్మృఖ శృంగతాళముల్
చప్పుడు లుప్పతిల్ల రభ-సంబుగ మంగళతూర్యనాదముల్
యొప్పగ మ్రోయఁ గాంచిపురి- నుండి తగన్నెదురేగుదెంచుచున్ 76

ఉ. విప్రులు స్వస్తిఁ జెప్ప నల- విప్రసతుల్ నవరత్నహారతుల్
దీప్రము మీఱఁ బట్టుకొని- తేకువ సేసలు జల్లుచుండగా
వప్రము లేడు దాటి తన- వజ్రమయంపు గృహంబులోనికిన్
అప్రతిమానలీలఁ జని- యా యిలవేల్పుకు మ్రొక్కి రిర్వురున్ 77

వ. ఇట్లమ్మహీపాలుండు గృహంబుఁజేరి పరమసంతోషంబున రాజ్యంబుఁ బరిపాలించుచుండె నయ్యవసరంబున 78

మ. జననాథుండు సమస్తదేశములఁ దా- సంచారమున్ జేసి ది
గ్గన సౌందర్యవతిన్ మహాసుగుణ స-ద్గాంభీర్యచాతుర్య నై
పుణిఁ బెండ్లాడెఁగదా! యటంచుఁ బురిలో- భూపాల సంఘంబులున్
మనుజవ్రాతము సన్నుతించిరిల స-న్మాధుర్య వాక్ప్రౌఢిమన్ 79

కం. ఈ లీల నృపతి భాగ్యవ
తీ లలనాసహితుఁ డగుచు దిన-దినము రతీ
పాలక సంగర విలస
త్కేళీలోలానుబద్ధకృ-తమతి యగుచున్ 80

వ. అప్పుడు 81

చ. తనయునిఁ జూచి మోదమున- దక్షిణదిక్కుకుఁ బోవనంతలో
నినజుఁడు సైరిభంబు పయినె-క్కి యెదుర్కొన వచ్చుచుండఁగాఁ
గని తన ఘోటకం బధిక- కంపము నొందఁగ నోర్వకోగెనా
దినకరుఁ డశ్వవైరము మ-దిన్ దలపోయుచు నుత్తరాశకున్ 82

మ. హరిదశ్వోజ్జ్వల తిగ్మదీధితి సమూ-హక్షుణ్ణ నిర్భగ్న బం
ధుర గోత్రార్ధవిశాలరంధ్ర పరితం-తూర్ణా గతాహీశ భా
స్వరశీర్షస్థ మణీఘృణీ నిచయ వి-భ్రాంతి ప్రదోద్యద్దివా
కరకాంతంబగు యాతపాగమము జా-గ్రద్ధావమై భాసిలెన్ 83

## వసంతఋతు వర్ణనము

గీ. ఇట్లు మధుమాస మేపార- నింపుమీఱఁ
బత్ర కిసలయ పుష్ప స-త్ఫలవిశేష
మహిమఁ జెన్నొంది మించు నా-మని విధమున
జనుల కత్యంత లోచనో-త్సవముఁ గాఁగ 84

కం. అప్పుడు జననాథు-డు ముద
ముప్పతిలన్ వనవిహార- మొనరింపఁగఁ దా
కప్పురగంధినిఁ గూడుక
తెప్పునఁ బురి వెడలె సఖు లు-దీర్ణతఁ గొలువన్ 85

కం. కాంతాలతాంత పిహిత ని
తాంత ముఖుల్ బలసి కొలువఁ- దా ననంతా

త్యంత ముద్వార్థిఁ దేలుచుఁ
గాంతుఁడు కాంతాసమేత- గరిమన్ వెలసెన్ 86

కం. మదన రసకవిత నాభీ
హ్రద పరివారిత రోమ-రాజిన్ హంసా
స్పద భూషణవైఖరి చే
నదుల వలెన్ నడచి రఖిల- నారీజనముల్ 87

చ. వర సుకుమారుఁడీ నృపుఁ డ-వార్యగతిన్ ననుఁజూడ వచ్చెనం
చరయఁగ నా వనేందిర మ-హాదరణన్ తృణకంటకాదులన్
చరణయుగంబు నొచ్చునని- చక్కఁగ నుంచిన పాన్పులోయనన్
విరివిగఁ బండుటాకుగమి- నిండె వనాంతరసీమ నెల్లెడన్ 88

సీ. వనసరోవరవీథి- జనియించి దులకించు
లాలిత రక్తోత్ప-లంబు లనఁగ
నారామ పర్వతా-యత భూమి జన్మించి
దళుకొత్తు గారుత్మ-తంబులనఁగ
ఘనతర వనవాటి కాంభోధి సీమలోఁ
బొలుపొందఁ బ్రభవించు- బుగ్గలనఁగ
నుద్యాన గండకి- నుదయించి తిలకించు
భవ్య సాలగ్రామ-పంక్తు లనఁగఁ

గీ. బల్లవచ్ఛద సత్పుష్ప-ఫలసమాజ
సంతతామోద సకల ది-గంతరాళ
జన మనోహర కారణాం-చత్ప్రభావ
వైభవంబున విలసిల్లు- వార్త కెక్కి 89

నూత్నదంపతుల ఉద్యానవన విహారము

సీ. చంద్రాస్య! నీ మోము- చాయఁ గన్గొని వేగ
గడు భీతి చక్రవా-కములు బెదరె!
హరిమధ్య! నీ మధ్య- మరసి కంపము నొంది
పరగ గజావళుల్- పరుగు లెత్తె!
కలవేణి! నీ వేణి-కలుఁ జూచి తొడిఁ బడి
చక్రాంగసంఘముల్- చదల కుఱికె!
కాంచననాస! నీ- ఘన నాసికముఁ గాంచి
భయమంది తుమ్మెదల్- బాసి చనియె!

గీ. నహహా! నీ యంగ సౌందర్య- మహితశౌర్య
మహిమ వర్ణించి చూడ బ్ర-హ్మకుఁ దరంబె!
తను విభావైభవైక జి-ద్ఘన సుహేమ!
దివ్య గుణధామ! భాగ్యవ-తీలలామ!! 90

వ. మఱియును 91

కం. కొమ్మా! యీ కొమ్మ కడుఁ జే
కొమ్మ యనన్ కరము లెత్తె- కుచపటి మెడలన్
అమ్మనుజవిభుఁడు కరతా
ళమ్ములు ఘటియించు ఘనవి-లాసద్యుతులన్ 92

కం. ఫలకుచముల, పుష్పేక్షణ
ములఁ, బల్లవ దివ్యహస్త-ముల, నిన్నొగి నీ
డలఁ జేరఁ బిలిచె మారుత
చలిత లతాంతముల- సఖియరో కంటే! 93

ఉ. నీ గమనంబుఁ జూచి తరు-ణీమణి యీ కలహంస సిగ్గుచే
దాగె లతాకుటీరమునఁ- దప్పక నీ కనుదోయి నేణమున్
తాఁగనుఁగొంచు భీతిలి ప-దంబులు తొట్రుపడంగఁ బాఱె నం
చా గుణశాలి పార్థివుఁడు- యేననిఁ దెల్పె వచోచమత్కృతిన్ 94

ఆ.వె. కీరవాణి నీదు- సారవాక్కులు విని
పునుగుఁబిల్లి చూత- భూజకోట
రంబు వెడలి వృక్ష-రాజిఁ దా వెదకెను
చూడుమనుచు విభుఁడు- చూపి చెప్పె 95

చ. కమలనేత్రి! నీదు ఘన క-మ్రపయోధరయుగ్మధాటిచే
మము నదలించు నంచు వన-మధ్యమునన్ కడుఁ జక్రవాకముల్
యమళతఁ బూనఁగా వెఱచి- యాదట బాఱెను జోడుఁ బాసి చూ
డుమని కరంబుఁ జాచి విభుఁ-డు ప్రచురంబుగఁ దెల్పెఁబొల్పుగాన్ 96

శా. నీరంధ్ర ద్రుమ భూమి నేగు సతులన్- నీరేజమిత్రుండుఁ దా
నౌరా! యీ సొబగంచు భ్రాంతికరసా-హస్రంబులన్నాను శా
ఖారంధ్రంబుల వాతసంచలితము- ల్గాదీ సులోకంబులో
నేరైనన్ పరకాంతనంట భయమై- యిప్పట్టులన్ జూడరే! 97

మ. చెలియా! చూచితె యీ మయూరము నిజ-స్త్రీ తోయపానంబుచే
సి లఘుత్వంబుగ రాగ వేఱొకసతిన్- చేకూర్చుకన్ క్రీడచే
వెలయన్ మోదముఁ బొంది దానిఁ గని తా- వ్రీడాగతిన్ పింఛము
న్నల కాంతన్గనకుండఁ గప్పెఁ బురుషుల్- యన్యాంగనేచ్ఛుల్ గదా! 98

సీ. మునుకొని పున్నాగముల- మొదల్ జేర్చకే
రంభోరుయుగళ! దూ-రంబుఁ జూడు
కేతకి కంటకి- కృతమని నడుమంచు
రోయకే నేవేళ- రోమరాజి
కింశుకం బాదిని- గినిసి ఖండింపకే
యతులిత లసిత బిం-బాధరోష్ఠి!
కదళిఁ బెట్టుగఁ బట్టి- తుదిఁ ద్రుంచవైచకే
యనుపమోజ్జ్వల రాజ-హంసగమన!

గీ. యనుచుఁదన తోడి చేడియ- లాది వైర
వర్గము లెఱింగి ఘనవన-వాటి చిత్ర
గతులఁ బలుకుదు రొండొరుల్- గాంచిమించి
సంతతానందవైభవ-స్వాంతములను 99

వ. మఱియు, నమ్మహీకాంతుండు, నిజభార్యాసహితుండై యనేక సఖీజనం బులుఁ గొలువ మాధవీలతల న్నల్లిబిల్లిగా విలసిల్లి కొల్లలుగా నల్లుకొన్న మల్లెవల్లరులన్ మించి సమంచితమహిమన్ చుట్టుగాఁ జుట్టుకొన్న యాలకీ తీగల కనుకూలంబులై బాలకేళికిన్ ఘుంఘుమ్మను కమ్మవాసనల కిమ్ముగా నామోదంబులు డెందమ్ములన్ కరిగించు నమ్మహనీయ కుంజ పుంజంబులఁ గొంత విహరించుచు, ఖర్జూర రసాల హింతాల కదంబ దేవదారు గోరంట కాగరు ప్రముఖనిఖిల తరుచ్ఛాయల ప్రొద్దులుఁ గడుపుచు, సుద్దులుఁ బలుకుచు శుకపిక నికరంబుల లీల ప్రతిరవంబులు సేయుచు, రాజహంసంబుల నదలింపుచుఁ బువ్వులుఁ ద్రెంపుచుఁ, దీగెలుఁద్రుంపుచుఁ, కిసలయంబుల గిల్లుచు, ఫలంబుల గ్రహింపుచు, నర్మగర్భంబులాడుచు, స్వేచ్ఛా విహారపరతంత్రులై ముందట 100

## జలక్రీడా వర్ణనము

సీ. అనుపమానోజ్జ్వల- దనిమిషాక్రాంతంబు
సరస విశాలాబ్జ-సంకులంబు
హంస జాతోపేత- శంసానుకూలంబు
రక్తపస్తోమ- విరాజితంబు
నక్రసంచార స-ద్విక్రమాకలితంబు
సారంగ విహరణా-స్పదపదంబు
రాజరాజ విరాజ- రంజితాధారంబు
ఆర్యానుకూల గాం-భీర్యకంబు

గీ. నగుచు యింద్రాగ్ని యమ కోణ-ప పవన
ధనద శితికంఠ పురవర- ధర్మకర్మ
మహిమఁ జెన్నొందు సరసి య-మ్మనుజవిభుఁడుఁ
జూచి జలకేళి సలుప ను-త్సుకతఁ జెందె[1] 101

చ. జలచర దృగ్వితానముల- సారసకుట్మల భాక్కుచంబులన్
పులిన నితంబ భారమున- భూరిబిసప్రకరానుబాహులన్

---

1. ఈ సీసపద్యంలోని ఎనిమిది పాదాలలో చతురప్రాకారమైన సరస్సును వర్ణిస్తూ ఎత్తు గీతిలో అష్ట దిక్పాలకుల పేర్లను వరుసగా చెప్పినాడు. దీని అన్వయ క్రమమిట్లున్నది.
1. అనిమిషాక్రాంతము - ఇంద్రుఁడు
2. సరసవిశాలాబ్జ సంకులము - అగ్ని
3. హంసజాతోపేత శంసానుకూలము - యముఁడు
4. రక్తోపస్తోమవిరాజితము - నైరుతి
5. నక్రసంచార సద్విక్రమము - వాయువు
6. సారంగ విహరణాస్పదము - కుబేరుఁడు
7. రాజరాజ విరాజరంజితాధారము - ఈశానుఁడు
8. ఆర్యానుకూల గాంభీర్యకము - సూర్యుఁడు

సలలిత హంస భూషణత- సామజగామిని నిండుకేళికిన్
బిలిచె సరోవరాబ్జముఖి- బ్రీతి తరంగ ఘుమంఘుమార్భటిన్ 102

ఉ. భూషణ వస్త్రముల్ విడిచి- పొందుగఁ దెల్లని వల్వపావడల్
తోషముమీఱఁ గట్టుకొని- తోయదళేక్షణ లెల్లఁ గేళికా
భాషణ లుప్పతిల్ల జన-పాలశిఖామణి బాహుదండవై
శేషిక యుక్తి యా సరసిఁ- జేరిరి ,కౌనులు చంచలింపఁగాన్ 103

## చల్లుపోరాటముల వర్ణనము

లయగ్రాహి. వారిరుహలోచన ల-వారిగనుఁ గూడుకొని
నీ-రములు దోయిళులఁ జల్లన్
సారసమరాళ బకవారి కృకవాక జల-చార మద ష
ట్చరణ-వారములు భీతిన్
భోరునను దిక్కులను- బాఱి వెస నోరు తడి
యారుకొనిరాగ కడు-దూరమున దాగన్
భూరిజలకేళి సువి-హారములు సల్పి రతిగారవము
మీఱఁగ న-యారె యని వేడ్కన్ 104

మ. సఖురాలొక్కతె మున్ను తన్ను సర-సీజాతంబుల నొంచినన్
పిక యాలాపము చేత పద్మములఁ దా-పించంగ నూహించి దీ
ర్ఘికలోఁ దోచినఁ దత్పయోధరములన్- కెందమ్మి పూమొగ్గలన్
సుకర ద్వంద్వముఁజాపఁ జూచి నగు న-చ్చోనుండు కాంతామణుల్ 105

మ. అల హంసంబునుఁ బట్టుమంచుఁ బతి, తా-నంపంగ నేతెంచి లో
తుల లోనం దిరుగంగ నేర్చె నెదుటన్- దోర్దండయుక్తిన్ సరో
జల మందున్ వడి నీద నేర్చెను వయ-స్యాసంఘముల్ మెచ్చఁగా
వలయాకారము పూర్ణచంద్రముఖి దు-ర్వారైకధైర్యంబునన్ 106

ఉ. అంబుచరోరుఘట్టిత భ-యాతురతన్ హృదయేశు దివ్యకం
ఠంబు గ్రహించి తాఁ బరిలు-ఠద్గతిఁ బూన మృగాక్షి నీ యురో
జంబులు భూమి భృద్యుగముఁ- జక్కఁగ వక్షముఁ జేరునట్టి భా
రంబు ధరింప నెవ్వరి త-రంబన నవ్వుదు రిర్వురాత్మలన్ 107

ఉ. అమ్మనుజేశ్వరుండు ముద-మంది హరిద్ర పలాశపుష్ప యు
క్తమ్మగు నవ్వసంత మతి- కౌతుక మొప్ప గుఱించి భార్య వ
క్షమ్మున జిమ్మఁ గంచుకము- గ్రక్కున వ్రీలిన గుబ్బ వచ్చి యం
దిమ్ముగ వేళ్లు చక్రయుగ-ధర్మతఁ దత్కుచపాళిఁ గన్పడెన్ 108

సీ. తన మనోహరుని వ-క్త్రము గెల్చునో యని
చెలియ పద్మంబులఁ- జిమ్మి వైచెఁ
బతి కన్నుదోయికిఁ- బ్రతివచ్చునోయని
పడఁతి భృంగంబులఁ- బారఁ దోలె
జీవితేశ్వరు నాభి-సీమఁ గేరు నటంచు
వనజాక్షి సుడిగుంత-లనుఁ గలంచె
విభుని బాహుద్వయి- వెగడుఁ జేయునటంచు
తరుణి తామరతూండ్లుఁ- బెఱికి వైచె

గీ. నిట్లు తన నాథుపై ప్రేమ- యినుమడింప
నంగసామ్యంబులగు వాని- నెల్లరూపు

మాపె సకియలతోఁ గూడి- మంజువాణి
సారసాకర జలకేళి- సలుపునపుడు 109

చ. ఇటుల ససంభ్రమంబున మ-హీశుఁడు భాగ్యవతీ సమేతుఁడై
పటుగతి వారిజాకరముఁ- బాసి సఖీజనకోటిఁ గొల్వఁగాఁ
దటుకున వెల్లివచ్చి వర-ధౌతదుకూల విభూషణాళి మి
క్కుటముగఁ దాల్చి వాసనల- ఘుమ్మను గంధమలందియుండగాన్110

## వినూత్నవధువుతో, విలాసినీమణులతో కామవేది విందుభోజనములారగించుట

ఉ. అయ్యెడఁ బోనకావడుల- నన్నముఁ గూరలు నూరుబిండ్లు బ
ల్తియ్యని పిండివంటలును- దివ్యఘృతంబు రసీరసాన్నముల్
చయ్యన చారు పాల్పెరుగు- చక్కెరలుక్కెర లాదిఁ గాఁగఁ దా
నెయ్యము మీఱ మంత్రికుల- నీరధిచంద్రుఁడుఁ బంచె రాజుకున్ 111

ఉ. సంతసమంది భోజనము- సల్పఁగఁ బంక్తులుఁ దీఱి చక్కఁగా
వింతగఁ గూరుచున్న పృథి-వీపతి ముఖ్య సఖీజనాళికిన్
కాంతలు హైమపాత్రముల- కౌతుకలీల భుజింపఁ బెట్ట వా
రంతట నారగించిరి ర-యంబున నోదన ముఖ్యవస్తువుల్ 112

చ. కనకపు నీరుఁ బోసిన చొ-కాటపుఁ బోకలుఁ బండుటాకులున్
ఘనఘనసారమౌక్తిక సు-కల్పిత దివ్య సుధామృగీమదం
బును సురపుష్పకైల ఫల-ముఖ్య సుగంధరసానుబంధురా
త్యనుపమ వీటికాదులు ర-యంబునఁ జేసిరి వేడ్క మీఱఁగాన్ 113

### భాగ్యవతి గర్భముఁ దాల్చుట

వ. ఇట్లు బహుదినంబులు సఖీజనంబులుఁ గొలువఁ గామవేది మహీపాలుండు వనవిహారంబు రహఃకేళీవిలాసుండై భాగ్యవతిం గూడి చౌశీతిబంధంబుల, నష్టాదశచుంబనంబులం గామోపభోగంబులను, నిచ్ఛా విహారంబుగా సుఖియించుచున్న యవసరంబున 114

కం. సామజగామిని భాగ్యవ
తీమణి గర్భంబుఁ దాల్చె- దివిజేంద్ర దిశా
భామిని మును సంతసమున
సోముని గర్భీకరించు- చొప్పుఁ దలిర్పన్ 115

కం. నెల లంతకంత కెక్కిన
నెలఁతకు రతికాంక్ష లుడిగె- నెడనెడఁగోర్కెల్
విలసిల్లె నడుము బలిసెన్
నలుపెక్కెను చూచుకములు- నడ తడబడియెన్ 116

### పుత్రజననము

చ. గురుఁడు బుధుండు భార్గవుఁడు- కోకరిపు ప్రముఖాది సౌమ్యకుల్
శరధి శశాంక భూధర ద-శస్థలులన్ విలసిల్లుచుండఁగా
వరశుభలగ్నమందుఁ గనె- వారిజలోచన దివ్యగాత్రునిన్
సరసిజవక్త్రనేత్రుని ప్ర-సన్నచరిత్రుని దివ్యపుత్రునిన్ 117

చ. ప్రమదముఁ బొంది భూవిభుఁడు- భవ్యసరిజ్జలమందుఁ గ్రుంక ది
వ్యమణి సువర్ణగోరథ గ-జాశ్వదుకూల తిలాజ్యరౌప్యభూ
ప్రముఖ సమస్తదానములు- బ్రాహ్మణకోటికి ధారఁ బోసి వే
గమె నిజమందిరంబు సుభ-గస్థితిఁ జేరె సుఖైకవైఖరిన్ 118

వ. అనంతరంబున 119

ఉ. మంగళతూర్యముల్స్రెలఁగ- మంత్రులు, బంధులు, మిత్రులాశ్రితుల్
చెంగట హర్షముల్పొదలఁ- జేరి సుఖస్థితిఁ గొల్వ భూసురుల్
పొంగుచు స్వస్తివాచనముఁ- బూన్చ హిరణ్మయదివ్యకుంభముల్
రంగుగ నుంచి దంపతుల- రమ్మని పీటల నిల్పి పొల్పుగాన్ 120

గీ. ముందు పుణ్యాహ మొనరించి- నాందిఁ జేసి
జాతకర్మంబుఁ గావించి- క్ష్మాప్రజానకు
విజయదేవాభిధానంబు- విశ్రుతముగఁ
బెట్టి రవ్విప్రకోటులుఁ- బ్రీతి మెఱయ 121

చ. తిరముగ రాజశేఖర స-తీపరిపోషితుఁడై యహీన వి
స్ఫురిత మహీవిభూషణత- శోభిల భాసురశక్తిఁ గల్గి తా
నరయఁగ వృద్ధిఁ బొందె జని-తాధిక వాసర వాసరంబులన్
వర సుకుమారమూర్తి నృప-వర్యకుమారుఁడు మారవైఖరిన్ 122

### విజయదేవుని బాల్యక్రీడలు - విద్యాభ్యాసము

సీ. అల్లిబిల్లిగఁ దల్లి- కాళ్ల కడ్డమువచ్చి
యెత్తుకొమ్మని చేతు-లెత్త నేర్చెఁ!
దండ్రి ముద్దొనరించి- దగఁ బ్రేమతోఁ జుంచు
దువ్వంగఁ బకపక- నవ్వనేర్చెఁ!
గనకంపుటందియల్- ఘలుఘల్లుమని మ్రోయఁ
బరగ వీథులఁ బరు-వార నేర్చె!

తన సంగడీలతోఁ-[1] జనువుగాఁ గూడుక
ధీరత నిల్లిల్లుఁ- దిరుఁగ నేర్చెఁ!

గీ. బుట్ల చెండాడఁగా[2] నేర్చె,- రట్టు నేర్చె!
శారికాకీర కలకంఠ- సమితిఁ గాంచె!
లలిత సద్వాక్యపద్ధతిఁ- బలుక నేర్చె!
విజయదేవుండు శైశవ-వేళలందు 123

మ. క్షితి భృన్మౌళి తనూజుఁ గాంచి చదువు- ల్జెప్పింపఁగా నాత్మయం
దతి మోదంబునుఁ బొంది శాస్త్రముఖవి-ద్యా భార్గవుల్ జేరి త
ద్ధిత సూక్తిం గొనియాడి నూతన మహీ-రాజాధి రత్నప్రభా
యత సద్భూషణ కాంచనాంబర నికా-యంబిచ్చి లాలింపుచున్ 124

కం. నిటల తట ఘటిత
పటుకరపుటుఁడై సుతుఁ బిల్వఁ- బంచి విద్యా
ఘటికునిఁ జేయుము తటుకున
స్ఫుటమతి సభయందు ప్రజ్ఞ మీ- పట్టుదలన్ 125

వ. అని యొప్పగించి 126

---

1.సంగడీలు = బాల్య స్నేహితులు, పాఱుఁడు సంగడికాఁడె యొందువన్ (ఆదిపర్వము నన్నయ), సంగడీల నడుమ చక్కనఁ గూర్చుండి, శైశవంబు మెఱసి చల్దిగుడిచె - (పోతన భాగవతం).

2. బుట్ల చెండాట - ఒక తాటాకును మడిచి గుండ్రని బంతిగా గట్టిగా చుట్టి, ఒక చిన్న బుట్టను చతురస్రాకారములో అల్లి అందులో తాటాకు చెండును వేసి మూతిని అల్లి దానిని బంతివలె ఎదుటివారికి ఎత్తెత్తి వేస్తూ ఆడుకోవడం

ఉ. వేదపురాణశాస్త్రములు- విశ్రుత పాఠక కావ్యముల్ ధను
ర్వేదము లాదిగాఁ గలుగు- విద్యలనన్నిటిలో వరిష్ఠుఁడై
మోదము మీర నేర్చె నృప-ముఖ్యకుమారుఁడు నాఁడు నాఁటికిన్
వాదవిశేషయుక్తి సభ-వారలు నిచ్చలు మెచ్చ హెచ్చుగాన్ 127

## విజయదేవుని యౌవరాజ్య పట్టాభిషేకము

కం. తనయుని విద్యామహిమలుఁ
గనుఁగొని యువరాజుఁ జేసి- కాంతామణితో
ననుదినముఁ గ్రీడ సల్పుచు
మనమున సంతోషవార్ధి- మగ్నుండయ్యెన్ 128

వ. మఱియు కామవేది మహీపాలుండు పరమసంతోషంబున నిజభార్యా సహితుండై హంసతూలికాతల్పంబున సరససల్లాపంబులఁ బలుకుచున్నయెడ 129

## భాగ్యవతీ చేతికికట్టుకొన్న జీర్ణమైన తోరమును కామవేది క్రోధముతో త్రెంచి పారవైచుట

కం. అవనీనాథుఁడుఁ గనె భా
గ్యవతీకర దివ్యహైమకం-కణయుతమున్
సవిశిష్టోజ్జ్వల కార్పా
స వితంతుగ్రంథియుక్త- సత్తోరంబున్[1] 130

1. కార్పాసము (సం) = దూది, ప్రత్తి (తెలుగు)కాపూస్ (మరాఠీ), తూపి (తమిళం)
వితంతుగ్రంథి = ఊడిపోయిన దారపు ముడి

వ. చూచి, క్రోధఘూర్ణనయనుండై, కోపంబుప్పతిలన్ పూర్వకర్మ
సంచయంబుఁ ద్రోయంజాలక, రాజగర్వమదంబున నమ్మహదైశ్వర్య
కరంబగు తోరం బుపలక్షించి భార్యకిట్లనియె 131

కం. మణిగణఖచితములౌ కం
కణములు చౌకట్లుఁ గలుగం-గా నీ దారం
బణుమధ్య యేలఁ దాల్చితి
వని హస్తముఁ బట్టిఁ ద్రుంచె- నాగ్రహవృత్తిన్ 132

కం. గడగడవణకుచుఁ బదములు
దొడిఁబడ నహహా! త్యజింప- దోషము దీనిన్
విడువిడుము భాగ్యహీనతం
బడుదు రటుఁ గావించితేని- నవనీనాథా! 133

వ. అనినన్ జాజ్జ్వల్యమాన రోషావేశంబునన్ నమ్మహీశుండు 134

గీ. ఈ యమంగళ సూత్రంబు- యిందువదన
యెంత భాగ్యంబుఁ జేకూర్చు- నేటిమాట!
యిట్లు పలుకంగ నీకు నో-రెట్టు లాడెఁ
దానఁ గలుఁగునే సంప-దానూనగతులు 135

వ. అనినన్ భాగ్యవతీలలామ సాదృశ్యంబుఁ జెప్పెద, నాకర్ణింపు మని
యిట్లనియె 136

భాగ్యవతి కేదారేశ్వర వ్రతతోరపు మహిమను భర్త కామవేదికి
తెలియఁజేయుట

మ. ధరణీనాయక! యేము పూర్వము మహా-దారిద్ర్యదోషంబునన్
తిరిపెం బెత్తఁగ ముష్టిధాన్యములకై- దీనత్వముంబొంది ప
త్పురముల్ పల్లెలు సంచరించి మముఁ దా- పోషించె మా తండ్రి యా
వర పర్యంతము వజ్రదంతధరణీ- పాలేంద్రపట్టంబునన్ 137

చ. తిరముగ నారదుండు చను-దెంచి మహీపతిఁ గాంచి వారిచే
నరయఁగఁ బూజలంది ముద-మందుచు నీ వ్రత మాచరింపు మం
చరుదుగఁ జెప్పి మింటికి ర-యంబున నేగెను వల్లకీగుణ
స్ఫురిత వినోద నాదములఁ- జొక్కి హరిస్మరణానురాగుఁడై 138

వ. అప్పుడు 139

శా. కేదారేశ్వరనామకవ్రతము తన్- కీర్తింపఁగాఁ జేయుచో
మోదంబంది పురీజనప్రతతు లిం-పుల్మీఱఁ గావింపఁగా
నా దారిన్ గని ద్రవ్యలోపమునఁ జే-యన్నేర కున్నంతటన్
భూదేవాకృతిఁ దాల్చి శంకరుఁడు సం-పూర్ణానురాగంబునన్ 140

కం. మమ్మక్క సెల్లెంద్రను
రమ్మని తద్వ్రతము వే-గమె మా చేతన్
సమ్మతితోఁ గావించి క
రమ్మునఁ దోరమ్ముఁ గట్టె- రాజమృగేంద్రా! 141

కం. కథవిని మంత్రాక్షతలు
పృథుగతి శరముననుఁ దాల్చ- భీషణదారిద్ర్య
వ్యథమాని దివ్యభూషణ
గ్రథితులమై యుండఁ గలిగెఁ- గరతోరమునన్ 142

వ. మఱియు 143

చ. ఇరువది యొక్క వత్సరము- లీ వ్రతమింపు జనింప భక్తిచే
నరయ రచించిరేని శుభ-దాస్పదమై బహుభోగభాగ్యముల్
తిరముగఁ గల్గు భూవర! -మదిన్ దలపోయుము భంగమైనచో
సిరులుఁ దొలంగు నంచు శశి-శేఖరుఁ డాడి చనెన్యదృశ్యమై 144

కం. అని యీ రీతిగఁ జెప్పిన
జననాథుఁడు రాజ్యగర్వ-సంయుక్తుండై
మనమున క్రోధముఁ బెనఁగొన
వినకన్ తోరంబుఁ దెంచి-వేసెన్ పిదపన్ 145

కామవేది మహారాజుకు హఠాత్తుగా మనోచాంచల్యమేర్పడి అడవులఁ బట్టుట

ఉ. అప్పుడు వెఱ్ఱి లేచి కన-కాంబరముల్ విదళించి వైచి తా
గుప్పున భూషణవ్రజము- కుంభిని రాలిచి గోచిఁ బెట్టుకన్
తప్పక నాత్మనందనుని- దారనుఁ లో విడనాడి వెఱ్ఱితో
జెప్పక నెగె ఘోరవన-సీమకుఁ దత్పురిఁ బాసి భోరునన్ 146

వ. అప్పుడు 147

ఉ. ఎక్కడి కేగెనో, పరుల- నేమన వారలుఁ బట్టి కొట్టిరో
యక్కటివంపుఁ గానల మృ-గాదులచేఁ గడు బాధఁ బొందెనో
ముక్కుచు నన్నపానములు- చిక్కన నెంత తపించెనో మహా
రక్కసు లేరు మ్రింగిరొ ధ-రావ్రవరోత్తము నేడు బెట్టుగాన్ 148

వ. అని యబ్భాగ్యవతీలలామ తన పతి దుర్వర్తనంబునఁబాటిల్లు చేటునకు మాటిమాటికి వగచుచున్న సమయంబున 149

## శత్రురాజులు దండెత్తి కోటను స్వాధీనపరచుకొనఁగా భాగ్యవతీ, విజయదేవులు అడవులపాలగుట

శా. విద్విట్రాజసమూహముల్ పురముపై- వేగంబ మత్తేభ శుం
భద్వాజిప్రకరంబుఁ గొల్వఁగ ధను-ర్బాణాసిపత్త్యాధి సం
పద్విఖ్యాతిగ భూనభంబు లదరన్- ప్రస్థానభేరీధ్వనుల్
తద్ద్వారంబున మ్రోయఁ జేసిఁ గవిసెన్- ధారాళశౌర్యంబునన్ 150

సీ. కోటకావలివారి- కూలంగఁబడ ద్రొబ్బి
సైన్యాధినాథులఁ- జక్కడంచి
గజవాజికోటుల- గజబిజిఁగావించి
స్యందనౌఘంబుల- ముందుఁగూల్చి
మంత్రిసంఘంబుల- మదమెల్ల నెడలించి
హితసంఘముల బట్టు- మతిఁగలంచి
దాసీజనంబుల- తద్బంధుగణముల
నెల్ల రౌద్రమున- నూరెల్లమోది

గీ. విత్తభవనంబులందు ను-ద్వృత్తి మీఱఁ
దమ బలంబుల నంకించి- తగ మదించి
పెలుచఁ బురి చుట్టు మదగజ-బృందములనుఁ
గాపుగాఁ బెట్టి యక్కొల్వు- దాపుఁజేరి 151

శా. ఆ కల్లోలములన్ రిపువ్రజములన్- యా మత్తనాగావళుల్
వీకన్ గన్గొని కేశవాత్మజసుతున్- వీక్షించి బాష్పాక్షియై
మా కెవ్వారలు దిక్కు యింక విడిపిం-పన్ యీ పురిన్యంచుఁదా
శోకవ్యాకుల మానసాంబురుహయై- సోలెన్ ధరామండలిన్ 152

వ. యా క్షణమున రాజమంత్రులు ప్రతిగృహంబునన్ ప్రవేశించి చూచి యంతః పురంబునకుఁ జని యా భాగ్యవతిని బంధించి యామె పుత్రునిఁ బట్టుకొని 153

కం. వారిరువుర భూషణములు
చీరలు సడలించి నార-చీరల చేతన్
వూరు వెడలఁ దోసి తత్పురి
వారేలుచు నుండి రపుడు- వైభవలీలన్ 154

చ. స్థిరగుణశాలి యీ విజయ-దేవునికిన్ కడుఁ గేశవాత్మజా
సరసిజనేత్రికిన్ నృపుఁడు- సద్గుణముల్ విడనాడి క్రూరుఁడై
యరయఁగ వారికిన్ తమకు- యాపదఁ దెచ్చుకొనెన్ యటంచునా
పురిజనులెల్లఁ గట్టలుగఁ- బొక్కుచుఁ జూచిరి విస్మితాత్ములై 155

వ. ఇట్లుఁ జూచుచున్న యవసరంబున భోరున నేడ్చుచు నా పట్టణంబుఁ బాసి యరణ్యమార్గంబుఁ బట్టుకొని పోవుచు 156

ఉ. కాననసీమ కేగి తృణ-కంటకముల్ పదసీమనంటినన్
వేసరి నీడ నుస్సురని- వేదనఁ బొందుచు రాజ్య వైభవా
మానగతుల్ దలంచుచు మ-నోవ్యథచే వెసఁ జిక్కి స్రుక్కుచున్
దాను సుతుండు నొక్క వసు-ధారుహమున్ గని దాని పొంతకున్ 157

కం. చని మార్గాయాసం
బున నాఁకలి దప్పిఁ బుట్టి- భుక్తికి లేకన్
వనమెల్లఁ దిరిగి ఫలములుఁ
గొనితెచ్చి కుమారుఁ గాంచి-కొమ్మని యొసఁగెన్ 158

వ. తాను కొన్ని భుజించి జలపానంబుఁ జేసి 159

అడవులలో నిడుములఁ బడుచు భాగ్యవతి పుత్రుని దురవస్థకు వగచుచు భర్తను తలఁచుకొని దుఃఖించుట

ఉ. పుట్టిన నాటనుండి మరి- పుత్రక! వజ్రసమానగాత్రకా!
పట్టగజాశ్వగంధ గజ-వాజి రథాదుల నెక్కి వేడుకన్
బట్టి చరించు నీ విపుడు- భూరిమహావిపినస్థలంబుల
న్నెట్టు చరించెదో మిగుల- నెయ్యది దారి యటంచు నేడ్చుచున్ 160

వ. తన పతి నుగ్గడించి భాగ్యవతీలలామ యిట్లనియె 161

కం. అతి మధురాన్నము లింపుగఁ
బ్రతిదినము భుజించునట్టి- ప్రాణేశుఁడు తా
మతి కలఁగి కందమూలములు
యతుల వలె నెట్లు తినునో-యా విపినములన్ 162

కం. నూతనమగు శయ్యను
నతులితముగఁ బవ్వళించు- నవనీశుఁడు తా
నే తెఱఁగు తృణలతాస్థలిఁ
బ్రీతిగఁ బవళించు నొక్కొ- పృథివి నయమునన్ 163

చ. అతి మృదుపాదయుగ్మమును- నంకతలంబునఁ జేర్చి మెల్లగాఁ
బ్రతిదినమందు హస్తముల- బాగుగ నొత్తఁగ నిద్రఁబోవు నా
పతియెటు స్రుక్కునో యనెడి- పాపపు కంటకబాధకోర్చి తా
మతిఁ గలగంగ నా విపిన-మధ్యము నన్నెటు సంచరించునో! 164

సీ. సామజంబుల నెక్కి- సంచరించెడి విభుం
డియ్యరణ్యంబున- నెట్లు చనునొ!
నృపులతో భాషించు- హృదయేశ్వరుఁడు పక్షి
కులముచే నెట్టులుఁ- బలుక నేర్చు!
సింహపీఠిని నధి-ష్ఠించెడి ప్రియుఁ డెట్లు
గండశైలములఁ గూ-ర్చుండ మెలఁగు!
నతి మృదులాన్నము- లారగించెడి పతి
యా కందమూలంబు- లెట్లుఁ దినునొ!

గీ. యనుచుఁ గామవేది ధరణీ-నాథుఁ డపుడు
యడలి సోన్మాద వివశుఁడై- యడరుటకును
నాత్మఁ దలపోసి భాగ్యవ-త్యబ్జవదన
భూరి దుఃఖంబుచేఁ జాలఁ- బొరలి పొరలి 165

కం. సుతునిపై ప్రేమ విడువఁడు
ప్రతిదినమొక గడియయైనఁ- బాయఁడు పతి తా
మతిఁ గలఁగి యెటులఁ జనెనో
వితతారణ్యముల యందు- వేదనఁ బడెనో! 166

కం. పారదయాపరిపూర్ణుఁడు
నారదముఖ వినుత వాదన వి-నఁడు గజదే

వారి మదశిక్షకుఁడు
శివుఁడు భక్తావనుండు న-గు టరుదగునే! 167

గీ. భక్తరక్షణ బిరుదుచేఁ- బ్రౌఢిఁ గాంచి
శత్రురక్షణయుక్తిచే- సలుపఁ జూచు
హరుఁడు లోకేశుఁడు- యేడుగడయ్యె
విశ్రుత ముదముచే- నవనివిభుఁడు 168

ఉ. అమ్మహనీయ సద్వ్రతము- నాదరణన్ ఘటియించి దేవతా
ఘమ్ములు బాధలన్ దొలఁగి- కాంతలఁ గూడి సుఖంబు చేత మో
దమ్మున నుండరే మును మ-దంబున నెంచక భూవిభుండు తో
రమ్ము కరంబు బట్టుక బి-రానను ద్రెంచెను చేటుఁ గానకన్ 169

శా. పంచాస్త్రుండు మహేశు దివ్యమహిమల్- భావింపకన్ క్రూరుఁడై
చాంచల్యంబు ఘటింతునంచు మదిలోఁ- జర్చించి నేత్రాగ్నిచేఁ
బంచత్వంబునఁ బొందఁడే మును మహీ-పాలుండు తల్లీలచే
నంచత్తోరము ద్రుంచి యట్లుఁ జెడు ట-న్నాశ్చర్యమే చూడఁగన్ 170

వ. అని మఱియు 171

స్రగ్ధర.
ఈ లీలన్ దాను పుత్రుండిక యెట్టులనుచున్- యేడ్చుచున్నానలోనన్
కాలాహి వ్యాఘ్ర భల్లూక హరిచమరి-కాఖ్యాత గోమాయు భిద్భ
ద్గోలాంగూలోగ్రకీశాకుల పటుబాధా- ఘోరదవాగ్ని కీలా
జాలా భీతాతి వాతోజ్జ్వలిత తృణలతా- సంఘసంభూతభీతిన్ 172

## భాగ్యవతీ, విజయదేవులు భాగ్యవశమున దూర్వాసుని ఆశ్రమమునకు చేరుట

సీ. వ్యాఘ్ర త్రికస్థలా-జిఘ్రున్నఖాళి
భి త్తిరస భృగ్వనశునో-ధృతులఁ జూచి
సారంగముల మ్రింగ- సమకట్టి వడిఁబెట్టి
పడఁగొట్టు నజగర- ప్రతతులరసి
చటుల ఝుంఝూనిలో-ద్భటి మహోర్భటిలుఠ
త్పాదప ప్రస్తర-ప్రకరముఁగని
దీర్ఘతాళాగ్రప్ర-దేశాసవాస్వాద పత
తాచ్ఛభల్ల సం-తతులఁ గాంచి

గీ. జడిసి తడగాల్లఁబడి గడ-గడవణంకి
పుడమిఁబడి లేచి నడుగిడ- నెడములేని
చెడుగు కంపల యడవిలో- బడలికోక
ముడి సడలి జార సవరించి- పోయిపోయి 173

ఉ. ఘోరతరంగఘుంఘుమిత- ఘోషమశేషవిశేషభీషణా
కార జలగ్రహోగ్ర ఫణి-కచ్ఛపమత్స్యజలూకభేక డిం
డీర బకాంబుశాబకకు-లీరవిహార మపారమౌని రా
డ్ద్వారజలావగాహన ని-వాసము నొక్క నదీతటంబునన్ 174

వ. చేరి యాత్మగతంబున 175

కం. కలవారల ముని యాశ్రమ
ములు నచ్చటికేగి కంద-మూలములు నా

కలి మాన్పి యుండవచ్చును
వల దనుమానింప పుత్రవర! -విను మిపుడున్ 176

ం. అటుఁ జనక నిచట నుండినఁ
బటు సింహవ్యాఘ్ర ఖడ్గ- భల్లుక వృకముల్
కుటిలగతి బాధసేయఁగ
నెటుల సహింపంగవచ్చు- నీ విపినములన్ 177

ఉ. ఈ నది దాటమార్గమది- యెచ్చట నుండునొ యెవ్వడైన నీ
కానన మందు రా నడుగఁ-గా వలెనే నటంచు భీతిచేఁ
దాను సుతుండుఁ గొంత పరి-తాపము నొంది యుదీచి దిక్కుకున్
వేనలి వీడ నద్దరిని- వెంబడిఁ జూచుచుఁ బోవుచుండఁగాన్ 178

తే. జానులంబిత రక్తప్ర-శస్తమైన
జడలచేతను రుద్రాక్ష- జపసరమున
ఫాలలోచనుఁ డీ నది-కేళి సలుపఁ
బూని వచ్చిన వానిఁగాఁ- బొలుపుఁ దెలుప 179

ఉ. స్నానముఁ జేయుచున్న ముని-సత్తముఁ గన్గొని మ్రొక్కిమమ్ము మీ
స్థానముఁ జేర్చుకొమ్ము నది- దాటఁగఁ జేసియన న్మునీంద్రుఁడీ
కానకు మీరుఁ జేర నెటుఁ-గన్ గత మెయ్యేది తెల్పు పొల్పుఁగా
నే నరనాథు కూఁతురవొ- యెవ్వని భార్యవొ నిక్క మిప్పుడున్ 180

వ. అనుటయు నబ్భాగ్యవతి యిట్లనియె 181

ఉ. దీనత కామవేది జగ-తీతలనాథుని పుత్రకుం డితం
డేను కుటుంబినిన్ విభవ-మెల్ల విపక్షుల లక్ష్యవృత్తిమైఁ
బూని గ్రహించి కానలకుఁ- బొమ్మని ద్రొబ్బిన వచ్చి యిచ్చట
న్నీనది దాటనేరక ము-నీంద్ర! నినున్ గనుఁగొంటి మారయన్ 182

శా. ఆ దూర్వాసమునీంద్రచంద్రుఁడు మహా-హర్షానురాగంబుచేఁ
దా దోశ్శాఖిననుండు దండము సమం-త్రప్రౌఢిచేఁ బంచి మీ
రీదండంబును కేల బట్టుకొని కం-ఠ్లేమాత్రమున్ దెర్వఁగాఁ
బోదా మంచనకుండుఁ డిచ్చటికి మి-మ్మున్ దెచ్చు మున్మాటికిన్ 183

మ. అపుడాశ్చర్యముఁ దోప వారల నిరా-యాసంబుఁగా మౌని చం
ద్రు పదద్వంద్వముఁ జేర్చ నేత్రయుగ మెం-తేఁ జల్లఁగా విచ్చిహ
స్తపుటంబుల్ ముకుళించి పొందుగ నమ-స్కారంబుఁ గావించినన్
కృప నాశీర్వచనం బొసంగె నిజశ-క్తిన్ భూరివాత్సల్యతన్ 184

కం. వారిరువుర నిజపర్ణా
గారమునకుఁ దోడి తెచ్చి- కాంతామణితో
వీరల పోషింపుము నా
మారుగ నని భయముమాన్పి-మక్కువ నునిచెన్ 185

వ. ఇట్లమ్మహనీయాశ్రమంబునకందమూలంబులఁ దృప్తింబొందుచుండు
మునికాంతల వల్ల సకల ధర్మాధర్మవిశేషంబులు వినుచు, పతివ్రతల
చరిత్రంబులు నిరంతరంబు నాకర్ణింపుచు, నిరుపమానందంబుబొందుచు,
రాజ్యసుఖంబుకన్న మౌనిపద సేవామృత దృష్టిచేత సమస్త దురితా
రణ్యంబులనుఁ గాల్చుచు, సుఖంబుండి రయ్యవసరంబున 186

కం. చమరీ సంఘముఁ దగ వా
లములన్ మున్నాశ్రమస్థలముఁ గసవూడ్చున్
సమదగజంబులు కరముల
విమల జలంబులు గ్రహించి వేడుకఁ జల్లున్ 187

శా. మార్జాలంబులు మూషకంబులు హరుల్- మత్తేభముల్ వ్యాఘ్రముల్
స్ఫూర్జద్భోగణముల్ శిఖావళములున్- భోగేశ్వరుల్ విద్విష
త్కర్జంబుల్ విడనాడి ధర్మగతులం- దళ్కొందు నమ్మౌని రా
డ్భూర్జట్యాశ్రమ సీమ సంతతము నెం-తోమోద ముప్పొంగగన్ 188

కం. ఆ మహిమలుఁ గని భాగ్యవ
తీ మానినిసుతుఁడు విజయ-దేవుఁడు భక్తిన్
దా మొనరించిరి దినదిన
మా మౌని పదార్చనంబు- లాశ్చర్యముగాన్ 189

కం. అని కృష్ణుఁ డెఱింగించిన
విని ధర్మతనూభవుండు- విష్ణుని కృష్ణున్
గనుఁగొని తర్వాతి కథ
న్ననఘా! వినవలతుఁ దెలుపుమని- యడుఁగుటయున్ 190

## ఆశ్వాసాంత పద్యములు

ఉ. అంగజభస్మశోభిత వ-రాంగ జనార్దన భూరిబాణ సా
రంగవిధృత్సురేంద్ర గజ-రాజవిరాజిత హస్తహస్త వా
మాంగ హిమవనీంద్ర తను-జాంబుజలోచన కుంభిదైత్య భి
ద్రంగ దభంగభంగ ఖచ-రప్రధునీధరదివ్యవస్త్రకా! 191

మాలిని. రజతగిరినివేశా! -రంజితవ్యోమకేశా!
కుజనమదవినాశా! -గోత్రజా మానవేశా!
భుజగవర విభూషా! -పుణ్యలోకానుపోషా!
అజరవినుత వేషా! -న్యాయకృద్దివ్యభాషా! 192

## గద్య

ఇది శ్రీమత్పంచవక్త్ర హనుమద్వరప్రసాదలబ్ధ కవితావిచక్షణ
క్రిష్ఠిపాటివంశ పయఃపారావార రాకాసుధాకర
కాశ్యపగోత్రవరపవిత్ర వెంకట్రామార్యపుత్ర
వెంకయకవి ప్రణీతంబైన
కేదారోపాఖ్యానంబు నందు
ద్వితీయాశ్వాసము

****

# కేదారోపాఖ్యానము

## తృతీయాశ్వాసము

కం. శ్రీమద్ధరణీభృత్తన
యా ముఖవరదమల హరి-దశ్వమహో
హైమాంచల బాణాసన
సామజదైతేయజైత్ర! -సత్యచరిత్రా! 1

వ. అవధరింపుము. భాగ్యవతీలలామ కుమారసహితంబుగా దూర్వాసా
శ్రమంబున నుండిన, విని ధర్మనందనుండు కృష్ణుంజూచి, 'స్వామీ!
కామవేది యెట్లు మెలంగె' నని యడిగినఁ గృష్ణుం డిట్లనియె 2

### కామవేది కారడవిలో కడు యిడుములఁ బడుట

ఉ. ఈ గతి కామవేది జగ-తీశుఁడు ఘోరున పాండురోగ బా
ధాగురుదేహమెల్ల నఖ-తాడితదుర్వ్రణజాతరుద్వసా
భోగ గళత్ప్రపాదతల- భూరివనస్థలుఁడై దరార్ఘురీ
భాగమృగేంద్రపంచనఖ- భల్లుకభీతిఁ గలంగిపోవుచున్ 3

చ. కనుఁగొనె వేణువర్గఘన-ఘర్షితసంభవరావ మర్కట
త్కుణపటలీ విలోకన ద-రీ తరువిస్తృత కోటరాంత ప
క్షి నికర శాబకాతి పరి-ఘూణ రవశ్రుత భీతచిత్త త
జ్జనకముఖాప్త బంధుజన-సంఘు విరావము నొక్క రావమున్ 4

చ. కడువడి భీతిఁ జెంది యతి-కర్కశమర్కట కుర్కురధ్వనుల్
యెడ నెడ మ్రోయ నన్ను నలి- యేటికిఁ దిట్టెనటంచునుగ్రుఁడై
జడగతి వానిపైఁ గలిసి- శాఖలుఁ బట్టి తెమర్చి మోదుచు
న్నడవిఁ జరించు కృత్తివలె- నార్భటిఁ జేయుచుఁ గేక వేయుచున్ 5

ఉ. ఆఁకలి దప్పిచే సొలసి- యయ్యెడ మార్గముఁ గానలేక చీ
కాకునుఁ బొంది కంటక వి-కారనికుంజములందు దూరుచోఁ
దేకువ రక్తసిక్తమయి దే-హము బ్రద్దలుఁబార నుస్సురం
చా కఠినంపుకానలు ధ-రాధిపుఁ డన్నియు దాటిపోవుచున్ 6

ఉన్మాదియైన కామవేది వికారపుచేష్టలతో శబరుల స్థావరములో జొరబడుట

ఉ. వారకఁ గాంచె భూవిభుఁ డ-వారిత పక్కణసీమ నొక్కఁటిన్
ఘోరమృగేంద్ర పంచముఖ- ఘోణికురంగ మయూర కుక్కుటో
దార నవీన మాంసములుఁ- దాము గ్రహించి త్యజించినట్టి వ
ల్లూరముకంకగృధ్రపరి-లోకము వేగమెఁ దెచ్చుచుండఁగన్ 7

వ. మఱియు మద్యపాన విశేష రక్తలోచనానేక పుళింద కిరాతక చండాల సంకర వర్గానర్గళ భీషణ దూషణ భాషణారావ సంకలితంబును, నుచ్ఛిష్ట మాంసగ్రసితాగత కర్కశ కుర్కురాన్యోన్య వైర చటుల దంతా ఘర్షితావయవ నిర్గళదసృగ్ధారా సంపాత పరిప్లుత వీథికాస్థలంబును, నగు యా శబరపురంబును ప్రవేశించి యున్మాదంబున దుర్మార్గవర్తనంబులు సేయుచున్న యవసరంబున 8

ఉ. ఎక్కడి వెఱ్ఱి వాఁడిచటి- కేటికి వచ్చెను యెల్లవారలీ
దిక్కున రాగ నందరిందిట్టుచుఁ గొట్టుచు రట్టుసేయునం
చక్కటి బోయలెల్ల గుము-లై మెడఁ బట్టుక వెళ్లఁ ద్రొబ్బి ర
ప్పక్కణసీమ దుర్భర వి-భాషణ దూషణభీషణార్భటిన్ 9

కం. ఈ మాడ్కి కామవేది మ
హీమండల నాథుఁడలసి- హీనత్వమునన్
భూమీధర కంధర వన
సీమను వెసఁ గడచి ముందుఁ- జెచ్చెఱఁ గాంచెన్ 10

కామవేది ఉపప్లావ్యమను పట్టణంబు ప్రవేశించి భిక్షాన్నముతో జీవించుట

కం. నిరుపమ భాసుర భూసుర
వరవేద వినోదనాద-వైభవములచే
ధరవన్నెకెక్కి రాజిలు
నఱుత నుపప్లావ్య పట్ట-ణం బరుదారన్ 11

వ. కని యప్పురంబు సొచ్చి భిక్షాన్నంబుఁ గొనితెచ్చి భక్షింపుచుండె, మఱియు 12

సీ. తనర యజ్ఞోపవీ-తంబులు కంఠంబు
నందు వ్రేలాడును- పొందుగాను
గురుహార కంకణ- కోటీరచిహ్నముల్
గలుగు నంగంబుల- ఘనుని మాడ్కి
బహుసుకుమారుని- పగిది పాదంబులు
హస్తయుగంబులు- నమరుచుండు
గంధేభముల లీల- గమనంబుఁ జూపట్టు
సింహమధ్యంబుచేఁ- జెలువుఁ గాంచు

గీ. రాజవర్యుండుఁ గాఁబోలు- రాజ్యగర్వ
మునను విప్రుల కెగ్గుఁదా- నొనరఁ జేసి
శాపపరిపీడితాంగుఁడై- సఖులు విడిచి
రోగముల చేతఁ గృశియించి- వేగుచుండు 13

మ. అటుఁ గాకుండిన నింత కష్టములచే- నాయాసముం జెందునే!
చటుల వ్యాధులఁ బొందునే! పరులశి-క్షా యుక్తిచేఁ గుందునే!
కుటిలంబేమియు లేనివాఁడైనచో గో-త్రేశు పేరెయ్యెదో!
యెటు వర్తిల్లునొ! యేది పట్టణమొ! దా-నే దేశవాసుండొకో! 14

వ. అని డోలాయమానమానసులైన యయ్యుపప్లావ్యపురంబునంగల
భూసుర ప్రముఖజనంబులు చూచుచుండి రచ్చట 15

## దూర్వాసాశ్రమములో భాగ్యవతీ, విజయదేవుల సంభాషణము

గీ. పొసఁగ భాగ్యవతీకాంత- పుత్రుతోడ
మౌని పదసేవ నెప్పుడు- మరువకుండి
కందమూలంబు లశనంబు-గా భుజించి
మెలఁగుచున్నది యాశ్రమ-స్థలమునందు 16

వ. ఇట్లత్తపోధనుండగు దూర్వాసమునీంద్రునకు నానందంబు ఘటియిల్ల
మెల్ల మెల్లన ప్రతిదినంబు పాదంబు లొత్తుచు కందమూల దర్భపలాశ
సమిధప్రకర వస్తువిశేషంబు లయ్యరణ్యనదీ గిరిధర స్థలంబులం
దరసికొని తెచ్చి యొసంగిన నమ్మహనీయప్రభావుండు కరుణాన్వితుండై
కొన్ని కందమూలంబు లొసంగిన భక్షింపుచుఁదనలోన 17

మ. భగవన్మౌని కృపావలోకనమునన్- బ్రాపించి యిక్ష్వాకులో
మగుడం బుట్టిన యట్లు పుత్రక మహా-మత్తేభ శార్దూల సిం
హ గణంబులుం దగ బాధసేయ కుని-కిట్లాశ్చర్యముందోప నొ
ప్పగ దీవించితి మారు నెట్ల ఫల స-ద్భుక్తిన్ యథేష్టంబుగాన్ 18

గీ. పొసగరాజ్యంబు శత్రుల- కొసఁగి మునుల
లీల నృపభావమిడనాడి- చాల కంద
మూలములఁ గూడుగాఁ బర్ణ-శాలలందు
గలిగి యెన్నాళ్లు వర్తింపఁగా- నమరునొక్కొ! 19

కం. అని యీ రీతిగఁ దల్లినిఁ
గనుఁగొని మనకెవరు బంధు-గణములు లేరా!
వినిపింపుము కలదైనను
ననుమానంబేల నమ్మ! -యాలస్యముగాన్ 20

కం. తనయునిఁ గనుఁగొని కేశవ
తనయామణ్యశ్రుజలవి-తానములురలన్
మనమున ఖేదం బినుమడి
గనుఁ బొదలఁగ నిట్టులనియెఁ- "గలరు కుమారా!" 21

ఉ. ఎక్కడ నుందురో? మిగుల- నెయ్యది పట్టము పేరు లెవ్వియో?
ఇక్కడి కెంత దూరమొ? మ-రెన్ని దినంబుల కేగ వచ్చునో?
అక్కడ భోగ భాగ్యములు- నందరికిన్ గలవందు రేకదా!
నిక్కము దెల్పు భీతి మది- నిల్పక నో జననీ! రయంబునన్ 22

సీ. ఉజ్జయినీ పురి నుం-దురు బహుభాగ్య
భూషణవ్రజముచేఁ- బొల్పు మిగిలి
మీ తాత కేశవ-మేదినీ సురవరుం
డా మహాత్ముఁడు వృద్ధుఁ-డై వెలుంగు
వజ్రదంతావనీ-వరుఁడు నీ పెదతండ్రి
వితత ధర్మాత్ముం, -డతని భార్య
తెలియంగ పుణ్యవ-తీమణి పెదతల్లి
కావలె నీకు, నా- కన్నపెద్ద

గీ. యనుచు నీరీతి భాగ్యవ-త్యాత్మజునకుఁ
దెలియఁ జెప్పిన తల్లిని- కలయఁ జూచి
యింక నేటికిఁ జింతిల్ల- నేగవలయుఁ
గడు రయంబున పయనమ్ము- గమ్ము లెమ్ము! 23

వ. అని యొండొరులు ధైర్యం బవలంబించి ప్రయాణ కార్యాలోచన మది
న్నిలిపికొని, విజయదేవుండు తల్లి కిట్లనియె 24

కం. జననీ! ముని యనుమతమునఁ
జనవలె బంధువ్రజముల- సదనంబునకున్
ఘనునకు తెలియమిఁ గోపము
జనియించిన శాపమిచ్చు- సత్యంబరయన్ 25

మ. ఒనరన్ యా నది దాటనేరక వడిన్- దండంబు మంత్రప్రయు
క్తిని తా బంపిన కరద్వయంబు బిగి-యన్ కీలింపఁగాఁ బెట్టియున్
తన పాదంబులఁ జేర్చ్వ జేసెను లస-త్కారుణ్యవారాసి యి
మ్మునిచంద్రుండు రయంబునన్ మనల నిం-పుల్మీఱఁగా మాతృకా! 26

వ. మఱియును 27

ఉ. ఘోరమృగంబులన్ వ్యథలఁ-గుందక నుండఁగఁ జేసెనమ్మ యి
ద్దారుణ దుర్గమస్థలినిఁ- దాపసవర్యుఁడు ప్రేమఁ దెచ్చెఁదా
గారముఁ జేర్చి వన్యఫల-కాండములన్ కడుఁ దృప్తిఁ బొందఁగా
నారునెలల్ సుఖస్థితిని- నాత్మజభావముచేత నింపుగాన్ 28

భాగ్యవతీ, విజయదేవులు దూర్వాసమహామునితో సంభాషించుట

వ. అని యిరువురు కరకమలంబులు ముకుళించి యమ్మునీంద్రునికి
సాష్టాంగ దండప్రణామంబు లాచరించి, "మహాత్మా! మీ కృపావలోక
నంబున షాణ్మాసంబులు నిరాయాసంబుగా జీవించితి మింక నుజ్జయినీ
పురంబున బంధువర్గంబులుఁ గల రచ్చటికింజనవలయు నాజ్ఞ దయ
సేయు" మనిన నతం డిట్లనియె 29

సీ. "చటుల సింహ వ్యాఘ్ర -శల్య భల్లుక కోల
వృక మర్కట క్రూర- మృగయుతంబు
కర్కశ కంటక- గణ సమాకీర్ణంబు
ఘోరలతాచ్ఛిన్న- కుంజబృంద
మగు నియ్యరణ్యంబు- నందుఁ బోవఁగఁ జాల
రెంత శౌర్యాత్మకు- లిద్ధచరిత!
మీ తల్లి సుకుమార- మృదుపాదయుగ్మంబు
యీ కర్కశస్థలి- నెట్లు నిలిచి

గీ. నడువ నేర్చును? యటుఁగాక- వడిఁ గలంగు
నీవుఁ జని వారి కుశలంబు- నెమ్మి నెఱిఁగి

యిచటి వృత్తాంత మంతయు- నచటఁ దెలిపి
పొసఁగ జనుదెంచిఁ దోలుక- పొమ్ము లెమ్మ! 30

కం. ఓ విజయదేవ! యిటువలెఁ
గావింపుము భయముఁ దక్కి- ఘనవేగమునన్
నీ వరిగి రమ్ము లెమ్మిక
గ్రావదరీతతులుఁ గడచి- కడు భద్రముగాన్" 31

## విజయదేవుఁడు దూర్వాసుని యనుమతితో ఉజ్జయినిలోని పెద్దతల్లి, పెద్దనాన్నను చూడబోవుట

వ. ఇట్లు ద్దూర్వాస మునీంద్రుం డాశీర్వదింప, సంతోషంబునుంబొంది, తల్లికి నమస్కారంబు గావించి, దీవనలుం బొంది, యమ్మునీంద్రునకు పరిచర్య నేమఱక ప్రతిదినంబు ఘటియించినే వచ్చు పర్యంతంబు ననుకూలంబుగా నుండుమని నూరడం బలికి, మార్గంబత్తపోధనుని వల్లఁ దెలిసి యుజ్జయినీ పథంబుఁబట్టి 32

ఉ. కొండలఁ గండుమీఱు మృగ-కోటుల మార్గమునందుఁ జూచుచున్
గండియ ఝల్లుమంచనఁగ- ఘోరమహావిపినస్థలంబులన్
యెండకు దప్పికిన్ సొలసి- యేర్పడ నాకటఁ గుంది నీరముల్
దండనఁ గానలేకఁ దన- తల్లిని నాత్మఁ దలంచి పోవుచున్ 33

సీ. తీక్ష్ణాతపంబుచే- ధృతి దూలి బంధుర
భూమిరుట్ఛాయలఁ- బ్రొద్దుఁ గడపి
గమనప్రయాపచే- శ్రమఁ జెంది వడిఁ గంది
కందమూలముల నా-కలి హరించి

మార్గంబుఁ గానక- మహాదరణ్యంబునఁ
గడు భిల్లకాంతల- నడుగుకొనుచు
ప్రొద్దు గ్రుంకిన వేళఁ- బెద్ద చీఁకటి చేత
ముని పర్ణశాలలఁ- దనర నిలిచి

గీ. దావపావక దం-దహ్యాభూధర తరు
ప్రకాండ వేణు చిటచిట-త్కారనాద
భీతి ఖగకుల నినద ప్ర-తీతవిపుల
గహ్వారంబు లరణ్యముల్- గడచిగడచి 34

ఉ. కొన్ని లసత్పురంబులను, -కొన్ని మహాశబరాలయంబులున్
కొన్నియు ఘోష భూస్థలులు, -కొన్ని మతంగిక పట్టణంబులున్
నన్నిటి దాటి త్రోవలకు- నడ్డము వచ్చెడి మర్త్యకోటిచే
తన్నగరంబు క్లుప్తతనుఁ- దప్పక వారలచే నెఱుంగుచున్ 35

వ. తదనంతరంబా విజయదేవుం డర్ధమాసంబునకు మహాప్రయాసలంజెంది నుజ్జయినీ పురంబుఁ జొచ్చి యచ్చటి మనుజ సంఘంబు వలన దన తాత క్షేమంబరసి పరలోకగతుండగుట నెఱింగి, దుఃఖవార్ధి మునింగి, కొంత ధైర్యంబవలంబించి, వజ్రదంతమహీపతిగృహంబు నకుం బోవనచ్చట 36

విజయదేవుడు వజ్రదంత మహీపాలుని ద్వారపాలకులచే అవహేళన పొలగుట

ఉ. ఈ యెడ కిట్టి రూపమున- నేటికి రాఁగత మేమి? నీకు పే
రెయ్యది? యేది పట్టణము? -యెవ్వరుఁ బంచిరి నిన్ను బోవఁగా?
దీయక వజ్రదంత ధర-ణీశుఁడు శిక్ష నొనర్చు నంచునున్
చయ్యన ద్వారపాలకులు- నడ్డము వచ్చిరి క్రోధమూర్తులై 37

వ. ఇట్లడ్డంబు వచ్చిన వారిం గనుంగొని, "యమ్మహీపాలుండును, నతని
భార్యయగు పుణ్యవతీలలామయు, మాకు బంధువర్గంబులుఁగావలె
నవశ్యంబు మీరు కటాక్షించి, మీపుత్రుండు విజయదేవుండు కాంచీ
నగరంబుననుండి చనుదెంచి ద్వారంబున నిలుచున్నవాఁడని
యెఱింగింపుఁడ"నిన వారలిట్లనిరి 38

కం. చూచినఁ దెలియదె యిప్పుడు
నీ చందము నీదు బలము- నీ గజఘుంటల్
గోచియు నీ యాకారముఁ
దోచదె బంధుత్వసంజ్ఞ- తొలుతనె మాకున్ 39

కం. అని యిటులఁ బలుకు వారలఁ
కనుఁగొని హాస్యములు సలుపఁ-గా నేటికి మీ
కనువొంద పుణ్యమయ్యెడి
వినిపింపుఁ డచట నాదు- వృత్తాంతంబున్ 40

గీ. వారిలో నొక్క గుణశాలి- నుండుమంచుఁ
బలికి చని పుణ్యవతితోడఁ- దెలియఁగాంచి
"పురవరంబున నుండి నీ- పుత్రకుండుఁ
దనర నేతెంచి యున్నాడు- ద్వారమందు" 41

చ. అనవిని తానుఁ జాల ప్రమ-దంబుధిఁ దేలి, "మదేభదివ్య వా
హన రథవర్గముఖ్య నివ-హంబులుఁ గొల్వఁగ వచ్చి యుండునే!
ఘనతరరత్నభూషణని-కాయము లొప్పఁగ దాల్చి యుండునే!
యనుపమ కాలవేది తన-యాగ్రణిఁ జూచిన ద్వారపాలకా!" 42

చ. పనుపడఁ జెప్పుమన్న, "నృప-భావ మొకించుక లేదు, మౌని వ
ర్తనమున నారచీర లొగిఁ- దాలిచి వెంబడిఁ దోడులేక ని
ర్జనమున వేణుదండము క-రమ్మునఁ బూనుక నీదు వాకిటన్
గొనకొని నిల్చినాఁడ" నిన- ఘోరవిషాదము నొంది కుందుచున్ 43

## పెద్దతల్లి పుణ్యవతి తనచెల్లెలి కుమారుని గుర్తించి లోపలికి తోడ్కొని పోవుట

ఉ. పుణ్యవతీలలామ మదిఁ- బొక్కుచు వెల్పొటి కేగుదెంచి నీ
పుణ్యము యింతకొచ్చెనని- పుత్రుని కౌగిటఁ జేర్చి భూరి సౌ
జన్యము తోడుతన్ నగరుఁ- జేరఁగఁ దోకొని పోయి యిమ్మహా
రణ్యము లెట్లు దాటి సుక-రంబుగ వచ్చితి మమ్ముఁ జేరఁగన్ 44

మ. గమనాయాసముఁ దీఱ మజ్జనము వే-డ్కల్ మీఱఁ జేయించి య
న్నముఁ గూరల్ నెయి పప్పు ధప్పళమునూ-త్నస్వర్ణపాత్రంబునన్
బ్రమఁ దీఱన్ భుజియింపఁ బెట్టి జలసం-పానంబుఁ గావించి వీ
డెము సంప్రీతి నొసంగి యాదరణవా-క్యస్ఫూర్తిచే నిట్లనున్ 45

కం. విలసిత రథగజభట సం
కులముల విడనాడి నార-గోచి ధరించి
ట్లలమటఁ బొందుట యేటికిఁ
దెలియంగాఁ జెప్పు విజయ-దేవ నిజముగాన్ 46

వ. అనుటయు నతండు దుఃఖపరవశాయత్తచిత్తుండై పెదతల్లి కిట్లనియె 47

## తండ్రి పిచ్చివాడగుట వలన తాము రాజ్యము కోల్పోయి అడవులపాలైతిమని విజయదేవుఁడు చెప్పుట

క. మా తండ్రి కామవేది మ
హీతల నాథుండు యెవ్వఁ-డెఱుఁగక యుండున్
ఖ్యాతిఁ జెడి వెఱ్ఱిచేఁ జనె
నా తక్షణ మందు మమ్ము- నాగ్రహవృత్తిన్ 48

సీ. శత్రువర్గంబులుఁ- జనుదెంచి పురిఁజుట్టి
ముట్టి సైన్యంబుల- మోదిమోది
రథవాజి మాతంగ- రాజిని నదలించి
ద్వారపాలుర వనిఁ- జేర దఱిమి
పరిచారకుల మారుఁ- బాయఁగ వెడలించి
సచివసంఘంబుల- సమయఁ జూచి
కోటలగ్గలఁ బట్టి- కూలంగ బడఁగొట్టి
ద్రవ్యగేహంబులు- తమ బలములఁ

గీ. గాపుగాఁ బెట్టి మమ్ములఁ- గాసిఁ బెట్టి
భూషణంబులు గ్రహియించి- రోషయుక్తి
నారచీరలుఁ గట్టఁగా- బాఱఁ జేసి
వెడల ద్రొబ్బిరి నగరంబు- వీరభటులు 49

కం. ఈ తీఱున బాధలఁ బడి
నా తల్లియు దుఃఖవార్ధిఁ- దగ మున్గి మహా
భీతిదమగు కానకుఁ జని
యేతెఱఁగునఁ బ్రాపుఁ గాన- కేడ్చుచు నెదుటన్ 50

కం. నదిఁ గాంచి దాట నేరక
మది ఖేదముఁ బొదల నచట- మౌనీంద్రుఁడు నిం
పొదవఁ దన చేతిదండము
విదితముగాఁ బంపి దాని- విడువకు మనినన్ 51

మ. అటుఁ గావించిన తక్షణంబున నిరా-యాసమ్ముగా మమ్ములన్
పటుగంభీరతరంగిణిన్ గడచి య-మ్మౌనీంద్రుపాదంబులన్
కుటిలంబేమియు లేక నిల్వఁగని తాఁ- గొంపోయి ప్రీతాత్ముఁడై
యుటజస్థానముఁ జేర్చి ప్రోచె దినముల్- యుగ్రాటవిన్ మాతృకా! 52

మ. తొలుతన్ జాల మజస్ర మొక్క ఘడియన్- దూర్వాసమౌనీశ్వ రా
డ్డళగేహంబు మృగేంద్ర పంచనఖ ఖ-డ్గ క్రోడ భల్లూక దు
శ్శలలీముఖ్యమృగాది భీతిని కడున్- షాణ్మాసముల్ వన్య స
త్ఫలముల్ యన్నముగాభుజించి తృణభూ-స్థానంబులన్ శయ్యఁగాన్ 53

వ. "మఱియు కానన దరీకుహరంబులుఁ గడవ శక్యంబుఁ గాదని మాతల్లిని యచ్చట నునిచి యిచ్చట మీ యునికిఁ దెలిసి వచ్చితి"ననిన దుర్వార తాపంబునుంబొంది, కొన్ని దినంబులు నిలుపుకొని, తదనంతరంబ 54

విజయదేవునకు విత్తకలశంబు నొసంగి పెద్దతల్లి సాగనంపుట

కం. ఆరయ పుణ్యవతీమణి
సారదయాయుక్తి మంచి- చలువవలువ లిం
పార సహోదరిసుతునకు
కోరిక మీఱంగ నొసఁగెఁ- గొమ్మని మిగులన్ 55

చ. సరస రసీ రసాన్నములు- చల్దులుఁ గాఁగ నొసంగి విత్త భా
సుర కలశంబు నాదరణం-బు చొప్పున నిచ్చి కుమారవర్య! నీ
విరవుగఁ దల్లియున్న కడ-కేగుము యెచ్చట నిల్వకన్ శుభ
స్కరముగ నిమ్మహాకఠిన- కాననసీమల భీతి చెందకన్ 56

వ. విజయదేవుండును పరమానందంబునుం బొంది యవ్విత్తకలశంబు శిరంబునం ధరియించి, మార్గంబుఁబట్టి, కొన్ని యోజనంబులు చని, పోవు నయ్యెడ 57

విజయదేవుని విత్తకలశమును ఒక పెద్ద డేగ తన్నుకొని పోవుట

సీ. స్ఫుట గరుద్భవ మరుత్క్షో-భవన్నికట భూ
ధరధరా రుడ్శిఘా-తతగణంబు
గంధవాహక బంధు- బంధుర గోయుగ్మ
దర్శిత ధావత్ప్ర-తంగకులము
తుంగలాంగలి మహా-త్రోటి నిక్షిప్త లం
చిత భూరి విలసిత- పిసితఖండ
మతితర కహకహా- హ్రాద ప్రతిధ్వాన
భీషణగిరిదరీ- బిలతటంబు

గీ. జవ సమాటోపగృధ్రరా-జంబు భుస్సు
రంచు వినువీథినుండి యే-తెంచి విజయ
దేవ మస్తక నిక్షిప్త- దివ్యవిత్త
కలశ మెత్తుకఁ జనె భీతిఁ- గదురుచుండ 58

మ. అహహా! యీ విధి నేమనంగ వలయు-న్నత్యంత దుఃఖంబు చే
మహదైశ్వర్యము శత్రుకోటులకు వే-మారున్ సమర్పించి యీ
గహనంబుల్ కడతేటి బాంధవ సదా-గారంబునన్ నిష్కముల్
గ్రహియింపన్నవి దక్క నేర వకటా! -గ్రహచారదోషంబునన్ 59

ఉ. ధిమ్మరుపాటునన్ గగన- దిక్తటులన్ బరికించి గృధ్రరా
జమ్మునుఁ జూచి నన్నచట- చక్కఁగఁ గానఁగ రాక యున్నఁ జో
ద్యమ్మున కామవేదితన-యాగ్రణి భీతిలి యింకనెట్లు కా
ర్యమ్మొగి నిర్వహింపఁ గల-దంచుఁ దపించు మనంబు లోపలన్ 60

వ. తదనంతరంబ, ధీరమనస్కుండై దూర్వాసాశ్రమంబునకు రిక్తహస్తంబు
నం జనినఁ జననీమౌనులుఁ గన్గొని, "యేమి తెచ్చువాఁడవని
యడిగిన నేమి చెప్పఁగలవాఁడ"నని విత్తరహితుండై తిరిగి పుణ్యవతీ
గృహంబునకు వచ్చి నిలుచుండం గనుంగొని 61

ఇచ్చిన ధనమును పోగొట్టుకొన్న విజయదేవుడు మరల పెద్దతల్లిని
పోయి చూచుట

కం. ధనము నొసఁగినఁ గొని చని
పునహా రాగత మేమి? -పుత్రక తెలియన్
వినిపింపుము దీనత్వముఁ
బెనఁగొనఁగా నేలి ధీర-భావము చేతన్ 62

చ. వినమిత మస్తకుండగుచు- హస్తయుగిన్ ముకుళించి యిట్లనున్
ధనకలశంబుఁ బుచ్చుకొని- దారుణ కాననసీమ లోపలన్
జననొక గృధ్రరాజు రభ-సంబున విత్తముఁ దన్ని యెత్తుకన్
జనెను మహాద్భుతాకృతిని- సత్యము యో జననీ! రయంబునన్ 63

వ. అనిన పుణ్యవతీలలామ వేరొక్క విత్తకలశంబు నాదరణయుక్తి నొసంగి, లవణాపూపదధ్యోదన ప్రముఖ వస్తువిశేషంబుల చల్దులుఁ గట్టి, "నీవు మార్గంబునఁ బోవుచు భుజియింపు" మని యిచ్చి పంపిన 64

పుణ్యవతి మరల నిచ్చిన విత్తకుంభము నదిలో కొట్టుకొని పోవుట

చ. చనిచని కొంతఁ దూగున వి-శాలతరంగతరంగిణిన్ గనుం
గొని భుజియింపఁ గోరి ధన-కుంభము నొడ్డునఁ బెట్టి మజ్జనం
బొనరఁగ సల్పి చల్దిఁ దిన- నుత్సుకతన్ వెసఁ గూరుచున్నచో
మునుకొని తత్తరంగములు- మ్రోయుచు వేఁగొని పోయె లోనికిన్ 65

చ. అది గని భూరిశోకమున- నారట మొందుచు బాహుయుగ్మముల్
పదములు మేన్వడక నదిఁ- బాసి భుజింపఁగ దైవమిట్లుసే
యఁ దగునే భాగ్యహీనునకు- నక్కట నొక్కట రెంట విత్తసం
పద చెడునట్లుగా ననుచు- భాగ్యవతీతనయుండు భీతుఁడై 66

ఉ. తల్లినిఁ జేరఁ బోయిన వృ-థా పని యౌనని మళ్లి నేను పె
త్తల్లినిఁ జేరబోయినను, -ద్రవ్యమొసంగునొ, క్రోధదృష్టిచే
మెల్లగ వెళ్లి పొమ్మనునొ, -మీఁదటి కార్యము నెవ్వ రైనచోఁ
దెల్లమిగా నెఱుంగుదురె- దేవతలైనను బ్రాప్తమెట్టిదో! 67

మూడవసారి వచ్చిన విజయదేవుని వలన జరిగినదంతయు విని వానిచే కేదారేశ్వరవ్రతము చేయించి, తోరముఁగట్టి ధనకలశము నిచ్చిపంపుట

కం. అని మనమునఁ దలపోయుచుఁ
జని పుణ్యవతీ గృహంబుఁ- జయ్యనఁ జేరెన్
గనుఁగొని,"తిరిగి యిటు రాఁ
బనియేమి కుమారవర్య! -పలుకు నిజముగాన్" 68

వ. అనినన్ తల్లిని జూచి యవ్విజయదేవుండు నయనంబుల నశ్రుజలం
బులుఁ గదుర నిట్లనియె 69

కం. "అమ్మా! విత్తముఁ గొని మా
ర్గమ్మున వెసఁ బోయి పోయి- కడునాఁకటిచే
సొమ్మసిలి చల్దిఁ గుడువఁగ
సమ్మతి నొక యేటి పొంత- సంతోషముగాన్ 70

ఉ. నిష్కమయంపుఁ గుంభము వి-నిశ్చలతన్ యటు నిల్పి పొల్పుగా
శుష్కలికోదనంబు మది- సంతసమంద భుజింపుచుండఁగా
దుష్కరవాహినీ జనిత- తోయతరంగము లుబ్బి ప్రబ్బి త
న్నిష్కమయంపుఁ గుంభము ఖ-ణిల్లున వేఁగొని పోయె లోనికిన్ 71

వ. అని చెప్పిన నాశ్చర్యమానసహృదయయై సంతాపంబునొందుచు
నిట్లనియె 72

ఉ. "మౌళిజనాళి కెప్డు డవ-మానముఁ జేసిన వార లుగ్రులై
మానసమందు నొచ్చి క్షణ-మాత్రమునన్ బహుభోగభాగ్యముల్
మానిత రాజ్యచిహ్న చెడు-నంచు శపించిరొ మిమ్ము పుత్రకా!
కాని యెడన్ ధనంబు సుభ-గస్థితి నీకు నదేల దక్కదో! 73

వ. అని తక్షణంబ తన పురింగల సకల జ్యోతిష్కుల, విప్రజనంబుల,
రప్పించి సాదరసల్లాపంబుల కాంచనాసనంబులం గూర్చుండ
నియమించి, "యివ్విజయదేవునికి రాజ్యభ్రష్టత్వంబు సంభవించి
యిచటికిఁ జనుదెంచిన నిరుమారులు ధనంబిచ్చి పంచిన నది
దక్కనేరదయ్యెఁ గావున నతనికి గ్రహచారం బెట్లునున్నదో బరికించి

తద్దోషం బపరిహారంబుగా నెయ్యే దానంబు లొసంగవలయునో
నిశ్చయించి తెలుపుండ" నిన వారలిట్లనిరి 74

ఉ. "నిశ్చయమమ్మ పుణ్యవతి! -నీ తనయాగ్రణికిన్ గ్రహావళుల్
దుశ్చర భావఘోరతర-దోషము లేదిటు లెన్ని చూడ నం
ధశ్చర కేతుగర్వ రవి- భాసిత నామక సద్వ్రతంబు ము
న్నిశ్చల భావ మించుకయు- నిల్పిన వే త్యజియించు దానిచేన్ 75

గీ. అరయ భాగ్యంబు చేకూర-దమ్మ యెవ్వ
రొసఁగి రేనియు వీరికి- నుగ్రగతుల
వ్రతము హరియించు దోషమ్ము- వితత మహిమఁ
జేసి చేసిన వారికి- సిద్ధి కలుగు 76

వ. అని యివ్విధంబున నా విప్రకోటులు చెప్పిన విని యబ్భాగ్యవతీలలామ
విజయదేవున కిట్లనియె 77

కం. నీ తల్లి వ్రతముఁ జేయునె
ప్రీతిగఁ బ్రతివత్సరంబు- శ్రీకర తోరం
బాతతముగఁ గరమున వి
ఖ్యాతిగ ధరియింప నీవుఁ- గంటివె తనయా! 78

చ. అన నతఁ డిట్లుఁ బల్కె నిజ-మమ్మ! కరమ్మున తోరమిమ్ముగా
ఘనముగఁ దాల్చియుండ నొక-కాలమునన్ కడుఁ గ్రోధదృష్టి మ
జ్జనకుఁడుఁ గాంచి వల్దనుచు- సారెకుఁ జెప్పిన నొప్పకున్నఁ ద్రెం
చెను వడి నీదు చెల్లియలు- చిత్తము భీతిలి యేడ్చుచుండఁగాన్ 79

వ. అని చెప్పిన నాత్మగతంబున 80

మ. అరయన్ పూర్వము యీ వ్రతంబు కడు నే-మాసక్తిచేఁ జేయఁగా
గిరిజానాథుఁడు యానతిచ్చె నడుమన్- క్రూరాత్ములై మానినన్
సిరులెల్లం జెడునంచు సాగరమతిన్- సిద్ధం బమోఘంబు యీ
వర సద్వాక్యము యేకవింశతి మహా-వర్షంబు లేతేరమిన్ 81

వ. అని యివ్వ్రతంబు సాంగంబుగాఁ జేయించి, విజయదేవుని చేతననేక దానంబులు భూసురకోటికి భక్తిపూర్వకంబుగా నిప్పించి, కరంబున తోరంబుఁ గట్టి, తత్కథాక్రమంబు వినిపించి, మంత్రాక్షతలు శిరంబున నిడి, నూతన వస్త్రమాల్యాదులు ధరింప నియమించి, రసీరసాన్నములు భుజియింపఁ బెట్టి, యొక్క మహనీయ నిష్కకలశంబు నొసంగి, మీ తల్లి యున్నయెడకేగుమని పంచినఁ జని చని 82

## అడవిదారిలో పోవుచున్న విజయదేవునికి డేగచే యెత్తుకొనిపోబడిన ధనకలశము లభించుట

కం. విత్తముఁ గొని యిచ్చట మును
తత్తరమునఁ బోవుచుండ- దారుణగతి చే
మత్తపటు గృధ్రరాజము
యెత్తుకఁ జనె నాత్మభీతి- యినుమడిఁ గాఁగన్ 83

వ. అని మనంబున దలంచి, గగనమార్గం బుపలక్షించిఁ జూచుచున్న యవస రంబున, దైవయోగంబునఁ బూర్వాపహృతంబగు ధన కుంభంబు తన యెదుటఁ బడిన, పరమానందంబునొంది దాని గ్రహియించిపోవుచు 84

గీ. భూమి భృఙ్జామనో-నాథ నామక వ్ర
తం బమోఘంబు భాగ్యప్ర-దంబు విడువఁ
జెడుట ధరనెవ్వరికి నైనఁ- జిత్రమగునె!
చేసిరేనియు విభవముల్- సిద్ధిఁ గలుఁగు 85

చ. ఎనయఁగ నీ వ్రతంబు ఘటి-యించిన దానఁ గదా! వినష్టమౌ
ధనము లభించి చేకొనుట- తథ్యమటంచు మదిందలంపుచున్
జనిచని కొంతదూరమునఁ- జక్కఁగఁ గన్గొనె సత్ప్రవాహమున్
ఘనతరమత్స్య కచ్ఛప పి-కగ్రహముఖ్యసమూహమున్ తగన్ 86

నదీతీరమును చేరిన విజయదేవునికి తాను పోగొట్టుకొన్న రెండవ ధనకలశము లభించుట

ఉ. ఈ స్థలి నాకటన్ సొలసి- యింపుగ నన్నము నారగింపుచో
దుస్తర తుంగభంగముల- తొట్రుపడన్ ధనకుంభమీడ్చుచున్
ప్రస్తర ఘట్టితధ్వనుల- బాపురె! వేగొని పోయెనంచుఁ దా
హస్తముఁ జూపునంతటనె- నక్కలశంబును వైచె ముందటన్ 87

వ. అవ్విజయదేవుండు, కందళితహృదయారవిందుండై, దానిఁబరిగ్రహించి, యవ్వ్రత మాహాత్మ్యంబు మదిం దలపోయుచు కలశత్రయంబుఁ దీసుకొని, "యిమ్మహారణ్యంబుల జాగుసేయుట కర్తవ్యంబుకాదు మజ్జననిం జేరవలయు "నని తీవ్రగమనంబున దూర్వాసాశ్రమంబునకు వచ్చుచుండె నచ్చట కామవేది మహీపాలుండు 88

కామవేదికి కొంత మనఃస్థిమితము చేకూరగా కాంచీపురములో
సింహాసనమునకై కల్లోలము చెలరేగుట

గీ. తనదు యున్మాద మించుకఁ- దిరిగితిరిగి
దైవయోగంబుచేతను- మించికాంచి
పురసమీపంబు కేతెంచి- పొలుపు మించి
శిథిలదేవాలయంబునఁ- జేరియుండె 89

సీ. కడుమున్ను తన పురి- గ్రహియించి మించిన
మేదినీనాథుండు- మృతినిఁ జెందె
నతనికి సుతుఁ డొక్కఁ-డైనలేమియుఁ జేసి
భవ్యమౌ రాజ్యసం-పత్తిఁ గోరి
వాని దాయాదులయిన- మానవేశ్వరు
లనేకులు కలహించి- కలఁగి కలఁగి
తనకుఁ గావలెనంచుఁ- దనకుఁ గావలెనంచుఁ
దనకుఁ గావలెనంచుఁ- దగ మదించి

గీ. నిశిత శరజాలముల హేతి- నిచయములను
పరశు పట్టిస శూల ము-ద్గర ముఖా యు
ధముల ముంచుచు నొంచుచు- నమితగతుల
నల్లకల్లోలమై యున్న- యవసరమున 90

ఉ. అప్పుడు మంత్రివర్గములు- నాశ్రితకోటులు నడ్డగించి, "మీ
కొప్పునె యింతకార్యమున- కుగ్రగతిన్ సమరంబుఁ జేయఁగాఁ
దప్పక నవ్వరే జనులు- ధారుణి భూపతులార! దానికిన్
గుప్పున మేము సంధి యొన-గూర్తుము చాల వినుండు నెమ్మదిన్" 91

## ఏనుగు తొండమునకు పూలదండను యిచ్చి అది యెవరికి వేసిన వారు రాజగుదురని పెద్దలు నిర్ణయించుట

ఉ. భూతలమందు పెద్దలొగిఁ- బోయిన మార్గము చాల నీకు సం
ప్రీతిగ విస్తరించి విను-పింతు మటంచనుఁ బల్కి రుద్ధతిన్
ఖ్యాతిగ వార్జనుర్జసన-కాండ లసత్కచపాదఘంటికా
వ్రాత ఘణంఘణంఘణ వి-రాజితనాదము లుప్పతిల్లఁగాన్ 92

గీ. గజము శృంగార మొనరించి- కలశమిచ్చి
విడువ నది నెత్తుకొను వాఁడె- విభుఁడు మహికి
ననిన వారలు సంతోష- మంది పొంగి
వనర నటుఁ జేయమన మంత్రు- లుత్సహించి 93

వ. మఱియు నొక్క మహనీయ పరిశుభ్ర దంతావళంబునకు దివ్య విభూషణంబులలంకరించి, గంధాక్షతలు ముఖంబుననిడి, సహస్ర ఘంటి కాలంబిత కంధరంబు పృష్ఠభాగంబున నునిచి, శాతకుంభ స్తంభసంభృత మంటపంబు తత్ప్రదేశంబున నిలిపి, పూర్ణనిర్మల కనకకుంభంబును కుందమందార కేతకీపాటలిప్రముఖ నిఖిల సుమమాలికలను కరంబునఁ గీలించివేదవిధానంబు గాఁ బూజించి, ధర్మదేవతం దలంచి నిగళంబులు సడలించిన, ఘణఘణత్కారనాదంబున రాజమండల మధ్యంబున మెల్ల మెల్లన నడచుచు పార్థివాగ్రేసరులు రాజ్యకాంక్షులై తన యెదుటికి రాగాఁ దొండంబునం తొలంగంద్రోయుచు, సమస్త జనంబులు నాశ్చర్య మాన మానసులైఁ జూచుచుండఁ బురంబువెడలి, కామవేది యున్న శిథిల దేవాల యంబుఁ జొచ్చి, కలశంబునంగల జలంబులు శిరంబునం జల్లి, పుష్పమాలికలు కంఠంబున నునిచి, తన యంతికస్థలిం గూర్చుండ బెట్టుకొనిన యవసరంబున 94

చ. వ్రణక్రిమి దేహమెల్లఁ బటు- వజ్రమయంబుగఁ దోచె దివ్య భూ
షణ గణ మంగరాజి విల-సద్గతిఁ గానఁగ వచ్చె, వచ్చినన్
మణి సకలాపజాల సిత- మత్తగజేంద్రము వేడ్క నెక్కి నిం
ద్రుని గతి కామవేది జగ-తీతలనాథుఁడు చాల భాసిలెన్ 95

ఉ. కన్నులు విచ్చి చూడ ఘన-కాండము లంగము వ్రచ్చు మాడ్కి నా
సన్న విపక్షవర్గములు- చక్కఁగ శీర్షములెత్తి చూడ నా
పన్నతఁ బొంది మోముఁ గన- భాసుర భాస్కర బింబదర్శనా
చ్ఛిన్నవిభిన్న లోచనతఁ- జేకొని చూచిరి కామదేవతన్ 96

భద్రగజము శిథిలదేవాలయమునందున్న కామవేదికంఠములో
పూలదండను వేసి సింహాసనాసీనుని చేయుట

వ. అతిత్వరిత గమనంబున నబ్భద్రగజంబు కొలువుకూటంబున కేతెంచి
సమంచిత కాంచన పంచముఖాసనంబునఁ గూర్చుండఁ బెట్టిన 97

కం. భాసుర మణిపీఠిని జం
భాసుర మర్దనుఁడు వెలయు- పగిదిని వెలసెన్
తా సంతోషము బాఱఁగ
నా సమయము నందు మా-నితాసనగతుఁడై 98

ఉ. కష్టదశాగతిం బడుచు- కాలము వెళ్లఁగఁ ద్రొబ్బుచుండు ను
త్కృష్టదరిద్రవర్తనత- దీనతఁ బొందిన బంధువర్గముల్
నష్టవికష్టులై ముదము-నన్ బహుశస్త్రగణంబుఁ బూనుకన్
యిష్టము మీఱఁ గొల్వు కడ-కేగి మహాద్భుతలీలఁ గొల్వఁగాన్ 99

వ. అప్పుడక్కామవేది మహీమండలాఖండలుండు, ప్రచండచండ కిరణ మండలంబు లీలం దండుమీఱు ముఖకాండజంబున నవష్టంబ విజృంభ మానమానసుండై, దండిగల తన దోర్దండంబున కాండజాననంబు ధరియించి కాండప్రకాండంబులు శత్రు మండలంబుల గుండియలు ఝల్లు మనఁగా, మహోద్దండతం బఱపినఁ బాదంబులు తొడిబడి యడుగిడ నైజములేక గడగడవణంకుచు, పిడుగుల వడువున వడివిడిఁగల సాయ కంబులకు రోయుచుఁ బాయుచు, బదుల్వేయ నుపాయంబు లేక నాహా రవంబుల నిర్లజ్జులై వికసిత కుసుమ భరిత పలాశ ధరణీరుహంబుల లీల రక్త సిక్తగాత్రంబులన్ పురంబువెడలి, గిరిదరీగహ్వారంబులఁ దాగువారును లతాకుటీరంబుల కేగువారును, నెందునైనం సందుగానక క్రందువడి పరిగెత్తువారునునై, చీకాకుఁ బొందంజేసి తన బలంబులఁ గోటపై నీటుగ కావలియుంచి, సకల మిత్రాశ్రిత పరిచారకజనంబుల నాదరించి, కలఁగన వాని విధంబయ్యెనని దలంచి, దన భార్యాసుతులం దలంచి, రాజ్యంబు జేయుచుండి యాత్మగతంబున 100

చ. కటకట! యెంత కష్టముల- కాననసీమల వేగి భీతిచే
పటుకిటి ముఖ్యక్రూరమృగ-బాధలఁ జెందుచుఁ దావుఁ గానకన్
యెటు నిలుచుండిరో! యెవరి- యందుఁగృపామతిఁ గల్గి బ్రోచిరో!
తటుకున నాకటన్ సొలసి- దప్పినఁ గుందిరొ దారుణంబుగాన్ 10[illegible]

వ. అని తనయునిం భార్యందలంచి దుఃఖింపుచున్న యవసరంబున 10[illegible]

కామవేది మహీపాలుఁడు మరల రాజ్యప్రాప్తినొంది భార్యాపుత్రుల వెదికించుట

కం. ఆలోచనఁ జేయఁగ నీ
కేల మహీపాల! -చాల నిప్పుడు నీ

యి ల్లాలిని సుతునిన్ వెతికెద
మాలస్యము లేక సేయు- మాజ్ఞ నిజముగాన్ 103

వ. అనుచు మంత్రివర్గంబులు కరపద్మంబులు ముకుళించి పలికిన
నిట్లనియె 104

సీ. మఱియు సంతోషించి- మంత్రివర్గంబుల
కాజ్ఞ నొసంగె న-య్యవనివిభుఁడు
తక్షణంబున వారు- దండంబు లొసఁగి వే
గంబున రథవాజి-గజగణముల
నెక్కి చతుర్దిక్కు- లీక్షింతుమని చని
సకల దేశంబులు- సకలపురము
లందుఁ బల్లెల యందు- నరసిచూచినఁ గాన
రామికిఁ గొంతదూ-రంబు నేగి

గీ. యెచ్చటనుఁ గానఁగా లేక- యలసి సొలసి
చిన్నవోయిన మోముల- చేత దిరిగి
యరయ కాంచీపురంబున- కేగుదెంచి
కలయ ధరణీశుఁ గనుఁగొని- పలికిరపుడు 105

కం. నీ యాజ్ఞఁ బూని నృపవర!
చయ్యనఁ జని భూమిఁ గల్గు- సకలపురంబుల్
నీ యాన తిరిగి కానక
నయ్యా నీ భార్య సుతుల-నన దుఃఖమునన్ 106

కం. పగవారి చేతc బెట్టుగc
దెగిరో యటుc గామి విపిన-దేశములోనన్
యగణిత శార్దూలాదిగ
మృగములచే లేక తాము- ౹మింగంబడిరో! 107

వ. ఇట్లు చింతిల్లుచున్న సమయంబున 108

నారదమహర్షి కామవేది ఆస్థానమునకు వచ్చుట

కం. కరమున వీణాదండము
కర మనురాగమున మెఱయ- ఘనఘనలీలన్
సరసిజ భవభవుc డింపుగ
సరసీజోదర కథాప్ర-సంగము మెఱయన్ 109

వ. వచ్చుచున్న యవసరంబున సభాసదులగు జనంబుల నవలోకించి 110

కం. హరికీ గతి బహురయమగు
నురుతర దీప్తాగ్ని కడరు- నూర్ధ్వజ్వలన
స్ఫురణయు కాంతులధస్థలి
కిరవొందcగ నేగుదెంచు- నెవ్వcడు దెలియున్ 111

కం. కాంచన సూత్రాకలితో
దంచన్మధ్యుండు పాండు-రాకృతి నీల
ప్రాంచిత నేణాజిన తనుc
డంచుక మునివరుని లీల వెలి-గించుcదగన్ 112

గీ. అరయ డోలాయమానసు-లగుచుఁ జూచు
చుండ నారదుఁ డేతెంచి- సొబగు మించి
నృపవరేణ్యుని ముందట- నిలుచునంత
ఫాలమంగుష్ఠములు సోక- బ్రణుతిఁ జేసి 113

వ. కాంచనాసనంబునఁ గూర్చుండ నియమించి కరంబులు ముకుళించి యిట్లనియె 114

చ. ఇరవుగ మీరు మున్ను వచి-యించి తిరుజ్జయినీ పురంబునన్
వరగజయాన గల్దనుచు- వారక తద్వనజాక్షి పెండ్లియై
పురమున కేగుదెంచి ముని-పుంగవ కొన్ని దినంబు లేగఁగాఁ
గరమునఁ దోరమూనఁ గని- క్రౌర్యమునన్ త్యజియింప దానిచేన్ 115

## నారదమహర్షి, దూర్వాసమహర్షి ఆశ్రమములో భాగ్యవతీ, విజయదేవులున్నారని తెల్పుట

వ. బహుకష్టంబులం బడి దైవయోగంబునను, భవదాశీర్వచనంబునను, రాజ్యంబు పునః లభియించె, నస్మత్పుత్రదారాదులం గానక చింతా పరవశాయత్తచిత్తుండనై యుండెద. మీరు త్రిలోకంబులంగల వృత్తాంతంబు లెఱుంగుదురు గాన వారెచ్చట నుండుదురో యెఱింగింపుఁడనిన నమ్ముని వరుఁడు నజ్జనవరునిం గనుంగొని దూర్వాసాశ్రమంబునం గలరని తెలియఁ జెప్పి చనియె; నప్పుడు 116

## కామవేది స్వయముగా దూర్వాశ్రమమునకు వెళ్ళుచు దారిలో కుమారుని కలసి జరిగినది తెలుసుకొని కేదారేశ్వర వ్రతమాహాత్మ్యము నెఱుంగుట

మ. అరయన్ మోదముఁ బొంది తాను నిజభా-ర్యానీతసోద్యోగుఁడై
వర తీవ్రాశ్వ గజేంద్రసైన్యరథవ్రా-తంబు లేతేరఁగా
ధరణీభారము మంత్రివర్గముల వేఁ- దాల్పంగ నొప్పించి య
ప్పురరాజంబు హుటాహుటిన్ వెడలె సం-పూర్ణానురాగంబునన్ 117

సీ. పటుఘోట ఖురరజః-పటలంబు గగనంబు
చండభాస్కర క-రనికరమణఁప
చక్రఘణత్కార- చటులనాదమ్ముచే
తగ గుహావళి ప్రతి-ధ్వను లొసంగ
సింహవిక్రమవీర- సింహారవంబుచేఁ
దెగి క్రూరమృగములు- దిశల కుఱుక
సామజకర్ణసం-చలిత మారుతహతి
పక్షివర్గంబులు- పరువులెత్త

గీ. విపుల చతురంగములుఁ గొల్వ- వేడ్కమీఱఁ
గామవేదిక్షితీశుండుఁ- గడు రయమున
గొండలగుమి నొక్కొక్కటి- గడచిగడచి
పోవుచుండఁగఁ ద్రోవలోఁ- బొసఁగ నెదుట 118

కం. శిరమున ధనకలశంబులుఁ
గరమున దండంబుఁ బూని- కడుడస్సిన వా
ని రయంబుగఁ దన సుతునిన్
కరమరుదుగఁ గాంచె బాష్ప-కలితేక్షణుఁడై 119

మ. తనయా! యెక్కడనుంటివిన్ని దినముల్- తాపస్థలిన్ మౌని వ
ర్తనముం బూని కఠోరఘోరమృగబా-ధం గుంది దీనాకృతిన్

త్పణ దుష్కంటక బాధకోర్చి వనవీ-థిన్ నాకటంగుంది త్వ
జ్జననీక్షమముఁ గాగఁ దెల్పుమిక ల-జ్జాహీనతల్ మానఁగాన్ 120

ఉ. దీనతఁ బల్కె నవ్విజయ-దేవుఁడు బాష్పజలాక్షికూలుఁడై
తా నొగిఁ గేలు మోడ్చి మది- దద్దయుఁ బెద్దయుఁ బొక్కిమిక్కిలిన్
"మానవనాథ! శాత్రవులు- మానితరాజ్యము నాక్రమించి ర
య్యా! కడు వెట్టిఁ బట్టి చను-నప్పుడు దారుణలీలఁ బెట్టుగాన్ 121

మ. అటుఁ బోనీయక కాంచిపట్టణముఁ బా-యన్ తల్లికిన్ నన్ను యా
కుటిలాత్ముల్ వెడలంగఁ ద్రోయ సిరులన్- గోల్పోయి ఘోరాటవిన్
చటుల వ్యాఘ్ర వరాహ మత్తగజ పం-చాశ్యాచ్ఛభల్లాది కో
త్కట బాధంబడి గాపుఁగానక మన-స్తాపంబునుం బొందుచున్ 122

కం. చనిచని ముందట ఘననదిఁ
గనుఁగొని నది దాట నేర-క నతిభీతిన్
మనమున ఖేదముఁ గొననొక
మునిపతి తన బాహుదండ-మున దాటించెన్ 123

గీ. జనక! దూర్వాస మునిపర్ణ-శాల యందు
దెలియ మా తల్లి నింపుగా- నిలిపి పెద్ద
తల్లి కడకేగి దీనత్వ-మెల్లఁ బాపి
ధనము లినుమారొసంగిన- దక్కకున్న 124

వ. పునః జనిన నాశ్చర్యంబునుం బొంది, భూసురులవలన వ్రతభంగం
బగుట నెఱింగి, తద్వ్రతంబు నా చేతఁ జేయించి రప్పుడు 125

ఉ. "విత్తమొసంగి, పొమ్మనిన- వేగమె వచ్చుచునుండ, నష్ట మౌ
విత్తము ప్రాప్తమైనఁ గొని- వేడుకమీఱఁగ నిన్నుఁగంటి నా
చిత్తము పల్లవింప నృప-శేఖర! యిప్పుడ" నన్ ముదంబునన్
మత్తగజంబుపై సుతుని మక్కువ నుంచియు సైన్యయుక్తుఁడై 126

కం. కేదారవ్రత మింపుగ
నాదరణన్నీవు సేయ- నాత్మజ! కఠినో
న్మాదము మాని మహీస్థలి
పాదుగ లభియించె మనకు- భవు కృపచేతన్ 127

గీ. ఇది యమోఘంబు మదిలోన- ముదము గదుర
జెడుటఁ గానక త్యజియించి- చెడితి ననఘ!
యింక ప్రతివత్సరంబు దు-శ్శంక దక్కి
పరగఁ గావింపవలయును- భక్తి యుక్తి 128

వ. మఱియును 129

ఉ. హస్తి సురారిమర్దన మ-హాత్మ్యమమోఘము కేశవాత్మజా
హస్తి సమానసద్గమన- హస్తయుగిన్ ముకుళించి భీతిలెన్
హస్తముఁ బట్టి తోరమహ-హా! త్యజియింపఁగ వల్దటన్న వి
ధ్వస్తముఁ జేయ నాపదలఁ- దార్కొనియుండుట చిత్రమేపడిన్ 130

చ. గొనకొని దండధారుఁడు మృ-కండుకుమారునికై మదించి యా
వనజవిరోధిమౌళి గృహ-వర్తనుపాశము వేసి గాసిచే
సిన హరుఁడల్గి తన్నుఁ గడు-శిక్ష యొనర్పఁడె మున్ను చెప్పరే
యెనయఁగ తన్మహామహిమ- లెన్నఁగ శక్తులె యిమ్మహాస్థలిన్ 131

శా. గర్వస్ఫూర్తిని మున్ను దక్షుఁడు శివున్- గాక్షింపకన్ యజ్ఞమున్
దుర్వారంబుగ దేవతాగణము సం-తోషింప దాఁ జేయుచో
శర్వుండల్గి మహాద్భుతాకృతిని రో-షజ్జ్వాలలుప్పొంగఁగా
సర్వంబున్ దెగటార్పఁడేమఖము భా-స్వద్భూసురుల్ బల్కఁగాన్ 132

మ. ఒనరన్ దాము దరిద్రవర్తనమునన్- యూహించి సేయంగలే
కను శోకంబునఁ జెంద శంకరుఁడు వే-డ్కన్ యీవ్రతంబింపుగా
గనుఁ జేయించిన భోగభాగ్యములచేఁ- దళ్కొందరే మున్ను నీ
జననీద్వంద్వము నాత్మతోషమొదవన్- సత్యంబువో పుత్రకా! 133

వ. అని యనేక రీతుల కామవేదిమహీపాలుండు తనసుతునిన్ పునః పునరా
లింగనంబు సేయుచుఁ, దద్వ్రతమాహాత్మ్యం బుగ్గడింపుచు, ముందట
మహోతరంగతరంగిణిం గడచి, దూర్వాసాశ్రమంబు దరియంజొచ్చి, సకల
సైన్యంబుల నచ్చటచ్చట నిలిపి, కుమారయుక్తుండై నమ్మునీంద్రునకు
సాష్టాంగదండప్రణామంబులు గావించి, నిలుచున్న యనంతరంబ విజయ
దేవుండు కరకమలంబులు ముకుళించి యమ్మునీంద్రునిం గాంచి,
యిట్టులనియె 134

విజయదేవుడు దూర్వాసమహర్షి ఆశీర్వాద మహిమను ప్రశంసించుట

కం. మునివర్య! నీదు యాజ్ఞన్
జని యుజ్జయినీపురమున- సకలబంధువ్రజమున్
గనుగొంటి వ్రతముఁ జేసితి
ధనమొగి లభియించె, నాదు- తండ్రిన్ గంటిన్ 135

వ. భవత్కృపాకటాక్షవీక్షణంబులు మాయందు నిలుపుటంగాదె శత్రుమండలం బులఁ జండగతిం జెండివైచి, సకల మహీమండలంబు చేకూరి పురంబుం జేరి మీ యాశ్రమంబున మేమున్న యునికిఁ దెలిసి సకలసైన్యసమేతుండై మజ్జనకుండు వచ్చియున్నవాఁడని తెలియంజెప్పి నిలుచున్నయెడ 136

కం. మునిభార్యాయుతమతియై
[1]పరిచారకవృత్తిఁ- బూని భాగ్యవతీ స
ద్వనజాక్షిసుతుని మాటలు
విని పర్ణాగారమధ్య-వీథి నిజముగాన్ 137

కం. పరిపరికన్నుల జలములు
వెలువుగ వెడలంగ సుతుని- విభునిన్ సైన్యో
త్కరమును పర్ణాగారము
త్వరితముగా వెడలి తపసి- దండనగాంచెన్ 138

## దుర్భర దుఃఖమునుండి విడుదల పొంది పుత్రసహితులైన భార్యాభర్తలు ఆనందించుట

ఉ. ఎక్కడ వెళ్ళిఁబట్టుట మ-రెక్కడ నిన్ను గనుంగొనంగ యే
మెక్కడ కాననస్థలము- లెక్కడ నక్కట యీ విధాత్రుఁడీ
దిక్కున సర్వసైన్యము లు-దీర్ణతఁ గొల్వఁగ వచ్చునట్లుగా
మిక్కిలి పూర్ణదృష్టిఁ దగ- మెచ్చెనె హెచ్చుగ ప్రాణనాయకా! 139

వ. అని యనేకరీతుల తమ దుఃఖంబులు యొండొరులకుఁ దెలుపుకొని, దుర్దాంతదురంత దుఃఖంబులం బొరలుచు, మిక్కిలి నాశ్చర్య సంతో

1. ఈ కందపద్యము ద్వితీయ పాదమున ప్రాస తప్పినది.

షంబులు మెఱయ భాగ్యవతీలలామ తన సుతునిం గనుంగొని, "తనయా! యుజ్జయినీ పురంబున సకలబంధువర్గంబులును, మీ పెదతల్లి, తండ్రియు సురక్షతంబుగనున్నవారే" యనిన నవ్విజయదేవుండిట్లనియె 140

కం. అమ్మా! యుజ్జయినీ పురి
కిమ్మగఁ జన నీదు తండ్రి- యేగెఁ గడు స్వ
ర్గమ్మునకుఁ బెదతల్లి గృ
హమ్మునకున్ బోవనన్న- దార్ద్రహృదయయై 141

తల్లితండ్రుల యెదుట మరల విజయదేవుఁడు కేదారేశ్వర వ్రతమహాత్మ్యముగ్గడించుట

ఉ. కొన్ని దినంబు లుంచుకొని- కొమ్మని విత్తమొసంగి పొమ్మనన్
యెన్నఁగరాని గృధ్రమది- యెత్తుకఁ బోయెను మల్లి యిచ్చినన్
యన్నము నారగింపఁగ మ-హాద్భుతలీల నదీతరంగముల్
పన్నుగ లోనికీడ్చుకొనె- భవ్యతరోజ్జ్వల నిష్కకుంభమున్ 142

వ. ఇట్లు దుఃఖంబున పునః జనినిఁ జోద్యంబంది, విప్రులవలన వ్రతంబు త్యజించు దోషంబని యెఱింగి, తద్వ్రతంబు నా చేతం జేయించి, వేరొక్క ధనకుంభంబు నొసంగినం గొనివచ్చుచుండఁ, బూర్వాపహృతం బగు విత్తంబు లభించిన గ్రహించుకొనివచ్చుచుండ, మార్గమ్మున చతురంగ బలసమేతంబుగా మజ్జనకుం గంటి, ననిన నాశ్చర్యంబునుం బొంది తన పతినిం గనుంగొని యిట్లనియె 143

గీ. తనర నాశ్వీజవరకృష్ణ-దర్శయందు
విజయదేవుండు వ్రతముఁ గా-వింపదాని

మహిమచే నీకు యిమ్మహీ-మండలంబు
ప్రాప్తమయ్యేను నిజము వో- ప్రాణనాథ! 144

ఉ. ఆ దినమాదిఁగాగ వసు-ధాధిప! నీవు మదేభరాజిపై
మోదము మీఱ మంత్రిజన-ముఖ్యులుఁ గొల్వఁగనెక్కివచ్చి న
ట్లాదటఁ గానుపించు మది-యందలి స్వప్నమునందుఁ బొందుగా
గాదనరాదు యవ్వ్రతము-గాంచినవారి కభీష్ట మియ్యదే! 145

వ. అప్పుడు కామవేది మహీపాలుండు 146

కామవేది మహీపాలుఁడు దూర్వాసమహామునిని ప్రశంసించుట

ఉ. మౌనికులావతంస! వన-మధ్యమునన్ మృగబాధమాన్పి మ
త్ప్రానుని భార్యనిర్వ్వరను- సొంపుగఁ బ్రోచితి వింకవారి స
మ్మానముఁ జేసి పంపుము ఘ-నంబుగ దీవనలిచ్చి వేడ్కతో
నేనొగిఁ గాంచి పట్టణము- కేగెద నాత్మబలంబుఁ గొల్వఁగాన్ 147

కం. అని యొక ధనకలశము గొ
మ్మని మునికి దుకూల భూష-ణావళులర్థిన్
బెనుపొందఁ నొసఁగి వలదన
ఘనసైన్యము తోడనరిగెఁ- గాంచికిఁ బ్రీతిన్ 148

కామవేది మహీపాలుఁడు భార్యాపుత్రులతో కాంచీపురమును ప్రవేశించుట

సీ. భూసురోత్తంసు ల-ద్భుతశక్తి వేదముల్
సరసవాక్యప్రౌఢి- స్వస్తిఁ జెప్ప

వారకాంతానేక- భూరిసద్ఘంటికల్
ఘల్లుఘల్లుమని నాట్య-గతులు నెఱప
వంది మాగధులు భూ-ధరకార్యశౌర్య ధై
ర్యంబులు పేరెత్తి- ప్రౌఢిఁ బొగడ
వైణికు లత్యంత- వీణారవస్ఫూర్తిఁ
బటుగాన వైఖరిఁ- బాటఁబాడ

గీ. శంఖ కాహళమురళీ వి-శాలభేరి
తమ్మటానేక తూర్యనా-దములుఁ జెలఁగఁ
గడురయంబున మంత్రులు- కామవేది
కెదురుగా వచ్చి పురిఁ జేర్చి- రింపుమీఱ 149

కం. ఆ పురి సర్వజనంబులు
భూపాలుని సుతుని సతిని- బొడఁగని వ్రతసం
దీపిత మహిమన్ బొగడుచు
బాపురే యని వగచి రధిక-భక్తిన్ యుక్తిన్ 150

వ. ఇట్లుక్కామవేది మహీశుండు నిజభార్యాసహితుండై గృహంబు ప్రవేశించి, రాజ్యంబుఁ బూజ్యంబుగాఁ బరిపాలించుచుండి, వ్రతంబు సేయ నుత్సుకతం జెంది కార్తీకమాసంబుదాకఁ నెదురుఁజూచుచున్న యవసరంబున 151

## కార్తీకమాసంబునకు ముందురోజునకై యెదురుచూచిన కామవేది కేదారేశ్వర వ్రతమును చాటించుట

ఉ. నీలధరావళుల్ మిగుల- నిర్మలవృత్తి రహించె, తెల్లు వి
స్తారముగా జనించె, హిమ-సంతతి కొంచెము హెచ్చరించె కే
దారమహావ్రత ప్రబల- ధర్మసుకీర్తినభంబు పాండురా
కారతఁ గాంచె శారద మ-కల్మషవృత్తి రహించె హెచ్చుగాన్ 152

ఉ. తప్పక కామవేది వసు-ధాస్థలిఁ గల్గిన మర్త్యకోటికిన్
గుప్పున భేరిభాంకృతులు- గొబ్బునఁ జాటగఁ బంచె తద్వ్రతం
బొప్పుగఁ జేయుడంచు మది-నొప్పకఁ బోయినవారిఁబట్టి మీ
రప్పుడె శిక్ష సేయుఁడని- యాత్మభటావళులన్ మహోర్భటిన్ 153

ఉ. తాను ప్రధానవర్గములుఁ- దప్పకఁ బిల్వఁగఁబంచికార్య సం
ధాన మెఱుంగఁ జెప్పి కల-ధౌతమయంపు గృహంబుఁ బట్టి నీ
శాన దిశానదీతటవి-శాల వటస్థలిఁ జేయఁ బంపుఁడో
మానుగ శిల్పకారకుల- మానిత చిత్రవిచిత్రవైఖరిన్ 154

ఉ. స్వామి! హసాదటంచుఁ జని- చయ్యన చిత్ర విచిత్రవైఖరిన్
తామటు నిల్చి శిల్పకులఁ- దద్దయుఁ బిల్వఁగఁ బంచివారిచే
సేమము మీఱఁగాంచన మ-ణీప్రచయంబుల మంటపంబులన్
ధామముఁ జేయఁ జేసి వసు-ధాపతికి న్నెఱిగింపఁ బ్రీతుఁడై 155

కం. ధరణీ సురవరకోటులు
ధరణీవర్గములు సుతయు- తద్దయు బ్రీతిన్
పురజనము భక్తియుక్తిన్
పరిచారక జనము సకల-బంధుగణంబున్ 156

వ. మఱియు పురోపాలీజనంబులు వ్రతద్రవ్యంబుఁ గూర్చుకొని, పరమా నందంబుతోడ నడువ, ఢక్కాకాహళమృదంగవేణువీణా శంఖతూర్య భేరీ ప్రముఖ మంగళతూర్యనాదంబులుం జెలంగ, వందిజనంబులు నభి నందింప, వారాంగనాజనంబులు పదచాతురీ విశేషంబుల నాట్యంబులు సలుప, విజయదేవుండు కాంచన ఘంటికా ఘణఘణత్కార ఝుణఝుణ త్కారనాదంబునన్ మొఱయ భద్రగజంబు నెక్కి నెదుటం జనుచుండ,

వేఱొక్కదంతావళంబునన్ మహీమండలాఖండలుండు నిజభార్యా
సహితుండై కూర్చుండి కేదారవ్రతంబు సేయ, మోదంబు డెందంబునన్
సందడింప, పురంబు వెడలి చనిచని 157

ఊరిబయట వటవృక్షము క్రింద భార్యాసహితుఁడై కామవేది కేదారేశ్వర
వ్రతమాచరించుట

కం. వటము శిఫాశోభిత ది
క్తటము ఘనాఘన విశాల- గగనకరీ స
ద్వటము ఛాయాదోర్ఝా
తటముఁ గని గజము డిగ్గి- తరుణీయుతుఁడై 158

కం. కనుఁగొని మోదముఁ బెనఁగొన
మనమున నవరత్నఖచిత- మంటపభాస్వ
ద్ఘనసుందరంబు మెచ్చుచు
మణిగణము లిచ్చె శిల్ప-మండలి కపుడున్ 159

చ. సకలజనంబులన్ నదికి- స్నానముఁ జేయఁగఁ బోవనాజ్ఞఁ జే
సి కడురయంబునన్ వ్రతము-సేయఁగ భూసుర ముఖ్యబంధు స
న్నికరముఁ గూడి తాను నిజ-నీరజలోచన పుత్రులిర్వురున్
యకుటిలవృత్తి నందమగు- నవ్వసుధాధిపుఁడేగె నేటికిన్ 160

ఉ. స్నానముఁ జేసి ధౌతవస-నంబులుఁ గట్టి సువర్ణమంటపం
బానఁగవచ్చి కాంచనమ-యంబగు పీటలఁ గూరుచుండి యిం
పూనఁగ భర్మలింగము మ-హోజ్జ్వలతన్ నవరత్నపీఠపై
మానుగ నిల్పి విప్రజన- మండలి మంత్రములుచ్చరింపఁగాన్ 161

వ. ప్రాణప్రతిష్ఠం గావించి, పంచామృతంబుల నభిషేచనంబుఁ జేసి, గంధా క్షతలనిడి, కుంద, మందార, కదంబ, బిల్వ, దూర్వాంకుర, పాటలీ ప్రముఖ నిఖిల కుసుమంబులన్ పూజించి, ధూపదీపనైవేద్యము లొసంగి, కరమ్మున తోరంబు ధరియించి, యక్కేదారేశ్వరుని సభక్తిపూర్వకంబుగా కరంబులు ముకుళించి యిట్లని స్తుతియించె 162

దండకము

శ్రీమన్మహాభూమిభృజ్జామనోనాథ! హే శంకరా! దుష్ట నాశంకరా! నీదు పాదాంబుజధ్యాన మేమారకన్ భక్తియుక్తిన్ పఠింతున్ దలంతున్ మదిన్ వే యమోఘాత్మ నామావళిన్ కాంచనాద్రీంద్ర బాణాసనా! రౌప్యభూభృల్ల సద్దివ్య సింహాసనా! నీ మహత్త్వంబు మున్ గానకన్ దుష్క్రియావర్తనన్ జేసితి న్నెన్న నాపన్న రక్షా! మదిన్ నిల్పవే! దుష్టశిక్షా! కఠోరంబు గాఁ బాపంబులన్ బాపవే! యంజలిన్నీ భృత్య వర్గంబులంజేరి నిత్యంబు నే గొల్చెదన్, మన్మథోత్తుంగ గర్వాపహా! హేధరాశరాసనధారే! పురారే! వడిన్నిట్టి కష్టంబులన్ బొందజేయకే! రోయకే! వేదాంతవేద్యా! భక్తజన వశంవదా! కడున్నీ వ్రతంబింపుగా సొంపుగా జేతునే! మానకన్ మీఱకన్ పూనకన్ సూర్యచంద్రాగ్నినేత్రా! స్ఫురద్వజ్రగాత్రా! మహాఘోరదుర్దాంత సంసారవారాశిలో ముంచకే! నొంచకే! భూశతాంగా! మదోత్కృష్ట మాతంగ భంగా! తరంగా! ప్రగల్భ్యాపగా శ్లిష్టదివ్యోత్తమాంగా! తగన్మేహశూలాక్షి శూలాతి వాతాదిరోగంబులన్ కడున్బొంద నీకే! మహేంద్రాది దిక్పాల సర్వాఘప్రక్షాళ కోటీర! కోటీతటన్యస్తరత్నప్రభా! జాలసన్మౌళితోద్య ధృతాంభోజ భృత్యామరేధ్భూజ! దక్షుండు విన్గానకన్ రుద్రహీనంబుఁ యజ్ఞంబుగావించిఁ దా మించెనే!? కీర్తి రాణించెనే!? పంచబాణుండు చాంచల్యమున్ జేతునంచున్ లలాటాగ్నిచే గాలడే! కూలడే! వేడ్కఁ దా నీసునన్ భృంగిఘోటాకృతాంతుండు నుద్వృత్తి వైరంబునన్ గమ్మి తా

ోడడే! వీడడే! యుష్మదత్యంత కైంకర్యకోటీ త్రిపుర్గర్వనాశా! త్రిలోకేశ!
ూతేశ! వాతాశి సత్కంఠభూషా! సుధాతుల్యభాషా! శరచ్చంద్రాబ్జ
ందార విద్యోద్భవా! భేక్షణాశంఖహారా! మాలినీ భృద్భుజంగేంద్ర!
జన్య సంసాంద్ర! దంభోళి దోస్సార! హైమాద్రి ధైర్యా! మృగేడ్ధైర్య!
ారాశి గాంభీర్య! సర్వాత్మనే! నమస్తే! నమస్తే! నమః 163

ఇట్లు ప్రదక్షిణ నమస్కారంబుఁ గావించి యనంతరంబున 164

భూదేవోత్తమ! కోటిపాదయుగమున్- బూజించి సత్పాత్రులన్
కేదారోద్భవ శుభ్రతండులములన్- గీర్తింపఁగా చూసి
"కేదారాయ నమోస్తుతే!" యనుచు భ-క్తిన్ వాయనంబిచ్చి స
మ్మోదం బందుచు భూరిదక్షిణలచే- ముఖ్యంబుగా భార్యతోన్ 165

. కొమరుఁడు దాను భార్యయును- కోరిక మీఱఁగ విప్రకోటికిన్
యమిత సువర్ణ గోరజ ర-థాశ్వ దుకూల రౌప్య భూ
ప్రముఖ విశేష దానములు- భక్తియుతంబుగ ధారఁ బోసి రా
ప్రమథగణేశు శంకరుని- భావములో స్మరియించి హెచ్చుగాన్ 166

. ఇట్లు సకల జనంబులు వ్రతంబుఁ జేసి, తమ శక్త్యనుసారంబుగా ననేక దానంబు లొసంగి, యమ్మహీపతి భూసురసహితుండై పంచభక్ష్య పరమాన్నంబులన్ భుజియించి, సకల సైన్యపరీవృతుండై కాంచీపట్టణం బుఁ జేరి, తమతమ గృహంబులన్ సుఖంబుండిరి. రాజేంద్రుండు రఘు దిలీపాంబరీషాది రాజన్యులంబోలి రాజ్యపరిపాలనం బొనరింపుచు, చతు ష్పాదంబుల భూమి నడిపించుచు, ననేక క్రతుహోమ భూసుర సమారా ధనంబులం దత్పరుఁడై, హరిస్మరణానురాగుండై, సుఖంబుండెనని కృష్ణుఁడు ధర్మనందనునికిఁ జెప్పిన విని, సంతుష్టాంతరంగుండయ్యె 16

## ఆశ్వాసాంత పద్యములు

ఉ. అంగజభస్మశోభిత! వ-రాంగ జనార్దన! భూరిబాణ సా
రంగ విభుత్సురేంద్ర! గజ-రాజ విరాజిత హస్తిహస్త వా
మాంగ హిమవనీంద్ర తను- జాంబుజ లోచన కుంభి దైత్య భి
ద్రంగ దభంగ భంగ ఖచ-ర ప్రధునీ ధర దివ్య వస్త్రకా! 168

### మాలిని

రజత గిరినివేశా! -రంజితవ్యోమ కేశా!
కుజన మదవినాశా! -గోత్రజా మానవేశా!
భుజగవరవిభూషా! -పుణ్యలోకానుపోషా!
అజరవినుతవేషా! -న్యాయకృద్దివ్యభాషా! 169

### గద్య

ఇది శ్రీపంచవక్త్రహనుమత్ప్రసాదలబ్ధ కవితావిచక్షణ
క్రిష్టిపాటి వంశపయఃపారావారరాకాసుధాకర
ముల్కినాటికుల కాశ్యపగోత్రపవిత్ర
వేంకట్రామార్యపుత్ర
వేంకయకవి ప్రణీతంబైన
కేదారోపాఖ్యానంబున
దృతీయాశ్వాసము
సర్వము సంపూర్ణము

****

# కేదారోపాఖ్యానము
# వ్రాతప్రతుల వివరాలు

## ప్రాచ్య పరిశోధన సంస్థ గ్రంథాలయం
## శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం
## తిరుపతి

1. కేదారోపాఖ్యానము - క్రిష్టిపాటి వేంకట సుబ్బకవి, paper Ms. Stock. No. 347, Complete, See. Descriptive Catalogue of Telugu Paper Manuscripts - Dr. K. J. Krishna Murti & Dr. M. PrabhakaraRao, S.V.U.Oriental Series No. 19, 1988, pp. 10-11 & 93.

| | |
|---|---|
| 2 కేదారేశ్వర వ్రత కథ - (వచనము), | PL, D 899, Complete |
| | PL, D 1409, Complete |
| | PL, D 2662, Incomplete |
| | P, R 1627 Complete |
| 3. కేదారేశ్వర వ్రతకల్పము - | PL, R 946, Complete |
| | PL, D 2076, Complete |

## ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్య
## పరిశోధనా సంస్థ గ్రంథాలయం,
## హైదరాబాదు

| | | |
|---|---|---|
| 1. ఆంధ్రవ్రతరాజము - కొల్లూరి కామశాస్త్రి, | P. 1812, | Complete |
| 2. కేదారగౌరివ్రతకథ - మంగళహారతి, | PL 4578, | Complete |
| 3. కేదారేశ్వర వ్రతకథ - - | PL 5023, | Complete |

See; An alphbetical subject wise index of Telugu Manuscripts in the APGOML & Research Institute, Hyderabad, 1983, pp.140-142.

## మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత
## పుస్తక భాండాగారము, చెన్నై

1. కేదారేశ్వర వ్రత కథ - PL 10-12-5, Complete
PL 11-03-9, Complete
PL R 206, Complete
Pa 13-4-29, Complete

See; An alphabetical index of Telugu Manuscripts inGovernment Oriental Manuscripts Library, Cheenai, 1932, pp. 32.

## ఆంధ్ర సాహిత్య పరిషత్
## ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము
## కాకినాడ

1. కేదారవ్రత కథ (సంస్కృతం) - Almairah No. 5, Ms. No. 3662
2. కేదారవరలక్ష్మి వ్రతకల్పము - Almairah No. 9, Ms. No. 2097

గమనిక:- తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయంలో కేదారేశ్వర వ్రత కథకు సంబంధించిన తాళపత్ర లేక కాగితపు ప్రతులు లేవు.

*****

# ఉపయుక్త గ్రంథ సూచిక

# BIBLIOGRAPHY

1. వ్రత కోశః (ప్రథమో భాగః) - జగన్నాథ శాస్త్రి హోషింగ్,
The Princess of Wales Saraswati
Bhavan Texts, No. 28, Ed., Gopinath
Kaviraj, Banaras, 1929.

2. వ్రతకోశము - (మొదటి భాగము) - కనుపర్తి మార్కండేయ శర్మ
స్వధర్మ ప్రకాశినీ సంపాదకుడు
మద్రాసు, 1931

3. వ్రతచూడామణి - వావిళ్లరామస్వామి శాస్త్రులు & సన్స్
మద్రాసు, 1935

4. ఆరు వ్రతాలు - ఎస్. వి. గోపాల్. & కో
37, కృష్ణప్పనాయకన్ గుంటవీధి
మద్రాసు, 1982

5. వ్రతకథలు (పద్యకావ్యం) - చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి
వేంకటేస్వర పబ్లికేషన్స్
కడియం (P.O), తూ.గో.జి., 1952

6. పుణ్యవతీ, భాగ్యవతి (కేదారేశ్వర వ్రతమాహాత్మ్యకథ) - వేటూరి ప్రభాకర శాస్త్రి
ఆనంద వాహిని పత్రిక, సం. 1
సం. 7-10, ఆక్టోబర్, 1930

పునర్ముద్రణ - మణి మంజరి, వాఙ్మయయోగ పరిశోధన ప్రతిక,Vol. 3, సం. 1, February, 1983, పుటలు. 64-67

7. స్కాంద పురాణం (సంస్కృతం) - 9 సంపుటాలు శ్రీవేంకటేశ్వర స్టీమ్ ప్రెస్, ముంబాయి, 1908

8. స్కాందపురాణం (English translation) - Ancient Indian Traditiion & Mythology, General Editor - J.L. Sastri & others, vol. 49-62 Motilaldas Banarasse Dass Delhi, 1997

9. కాశీ ఖండము - శ్రీనాథుడు, ed., ఉత్పల వేంకటనరసింహాచార్యులు వావిళ్ల, మద్రాసు, 1933

10. శ్రీశైల ఖండము - స్కాందపురాణాంతర్గత సనత్కుమార సంహిత అత్తలూరి పాపయారాధ్యుడు, S.V.U.O.R.I Mss. Library, Tirupati.

11. History of Dharmasastra - P.V. Kane, vol. 5, Pt. 1, pp. 1-142, BORI Poona, 1962

12. Karpasa in Pre-Historic India -A Chronological & Cultural Clue
K.D. Sethna, Biblia Impex
Private Ltd., New Delhi, 1981

13. Temples of North East Inida - K.K. Moorthy, Message
Publications, Tirupati, 1994.

14. దత్తప్రభు శతకం - క్రిష్టిపాటి వేంకటసుబ్బకవి
పరిష్కర్త వైద్యం వేంకటేశ్వరాచార్యులు
గురుదేవదత్త ధరణి సీతారామస్వామి
భక్త సమాజము, ఆళ్లగడ్డ,
కర్నూలు, 1988

15. దీబగుంట వీరభద్ర చరిత్ర - క్రిష్టిపాటి వేంకట సుబ్బకవి
(కళ్యాణరాజ చరిత్రము) పరి., మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రి
ప్ర., సారెడ్డి వీరారెడ్డి, నంద్యాల, 1946.

16. చాటుపద్య మణిమంజరి - (సం - 2), వేటూరి ప్రభాకర శాస్త్రి, 1922
పునర్ముద్రణ. మణిమంజరీ ప్రచురణలు,
హైదరాబాదు, 1988, పుట. 206

17. సాలగ్రామ శాస్త్రమ్ - ed., కపిలవాయి లింగమూర్తి,
నాగర్ కర్నూల్, మహబూబ్ నగర్, 1988

18. సాలగ్రామ కోశం - (vol. 1 & 2) - S.K. Ramachandra Rao
Kalapataru Publications,
Bangalore, 1985.

19.సంఖ్యావాచక పదకోశము - బి . అనంతరావు
శ్రీ మహాలక్ష్మీబుక్ ఎంటర్ ప్రైజస్
విజయవాడ, 1989, పుట.726-27

20. Kama Sutra of Vatsayana(Eng. tr) - S. C. Upadhyaya
Pub. D.B. Taraporewala
Bombay, 1974

****

అకిఞ్చనస్సన్ ప్రభవ స్స సమ్పదాం
త్రిలోకనాథః పితృ సద్మగోచరః।
సభీమరూపః శివ ఇత్యుదీర్యతే
న సన్తి యాథార్థ్య విదః పినాకినః॥

- కాళిదాసు కుమారసంభవమ్

శివుఁడు అకించనుఁడు. ఏమీ లేనివాడు,
అయితే అందరికీ ఐశ్వర్యం ఆయనే ఇవ్వాలి.
శ్మశానాలలో ఉంటాడు; కాని, మూడు లోకాలకూ ప్రభువు.
ఆయన రూపం భయంకరంగా ఉంటుంది.
కాని, ఆయనను శివుడు అంటే మంగళ ప్రదుడని పిలుస్తారు.
పినాకమనే ధనుస్సును ధరించిన ఆ పరమశివుని
యథార్థస్వరూపం తెలిసిన వారెవరూ లేరు!

****